శ్రీరస్తు

# మ ణి మే ఖ ల



## విషయసూచిక

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 8 | చున్నవి | చున్నది |
| 5 | 9 | యవ | యువ |
| 8 | 7 | జంపిం | చంపిం |
| 18 | 16 | పటు | పట్టు |
| 30 | కారిక 29 పుటలో నుండవలయు. | | |
| 39 | 9 | వానికి | వాని |
| 76 | 17 | వాఁరై | వారై |
| 98 | 11 | తన | తమ |
| 105 | 15 | బుద్ధి | బుద్ధి |
| 106 | 9 | [1]యన్నము | యన్నము |
| ,, | 10 | నశుభ | [1]నశుభ |
| 109 | 9 | నుండ | నుండి |
| 124 | 15 | సై్వైరము | స్థైర్యము |
| 129 | 14 | వర్దిల్ల | వర్ధిల్ల |
| 139 | 6 | బలసి | బలిసి |
| 154 | 9 | గలగుడు | గల గుడు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 155 | 21 | వెలుగ | వెలుంగు |
| 162 | 3 | చిట్లనియె | చు నలలు |
| 173 | 15 | మూాసికూార | మూాయజనులు |
| 195 | 18 | దెశ | దేశ |
| 205 | 5 | తన | తమ |
| 208 | 4 | సు త్త | సు త్త |
| 216 | 13 | జినులు | జనులు |
| 223 | 12 | సీత | నాత |
| 257 | 4 | కుందిప | కుందింప |
| 281 | 20 | మంతము | మంత్రము |
| 324 | 2 | వర్థంబు | నర్థంబు |
| 335 | 12 | వినుటయు | వినుటయు |

# పీఠిక

అఱవమునకుఁ దెనుఁగు నేఁత కష్టసాధనీయమని కంబ రామాయణము తెనిఁగించు తఱి ననుభవించి యెఱింగితి. ఆపై మదీయ హితైషులై యుండిన శ్రీ॥ కట్టమంచి రామలింగా రెడ్డిగారి ప్రోత్సాహము నూఁతగఁగొని స్వశక్తి నించుకయుఁ బాటిగొనక సాహసించి 'అందియకత' (శిలప్పదికారము)ను తెనిఁగించుచోఁ నది యసాధ్యకార్యమని భయమందితి. అయిన శ్రీరామచంద్రుని కృపచే నెట్లెట్లో గట్టెక్కితి. అట్లుండియు బుద్ధి చాపలమున మణిమేఖలను దెనిఁగింపఁ బూనిన నా వెడఁగుఁ దనమును పెద్దలు మన్నింతురు గాక యని తొలుదొల్త వేఁడుచున్నాఁడను.

అందియకత సంగీత ప్రాధాన్యమునొందిన కావ్యమైన యట్లు మణిమేఖల మతధర్మప్రాధాన్యము నొందినది కావున తేనెలోఁ దగులువడ్డ యీఁగ తప్పించుకొని శ్లేష్మమునఁ బడినట్లైనది నా బ్రతుకు. నడుమంత్రముననే చాలించుకొనవలసిన వాఁడను. ప్రాఁతప్రాఁత కాలపు సంగీత మత పద్ధతులు క్రొత్తక్రొత్తరుచులఁ గలిగించుటచే 'కమనీయంబగు వేఁటకాని పదు రాకర్ణించి నిక్కంబుగాఁ దమచిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణ నిర్భిన్నలై యమితోగ్రవ్యథ' నొందిన యట్లైనది. నా యీ యత్నమెంతవఱకు కృతార్థమో యిది యాంధ్రవాఙ్మయ

ప్రపంచమునకెంత యుపకారమో అది పెద్దలపని. ఏదో యొక కొంత మట్టు ద్రావిడవాఙ్మయ స్వరూపము నాంధ్రులకుఁ గల లోని లిబ్బివలెనైనఁ జూపఁగలిగితినను నానందము నా హృదయమున కేర్పడినది. అదియు లేకున్న నీకార్యము చేసియుండఁజాలను కదా!

ఈ కావ్యమును ద్రవిడభాషయందు రచించి నతఁడు శాత్తన్ అను కవి ఇతనికి 'శాత్తనార్' 'శీత్తలై శాత్తనార్' అని పేరు. ఇతఁడు కడపటి మధుర సంఘకాలమువాఁడు. ధాన్య వర్తకుఁడు. తిరువళ్ళువర్ అను మహాశయుని (కుఱళ్) త్రివర్గము లోని వాక్యముల నందందు వాడియుండుటచే నతనికి తరువాతి వాఁడో సమీపకాలపువాఁడో యైయుండవచ్చు. 'శాత్తనార్' అనుపదము శాస్తయను పదమునకు వికృతి, కావున నితఁడు బౌద్ధుఁడై యుండెననుట సంశయాస్పద విషయముకాదు. ఈ కావ్యము నితఁడు బౌద్ధమత వ్యాప్తికే యే రచించియుండు టయుఁ బై వాక్యమును బలపఱచుచున్నది. ఇతర మతముల నటనట ఖండించియుండుటయు దీనికిఁ బ్రబలాధారము.

ఈ కవికి 'శీత్తలై' యను పదము చేర్చఁబడుటకు కారణము రెండు విధములుగాఁ జెప్పుదురు. మొదటిది ఊరిపేరు శీత్తలై. రెండవది పెద్దకత. ఇతఁడు సంఘకవియైయున్న కాలమున నితర కవుల గ్రంథములు విమర్శకై వచ్చినపుడు తప్పులున్న

చోట నిధి విసవలసివచ్చెనే యని తన తలను మొట్టుకొను వాఁడఁట. అందుచే నితని తల పుండై చీము సదా కాఱుచుండెడి దఁట! కావున శీత్తలై (చీముతల) శాత్తనార్ అనుపేరు ప్రసిద్ధి కెక్కినదందురు దీని కాధారముగను కొందఱు తరువాతి కవుల వాక్యములుకలవు. అందొకటి:— 'వళ్ళువకవి (కుఱళ్) త్రివర్గము శాస్త్రకు తలపోటు మాన్పినది' అని దామోదరకవి త్రివర్గమును పొగడుచుఁ దెల్పెను. ఈ కథ యితని పాండిత్యాతి శయమును శాంతగుణమును వెల్లడించుచున్నది.

ఇతఁడు తొలుత కన్నగి కథను యువరాజస్వామికిఁ (ఇళంగో వడిగళ్) దెలిపి ప్రోత్సహించి యతనిచే నా కథను కావ్యముగా వ్రాయించి వినెను. తరువాతఁ దాను మణిమేఖలా కావ్యమును వ్రాసి యువరాజస్వామికి వినిపించెను. అది యితనిది యతనికి నంకితమని భావము.

అందియ కత (శిలప్పదికారమున) యందువలెనే యిందును మూఁడురాజ్యములు ముఖ్యపట్టణములు అందలి సంపదలు కన్నులఁ గట్టినట్లు మనోహరముగ వర్ణింపఁబడినవి. అచ్చటచ్చటి చేతిపనులు, పంటలు, వ్యాపారములు మొదలైన తక్కిన పెక్కింటి వర్ణనములు రమణీయములై యున్నవి. అం దందు రూపకాలంకారములు కానవచ్చుచున్నవి. కాని విశే షించి స్వాభావికాలంకారమే తగిన యుపమలతోఁ గనులకుం

జెవ్రులకుం బందువు కలిగించుచున్నవి. తపస్వులు రాజున కతని కుమారుని మరణావృత్తాంతమును దెలుపుటయు, చిత్రాపతి గాకుమారుఁ బ్రోత్సహించుటయుఁ బాతివ్రత్య మహిమం దెలుపు ఆదర్శి, మరుది యనువారి కతలును సుతమతియు మణిమేఖలయు నుద యునకు నేని యస్థిరత్వముం దెలుపుట మొ॥ పట్టులు ఈ కవి సమయోచిత శక్తిని బాగుగ వెల్లడించుచున్నవి.

ఈ గ్రంథమును పెక్కు ప్రతులు సంపాదించి పరిశోధించి వలసినంతవఱకు లఘుటీకయుఁ విపులమగు పీఠికయు వ్రాసి యచ్చొత్తించిన మహామహోపాధ్యాయ దాక్షిణాత్యకలానిధి శ్రీ వే. స్వామినాథయ్యగారికి సదా కృతజ్ఞుఁడను వారి పరిశ్రమము నా శ్రమమును తగ్గించినది.

ఈ కావ్యము బౌద్ధమతధర్మములను చాలవఱకు వ్యాపిం పఁజేసిన యదికావున బౌద్ధులకు ముఖ్యమణిత్రయమైన బుద్ధుని గూర్చియు బౌద్ధధర్మములఁ గూర్చియు సంఘమును గూర్చియు సంగ్రహపద్ధతినైనఁ జర్చించుట యసంగతముకాదు. బుద్ధుని జన్మాదికమును తాపసవృత్తిని దెలుపు గ్రంథములు తెనుఁగునఁ బెక్కులు కలవగుట విస్తరించి వ్రాయవలసిన యక్కఱయు తగ్గినది. ఇట వ్రాయఁబడునది ద్రవిడదేశమున బౌద్ధమత గ్రంథములం దెలియవచ్చిన విషయమే.

# 1. బుద్ధ చరిత్రము

భరతఖండమున నుత్తరకోసలదేశమున రోహిణీనదీతీరమునఁ గపిలవాస్తువను నగరము కలదు. దాని నిక్ష్వాకువంశపరంపరలోఁజేరిన * శుద్ధోదనుఁడను రాజేలుచుండె. అతనికి శుక్లోదనుఁడు, అమృతోదనుఁడు, ధౌతోదనుఁడు, కనితోదనుఁడను నలువురు తమ్ములును, ప్రమిత, అమృతయను నిరువురు చెల్లెండ్రు నుండిరి. శుద్ధోదనుఁడు కోలియ దేశాధిపతియగు అంజనుని పుత్రికలగు ♦ మాయాదేవిని గౌతమిని పెండ్లాడెను. గౌతమికి ప్రజావతి యనియు పేరు కలదు. వారికి చాలకాలము వఱకు సంతానము లేకుండెను.

## బుద్ధజననము

ఇట్లుండ తుషితలోకవాసియగు ప్రభాపాలుఁడను బోధిసత్త్వుఁడు జీవులను దుష్పథమునుండి సత్పథమునకు మరలించి యుద్ధరింప వేడుకపడి యొకనాఁడు స్వర్ణమయమైన దేవవిమానమునవచ్చి మాయాదేవీ శుద్ధోదనుల స్వప్నమునఁదోఁచి వారికిఁ దాఁ దనయుఁడుగ నుదయించుట మున్నుగ నుడివి పదపడి

* శుద్ధోదనుఁడు మాయాదేవి మున్నగు బుద్ధుని కుటుంబమువారి పేరులు విమర్శించి చూడ సార్థకములు. ఆత్మవిచారపరులకు సమంజసమైన రెండవ యర్థమునిచ్చుచున్నవి.

♦ మాయాదేవి శుద్ధోదనుని చిన్న భార్యయని కొన్ని గ్రంథములందుకలదు.

మాయాదేవి గర్భమునఁ బ్రవేశించె. *సర్వాంతర్యామి యగు భగవంతుఁ డిట్లు కావించెననియు మాయాదేవి యొకషట్కోణ నక్షత్రము తనగర్భమునఁ బ్రవేశించినట్లు కల గని యావల గర్భము ధరించెననియుఁ గొందఱందురు. అత్తఱి నామె వయస్సు నలువదియైదేండ్లు

మాయాదేవి గర్భము ధరించుటకును తనకు లేమికిని ఓర్వలేక గౌతమి పెక్కుమాఱు లామెను జంపింప యత్నించెను. యత్నించియు విఫలమై తుదకు తనచేసిన దోసములకుఁ బశ్చాత్తప్తయై యదిమొదల ననుకూలవతియై యుండె. ఒకనాటి రేయి మాయాదేవి స్వప్నమున బ్రభాపాలుఁ డామెగర్భమునుండి వెలువడి యామె నడచుకొనవలసిన విధుల నుపదేశించి మరల గర్భమునఁ జొచ్చెను. ఆమె యచ్చెరువాటొంది యావిధముననే నడచుచుండె. సామాన్యముగా గర్భిణులకుఁ గలుగు వాంతులు నొప్పులు మున్నగునవి యామెకు లేకుండె. ప్రసవసమయ మాసన్నమయ్యె. కాఁగా నామె పలువిధముల నింపైన దృశ్యములుగల లుంబినియను పుష్పవనమునఁజేర వేడుకపడి రాజునకుఁ దెలుప నతఁడు వల్లెయని వలసిన పరిచారికావర్గముతో నామె నచటికిఁ గొంపోయి యవ్వనమందలి మేడలోనుండి మాయాదేవితో పుష్పించిన యశోకవృక్షమూలము జేరి యచ్చోట

* ప్రవేశించినకాలము ఈశాన శకాబ్దము ౬౭-వ వత్సరమని బర్మా యందలి బౌద్ధగ్రంథములు తెలుపుచున్నవి. అప్పటి నక్షత్రము ఉత్తరాషాఢ.

మయూరము కలాపమువిప్పి యాడుచుండుటయు దాని కనువుగ కలవింకమను పక్షి పాడుచుండుటయు కని విని చూపులకు వీనులకు విందు సేయుచు నానందించుచున్న యా దేవింగాంచి తత్పతి ఈ కొమ్మయందలి పూవొండు తనకుఁ బిదిమి యిమ్మని యర్థించె. చిఱునగవుతో నయ్యమయు విరులఁ గోయఁ గొమ్మమీఁదికి గుడిచేయి చాఁచె. అట్టియెడ పూర్వము ఔర్వుఁడు తన తల్లి తొడనుండియు, పృథువు వేనుని చేతినుండియు, మాంధాత ఉపోషితుని (యువనాశ్వుని) నొసటినుండియు, కక్షీవంతుఁడను ముని *సుదేష్ణాదేవి కక్షమునుండియు వెలువడినట్లు ప్రభావాలుఁడౌ మాయాదేవి గర్భమునుండి యించుకేని యామెకు బాధ కలిగింపక మెల్లమెల్లగ నామె కుడిప్రక్కనే మగబిడ్డయై వెలువడి యాపె చరణసన్నిధిని ఆ సమయమున తేరిచక్రమువలె పెద్దదిగా మొలచి కానవచ్చిన యిందీవర పుష్పముపై నుండెను. అతఁడు జనించిన ♦దినము వైశాఖశుద్ధ పూర్ణిమ. ఆ క్షణముననే దేవ రాజులు నలువురును నందోపనందులను నాగరాజు లిరువురును అటకు వచ్చి పూర్వ మవతరించిన బుద్ధుల కాచరించిన తీరున నుపచారములు కావించి మరలిరి. అవ్వల నా శిశువు నీలాంబుజమునుండి సింహకిశోరమువలె ఏడడుగులు నడచివచ్చి తాను బుద్ధావతారమని యటనున్నవారలకుఁ దెలిపె. అంత వెచ్చనయు

* బలియను రాజుభార్య

♦ ఈశాన శకాబ్ది ౬౮_వ యేఁడు శుక్రవారము. చూ ౧౫ ప్ర.

చల్లనయున్నైన నీటి వెల్లువలు రెండు * అంతరిక్షమునుండి దిగి వచ్చి యతని బోరుకాడించినవి. వేలుపులు విరులవాన కురిసిరి. మిన్ను పరిశుద్ధమై యలరారె. ♦ శుభనిమిత్తములు పెక్కు లయ్యెడఁ దోఁచె. చెడుత్రోవల కధికారియైన మారుఁడొక్కఁడే అయ్యెడఁ జింతించినవాఁడు.

శిశువునెడ మాయాదేవికంటె గౌతమి యధిక ప్రేమ చూపుచు లాలనపాలనములు సేయుచుండె. బిడ్డయు గౌతమి యెడ నత్యధిక ప్రేమ చూపెను. జ్యోతిష్కుఁడొక్కఁ డరుదెంచి శిశులక్షణములఁ జక్కఁ బరిశీలించి 'యుత్తమాచార్య లక్షణము లన్నియు నితనియం దున్నవి. కాన నితఁడు సన్న్యసించి లోకు లకు ధర్మోపదేశము చేయువాఁడగును. ఇతనిచే లోకము మిక్కిలి మేలొందఁగలదు'. అని పలికి బహుమతులొంది పోయెను. కన్నశ్రమ లేవియు లేకున్నను మాయాదేవి ఏడవనాఁడు ఆనందాతి శయముచేఁ బ్రాణములు వీడెను.

'బుద్ధుని తల్లి ఎండ్రిడి శుక్తి కదళి వెదురు తమ గర్భము వలననే మృత్యువు నొందె' నని లోకవచన మను గ్రంథము నొడువుచున్నది. నీలకేశి యను గ్రంథమున బుద్ధమాతలెల్లరు నిట్లే ఆఱునాళ్ళు కొనయూపిరితో నుండి యేడవనాఁడు మృతి నొందినవారని యున్నది.

---

* ఆ వెల్లువలు మాయాదేవి సమీపమున భూమినుండి పైకిలేచిన వనియు గొన్నిచోట్లఁ జెప్పఁబడినది. ♦ చూ. ౧౩ ప్రక

మాయాదేవి కళేబరమును దహించి యెమ్ములను బూది నొక కుండలోనుంచి ఆమె వసించుచుండిన మాళిగను అస్తగిరి యను మలయందు పెకల్చి కట్టించి యందుంచిరి. జ్ఞాపకార్థ మా మాళిగకు ప్రక్కనొక యాలయము నూటయిరువదియడుగుల పొడవుగలదిగఁ గట్టింపఁబడి ఆమె ప్రాణములు వీడినకడ నుండిన యశోకవృక్షము పెకల్చికొంపోఁబడి యా గుడియెదుట నాటఁబడినది. గౌతమియే తొలినుండి యా శిశువు నల్లారుముద్దుగఁ బెంచుచుండె నిసుగునకు సిద్ధార్థుఁడను పేరు పెట్టఁబడియె.

సిద్ధార్థునకు యుక్తకాలమున నక్షరాభ్యాసము జరిగినది. *మిత్రుఁడను గురువునొద్ద పెక్కుకళ లతఁడు నేర్చెను. అతనికి వయసుతోపాటు మేనితోపాటు జీవకారుణ్యాది సద్గుణములు క్రమముగా వృద్ధిపొందినవి.

ఒకనాఁడు అసితుఁడను మునివరుఁడు రాజుకడ కరుదెంచి సిద్ధార్థుని శుభలక్షణముల సహస్రారచక్రరేఖ మున్నగువాని వీక్షించి 'పరిపూర్ణ బుద్ధునకుండవలసిన లక్షణము లన్నియు నితనియెడఁ గలవు. మనుష్యవృక్షమున పెక్కుశతాబ్దులకొక పూవుగాఁ బూచిన దీశిశువు. నీ కులగౌరవము నేమనఁగలను? ఇతఁడు సన్న్యాసము గొని లోకరక్షకుఁడుగా నుండును'. అని వక్కాణించెను. తండ్రికిఁ గలిగిన యప్పటి శోకానందముల వర్ణింప నలవియగునే?

---

* విశ్వామిత్రుఁడని కొన్ని గ్రంథములలో కానఁబడుచున్నది.

ఇట్లిరువురు మువ్వురా బాలకుని సన్న్యాసి యగునని పలుకఁగా తండ్రి లోలోనఁ జింతించి యైహికజీవితమం దతనికొక కొఱఁతయు లేకుండునట్లును నిర్వేదము కలుగకుండునట్లును మహాప్రయత్నములు చేయుచుండెను.

ఆ దినములలో నొకనాఁ డుద్యానమున చెలికాండ్రలో నొకఁడగు దేవదత్తుఁడు పడవైచిన హంసమును గౌతముఁ డెత్తుకొని నాటిన యమ్మును లాగివైచి చికిత్సచేసి యది తనది యని వాదాడిన దేవదత్తున కీయనందున నతఁడు కోపముతో పగగొని తన యాప్తులైన కొందఱు మిత్రులను చీలఁదీసికొని వేఱుచోటి కేగెను.

## యౌవరాజ్యాభిషేకము

గౌతముని పదునై దేండ్లప్రాయముననే తండ్రి యౌవరాజ్యాభిషేకము చేసెను. పిదపఁ దనమఱఁదియగు సుప్రబుద్ధుని కూఁతును యశోధరను కుమారునకు *పాణిగ్రహణము చేయించె. అప్పుడతని వయస్సు పందొమ్మిది. యశోధరతో గౌతముఁడిష్టోపభోగము లనుభవించుచు వేఱొండరయఁక కొంతకాలముగడపెను. అదిగని బంధులు కొందఱు శుద్ధోదనుకడ కేగి యువరాజునకు ఆయుధాభ్యాస మించుకేని లేదుగదా! యుద్ధావసరము కలిగెనేని

* చూపఁబడిన పెక్కండ్రు రాజకన్యలలో యశోధరనే యతఁడు వరించెనని యొకచోఁగలదు.

అప్పుడేమి చేయఁగలఁడని యడిగిరి. అవ్వార్తవిన్న సిద్ధార్థుఁడు వారినందఱ నొకనాఁడు రప్పించి వారియెదుటఁ దన యాయుధ కౌశలమును ప్రకటించి వారిప్రశంసకుఁ బాత్రుఁడయ్యె. *

నిమిత్తకుఁడును అసితుండును చెప్పిన చొప్పున సన్న్యాసి యగునేమో యని లోన దిగులూనిన రాజతని కుద్యానవనమున వసంత వర్ష హేమంత ఋతువులలో నుండఁదగు భవనములఁగట్టించి వలయు సౌకర్యములు కొఱఁతలేక కావించియుంచెను. ప్రాకారము లెత్తుగఁ గట్టించి నాలుగు వాకిండ్లుంచి మంచివీరులను పెక్కండ్రను కావలియుంచి సన్న్యాసులను వికలాంగులను అందు చొరనీయక కట్టుదిట్టములు చేయించెను. ఇట్లు చేయించుటచే గౌతమునకు చాలకాలమువఱకు ప్రాణులకు రోగము, ముదిమి, చావు కలదను స్మరణమే కలుగకుండెను.

## వైరాగ్య మూల కందము

ఇట్లుండ నొక్కనాఁడు తండ్రి లుంబిని వనమునకుండి కుమారు నచటికి రాఁగోరె. గౌతముఁడు శిబికనెక్కి తూరుపు వాకిలిత్రోవనేగుచు రోగినొకనిఁ గని యెల్లవారికి రోగములు రాఁగలవియే యనియెఱిఁగెను. మఱియొకనాఁడట్లే యరుగుచు నొక ముదుసలినిగని యెల్లప్రాణులకును ముదిమి తప్పనిదని యాకళించె. వేఱొకనాఁడు గుఱ్ఱము నెక్కి పడమటివాకిలిదాఁటి యేగుచు

* ఇయ్యది వివాహమునకు మున్నే జరగెననియుఁ జెప్పుదురు.

నొక శవముం గాంచి విచారించి యెల్లవారికిని మరణము తప్పని దని గ్రహించెను. * రోగమునకు ముదిమిచావులకు నిలయమైన జన్మమునకు చోటీయక తప్పించుకొను మార్గ మెఱిఁగి మనమే కాక లోకము నుద్ధరించుట యపూర్వకార్యము కదా! అట్టి పుణ్యము మన కెపుడు లభించునని యాలోచింపసాగెను.

ఇట్లు ముమ్మాఱుఁ గాంచిన జన్మదోషములచే గౌతముని మనస్సు చెదుట విన్న శుద్ధోదనుఁడు మంత్రికుమారుఁ బంపి యైహికభోగముల మరప నుపదేశము చేయించెను. అది చవుటఁ జల్లిన విత్తులయట్లు విఫలమయ్యె. సుందరులగు యువతుల వందల కొలఁదిగఁ బంపి యతనికి సేవలుసేయ నియమించెను. దేని దేని గని లోకులు కాముకులగుదురో దాని దానిఁగని యతఁ డశుభ భావనచేసి మఱింత విరక్తుఁడయ్యెను. అతని హృదయము మార్ప యత్నించివచ్చినవా రామేని సౌందర్యము ఆ హృదయ గాంభీర్యము ఆ శాంతదృష్టులు తక్కు తేజో విశేషములు విలో కించి యబ్బుర పాటొంది ఱాతిబొమ్మకు గిలిగింత వెట్టినట్లయ్యె నని మరలవలసినవారైరి.

పదపడి యొకనాఁడు సిద్ధార్థుఁడు వనమును గనువేడ్కఁ దేరెక్కి చనువాఁడు త్రోవయిరుప్రక్కల సత్కార్యములు దుష్కార్యములు చేయువారు దున్నువారు మున్నగు పెక్కండ్రను

* ఇట్లు మూఁడు రూపములఁ గానఁబడినది బ్రహ్మగణములలో నొక తెగవారగు శుద్ధావాసదేవతలలో నొకరని గ్రంథములఁ గానవచ్చెడిని. ఈ విషయములు గ్రహించినది చందురుఁడను గుజ్జరవాసివలన నని యొకచో, ఉదాయి యనువానివలన నని యొకచోఁ గలదు.

దున్ని యలయుచున్న ఎడ్లనుగాంచి మిక్కిలి పరితాపము గొని తేరినుండిదిగి యొక నేరేటిచెట్టునీడం గూర్చుండి కనుల మూసి కొని ప్రాణులుపడుపాట్లఁ గూర్చి పరితపించుచుండ మునుపు మువ్మాఱువచ్చి వ్యాధివార్ధక మరణముల చవిచూపిన శుద్ధావాస దేవత సన్న్యాసిరూపంబుగొని వచ్చి యెదుటనిలిచి సిద్ధార్థా! యన గౌతముఁడు కనులు తెఱచి మీరెవరనియె. నేనొక *శ్రమ ణుఁడను. దుఃఖములను గూర్చి చింతించి చింతించి నా మనము సర్వదా తపియించుచుండు. ఈ దుఃఖము లనుండి విడివడి యెల్లపుడు చెడనిది, ఆద్యంతములు లేనిది, చెలిమి పగయు లేనిది, ఏకాంతమైనది, ఆనందమయమైనదియగు స్థితిని పొందుటకు నాస పడుచున్నది. కాన నూరు విడిచి నిర్జనస్థలమున నింద్రియముల నడంచి సమాధియుండి ప్రాణములను రక్షింపవలసినంతమాత్రము భిక్షించుస్థితి నవలంబించితినని పలికి తపస్వుల మహిమలఁ బ్రస్తు తించి తన దారింజనియె. అదివిని సన్న్యసింప నిశ్చయించిన గౌతముఁడటనుండి రాజభవనమునకేగి తండ్రింగాంచి తన నిశ్చయమును తెలిపెను.

విన్న శుద్ధోదనుఁడక్లే కొంతవడి యెదవడి నిలిచి మనస్సు కలఁతనొంద గన్నీరు కార్చుచు తుదకు, కుమారా! దానికిది యదనుఁ కాదు. మమ్ము కాపాడి చాలకాలము రాజ్యమేలిన

* శ్రమలఁజెంది తపము సేయువాఁడు శ్రమణుఁడు.

పిదపఁ గోరఁదగినది. అనుడు గౌతముఁడు జన్మవ్యాధిజరా మరణములనుండి తప్పించుకొనుత్రోవ నరసినఁగాకయిట నిలువఁ జాలనని తన నిశ్చయమును వెల్లడించి తన నిలయమున కేగెను. అతని మనస్సును మార్ప నాటలపాటల నారితేఱిన నారీమణుల ననేకల నతని కడకు శుద్ధోదనుఁడంపెను. వారలు శక్తివంచన సేయక యత్నించి విఫలమనోరథులైరి. వారి యాటపాట లందచందములు గౌతముని వైరాగ్యమును మఱింత యభి వృద్ధిపఱచినవి.

## కుమారజననము

ఒకనాఁడు సిద్ధార్థుఁ డేటికిఁజని నీరాడి మరలి తేరెక్క తఱి నొక సేవకుండు పరుగునవచ్చి యువరాజుగారికి కుమారుఁ డుదయించెననియె. *అది విన్నయతండు బంధముపై బంధము కలిగెనే? ఈ దుఃఖసముద్రము దరిఁ జేరుటెట్లు? అని చింతించు చుఁ దేరెక్కి బయలుదేఱెను. అట్లు చను నతని తేరికి ముందు వెనుకల బహువిధవాద్యములు మ్రోఁగెను. పౌరులెల్లరు ప్రభు నకు మనుమఁడు కలిగెనని యానందించిరి. ఉత్సవములు ఆటలు పాటలు జరిగినవి. అందేవియు గౌతముని హృదయమున

---

* పుత్రుఁడు తనబుద్ధియను చంద్రుని మ్రింగవచ్చిన రాహువని చెప్పె ననియు నందుచే నాబాలకునకు పదిపడి రాహులుఁడను పేరు పెట్టఁబడి యె ననియు నొకచోఁగలదు.

కానందము నాపాదింపలేదు. రాజబంధువులలోని కన్యక యొక్కర్తు, "ఈ బిడ్డ తండ్రిభాగ్యవంతుఁడు; తల్లియు భాగ్యవతి; భార్యయు భాగ్యవతి" యని పాడినపాట యొక్క టిమాత్రము దుఃఖనివారణోపాయము స్వరదా తలపోయుచుఁ జనుచున్న యతనికి శుభనిమిత్తముగానుండి మోదముఁ గూర్చెను. అతఁడా యుపశ్రుతికై కృతజ్ఞతా సూచకముగా తన మెడలోని యమూల్యమగు ముత్యాలహారమును బహుమతిగా నొసంగెను. అట్లు సమ్మానింపఁబడిన యక్కన్య యతనికిఁ దనయెడ మిక్కిలి మక్కువ గలదనియు నచిరకాలమునఁ దానతనికిఁ బట్టపుదేవియే యగుదు ననియు మనోరాజ్యపాలనము చేయసాగెను.

ఆవల నతఁడు తన నగరుచేరి అచ్చట జరిగిన నాటకాదుల నొకటేని మనసుంచిచూడక యూరేయి తొలిపాలు శ్రమచే నిదురించి మలిపాలున (నడురేయి) మేల్కని తనయిల్లంటుకొన నార్పుకొనుటకు తొందరపడిలేచు నింటి యాతనివలె లేచి యన్నింటిని వదలి చన నిశ్చయించెను. అయ్యెడ శుద్ధావాసదేవులవలనఁ దలుపులన్నియుఁ దెఱవఁబడి యుండినవి. ఆటపాటలాడి కాంచి యలసి తాఱుమాఱుగఁబడి నిదురించుచుండిన మగువలను గని మఱింత వెగటుగొని వెలుపలికివచ్చి మేల్కనియుండిన చందనుని పిలిచి తన గుఱ్ఱమును ఖండకమనుపేరుగల దానిని వడిగాఁగొని తెమ్మని యాజ్ఞాపింప వాఁడించుక సంశయించియు నవ్వల గుఱ్ఱముం దేఁబోయెను. అట్టియెడ గార్హస్థ్యమును పూర్తిగ నీఁగఁ

జాలక తనకుమారునొకపరి గాంచి యెత్తిముద్దాడి మఱిపోవనెంచి శుద్ధాంతమునకేగి బిడ్డతోడ శయనించి నిదురించు యశోధర గదికిఁ జని యట దీపపువెలుతురున శిశువుంగాంచి 'దీనినెత్తు కొంటినేని యశోధర మేల్కనును. మేల్కన్నఁ దన తలఁచిన పనికి పెనువిఘ్నమగు' నని తలంచి యయ్యిరువుర నొకక్షణ మూరకచూచుచు నిలిచి చలించిన యెడందను పదిలపఱచుకొని మన మీ యిరువుర కావల జ్ఞానాచార్యులము కావచ్చు నను కొనుచు బయలుదేఱెను. *

## మహానిష్క్రమణము

అట్లతఁడు బయలుదేఱినదినము పూర్ణిమ. చందనుఁడు గుఱ్ఱమును తెచ్చినిలిపెను. అతఁడెక్కి చనుచుండ గిట్టల చప్పుడుకూడ నెవ్వరికిని వినరాదయ్యెను.

సమస్తమును త్యజించి వెడలిన గౌతముని మారుఁడు మాత్రము వదలక వెన్నంటి 'సన్న్యసింపకుము. ఏడునాళ్ళలో సప్త ద్వీపాధిపతిని గావింతు మరలు' మని యుద్బోధించియు ఫలము గానక పట్టువీడక తగినయదనుకై నీడవలె వెన్నంటి వేఁగుచుండెను.

---

* బయలుదేఱినయేఁడు ఈశానశకబ్ది ౯౨౨వ యేఁడనియు నాఁడు శుక్రవారమనియు నందురు అతనికది ౨౯వ యేఁడు.

అట్లతఁడు రాజ్యమును సమస్తభోగములను తల్లిదండ్రులను భార్యను నాఁడే జనించిన పుత్రుని త్యజించి వెడలుటను మహానిష్క్రమణమని త్రిపిటకమునఁ జెప్పఁబడినది.

తెల్లవాఱుసరికి గౌతముఁడు కోలియదేశపుటెల్ల కావలి యనోమ నదిగట్టువఱకు (మూఁడుయోజనములు) చన ఖండక మావల నడుగువెట్టదయ్యె. అదియుఁ దన కనుకూలమే యని దాని నచ్చట వీడి చందనుఁగాంచి 'చాలకాలమునకు నాకోరిక నెఱవేఱినది. మన సంబంధము నేటితోఁ దీఱినది' అని తన మెడనున్న యమూల్యహారము నతనికొసఁగి యవ్వల తన శిరోభూషణముందీసిఁ 'దీని నా తండ్రిగారికి ప్రేమతో నొసఁగితినని చెప్పి యిమ్ము. నాపైఁగల మమకారము సంపూర్తిగ వదల వేఁడితి ననుము. గార్హస్థ్యమార్గమున దుఃఖసాగరమునీఁదు తెప్ప దొరకమి నిట్లు మిమ్ము వదలితినని విన్నవించినట్లు చెప్పుము' అనుడు చందుఁడందులకు సమ్మతింపక వెంటవచ్చెదనని బతిమాల నతఁడు వాని వీఁపుదట్టి చిన్నరాజ్యముకాక సమస్తప్రపంచము నేలఁ బోవుచుంటినని సమాధానపఱచి గుఱ్ఱముతో వెనుక కంపెను. వానివలన గౌతముపోకవిని తలిదండ్రులు భార్య బంధుమిత్రులు పౌరులు పరిపరితెఱఁగులఁ బలవించిరి.

ఆవల గౌతముఁడు నదిగట్టున తనచేతికత్తితో శిరోజముల నూడ్చివైచెను. *అటఁగానవచ్చిన వేటరియుడుపులఁగైకొని తన పట్టాంబరముల వానికొసఁగెను. అటనటఁగల మునుల దర్శించి ప్రశ్నించి తగు సమాధానమందక యరిగి యరిగి పాండు

* అట నిప్పుడొక మండపము గలదందురు.

( శ్వేత ) గిరింజేరి యందలి యరాళరామమునివరుంజేరి యర్థించి యోగమార్గ ముపదేశమంది యభ్యసించె.

అట్టియెడ రాజుపంపున పురోహితుఁడును మంత్రియు వెదకుచువచ్చి యరాళరాముని యాశ్రమమున తపము గావించు సిద్ధార్థునిగాంచి తలిదండ్రులదుఃఖము, భార్యాదుఃఖము, బంధుల దుఃఖము, పౌరులదుఃఖము, ప్రజలదుఃఖము వివరించి మరలి పురికి రమ్మనివేఁడిరి. వారికి గౌతముఁ డిట్లనియె "అందమైన రాజభవనము నాకు నిప్పుతో నిండిన నిలయమును బోలినది. మహానసశాల విసము దినిపించు శాలయయ్యె. సమస్తము దుఃఖమయమై కానిపించె. ఎల్లజీవుల దుఃఖము తొలఁగింపఁ గోరియే యీనిటకు వచ్చితి. దుఃఖనివారణోపాయము నరయు మున్నటకు రాఁజాల' నని వారిని వెనుకకుఁ బంపివైచెను.

## యాగనివారణము

ఆపై నొకనాఁడు గౌతముఁడు భిక్షుకై రాజగృహనగర మునకేగుచు నారాజు పశుహింసచేసి యాగము జరుపుచున్నాఁ డని విని యటకేగి యజమానుఁడగు బింబసారునకు అహింసను గూర్చి వివరించి యాగమును మాన్పి సత్యాన్వేషణము పూర్తి యైన పిమ్మట వత్తునని మరలి యాశ్రమము చేరెను.

అట నరాళముని యొద్దఁ గొంతకాలముండియుఁ బ్రయో జనములేక పోవుటచే వీడి రుద్రకుఁడను మునింజేరి కొంతకాల

ముండి యచ్చటు వీడి జ్ఞానారణ్యమను నురువేలావనమున కేగి యటఁ దపము సేయుచుండిన కౌండిన్యకులపుత్రుఁడు, దశబల కాశ్యపుఁడు, బాష్పుఁడు, అశ్వజిత్తు, పుత్రుఁడు అను నైదుగురు మునులతోఁ గలిసి ఘోరతపము కావించెను. ఉపవాసములచేఁ గృశించి యొకనాఁడు సొమ్మసిల్లెను. తోడివారితఁడు మరణించె నని యే తలంచిరి. కొంతవడి కతఁడు లేచి యుపవాసముచే మేను, మేనితో మనస్సు, మనస్సుతో బుద్ధి కృశించుట తక్క వేఱుఫలము లేదని భుజింపఁదొడఁగె. అదిగని యితఁడు తపోభ్రష్టుఁడయ్యెనని యా యైదుగురు మును లతని వీడి వేఱుచోటికరిగిరి. మహాభినిష్క్రమణ దినమునుండి యప్పటి కాఱేండ్లు కడచినవి.

## గౌతముఁడు బుద్ధుఁడగుట

ఆవల నైరంజర (ఫల్గుని) నదీతీరమున నొక రావిచెట్టు క్రిందఁ గూర్చుండి యిరువదియెనిమిది దినములు పగలు రేయి కదలుట మెదలుట నిద్రించుట మేల్కనుట లేక సత్యాన్వేషణము చేసెను. ఇరువదితొమ్మిదవనాఁ డుదయవేళ నా సమీప గ్రామమందలి బలుఁడను గొల్లని కూఁతురు *సుజాతయను నామె తన కులదేవతకు నివేదనముచేయఁ గొనిపోయిన పాలన్నము నతనికి భుజింపఁబెట్టెను. భుజించి గౌతముఁడు తేజోవంతుఁడయ్యెను.

అట్టియెడ శీలవిరోధియగు మారుఁడు గౌతముని హృద

* ఈ పేరు నందయనియు విశాఖయనియుఁ గానంబడుచున్నది.

యమును కలఁకపఱుప కామక్రోధ మోహములను పుత్రికలతో వచ్చి మిక్కిలి యత్నించి విఫలమనోరథుఁడై మరలెను.

గౌతముఁడు మారవిజయుఁడైన పదునైదు దినములకు నిరువది తొమ్మిదవ దినమున రేయి పూర్వజన్మజ్ఞానమును తత్త్వ జ్ఞానమును క్రమముగఁ గలిగినవి. పూర్వము పాపము కావించిన వారిప్పు డిడుమ లొందుటయు జీవకారుణ్యము పూనినవారు సుఖించుటయు తనవిజ్ఞాన చక్షువుచే నెఱింగె. కామక్రోధమోహ ములు గలవారు దుఃఖితులై పుట్టి పెరిఁగి కృశించి నశింతురనియు ఆ నాశము పుట్టుకనుండి, పుట్టుక కర్మచయమునుండి, కర్మము మమకారమునుండి, మమకారము (బంధము) తృష్ణవలన, తృష్ణ కుడుపు (అనుభవము) వలనను, కుడుపు స్పర్శము వలనను, స్పర్శ మింద్రియముల (షడాయతనము) నుండియు, నింద్రియములు నామరూపములనుండియు, నామరూపములు విజ్ఞానమునుండియు విజ్ఞానము సంస్కారమునుండియు, సంస్కృతి యవిద్యనుండియు కలుగుచున్నవగుటచే జన్మమును తొలఁగింప మరణము, కర్మ కూటమును తొలఁగింప జన్మమును, మమకారమును వీడఁ గర్మ సంచయమును, తృష్ణను వీడ మమతయు, అనుభవమును వీడఁ దృష్ణయు, స్పర్శమును వదల ననుభవమును, షడాయతనము వదల స్పర్శమును, నామరూపముల వీడ షడాయతనమును, విజ్ఞాన మును వీడ నామరూపములును, సంస్కారమును తొలఁప విజ్ఞాన మును, అవిద్యను వీడ సంస్కారమును వదలుననియు, దుఃఖము

దుఃఖోత్పత్తి దుఃఖనివారణమను మూఁడు సత్యములఁ బరికించి యెఱిఁగి సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము, సమ్యగ్వాక్కు, సమ్యక్కర్మము, సమ్యగాజీవము, సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి అను నాల్గవ సత్యమగు దుఃఖనివారణ మార్గమనఁబడు సన్మార్గము లెనిమిదియుఁ బరిశీలించి తెలిసికొనియె. తెలిసి యభీష్టసిద్ధినొందితినని తృప్తినొంది యివ్వానిని మొదట అరాళరామ మునివరునకు రుద్రకమునికిఁ దెలుపఁదలంచి విచారించి వారు మరణించిరని తెలిసి చింత నొంది తరువాత నురువేలా వనమందు తనతోడఁ దపమాచరించిన యేవురు తాపసులకుఁ దెలుపఁదలంచి పోవు వాఁడాదారి నొక బ్రాహ్మణుని ఉపఘుఁడను వానిఁగాంచి వానికిఁదెలిపి యది యెల్లవారి కుపదేశింపఁదగిన యర్థమే యను నుత్సాహమంది కాశింజేరి తత్సమీప మందలి మృగదావమను వనమునుచేరెను. దూరమున వచ్చుచుండిన గౌతముని గాంచి యితఁడు తపోభ్రష్టుఁడు; వీనికి మర్యాద చేయరాదని యనుకొనుచున్న యయ్యేవురు సమీపించునంత వారాతని ప్రసన్నముఖమును గాంచినంతనే తమ్ముఁదామెఱుఁగక లేచి యెదురేగి కొనివచ్చి యుపచరించి పదపడి సుఖము లనుభవించు వాఁడెట్లు మనోనిగ్రహ మాచరింపఁ గలఁడని తథాగతు నడిగిరి. వారల కతఁడు సమ్యగ్దృష్టి మున్నగు అష్టాంగమార్గము ననుసరింపకున్న జనన మరణ ప్రవాహము నరికట్టఁజాలము. దుఃఖము, దుఃఖోత్పత్తి, దుఃఖ

నివారణముల లోఁతు పాతులెఱిఁగిన పిదప నీమార్గమున నడవ వలయునని తాఁ గన్న మార్గము విశదపఱచెను. విన్న యేవురును సమ్మతించి యతని శిష్యులైరి. వారు చేరుటయే మణిత్రయ మున నొకటగు సంఘమునకు పునాది యందురు.

## శిష్యసంఘము

కాంచిన వారిని వశీకరించుకొనఁజాలిన యందంపుఁ జూపులు ప్రసన్నముఖము వినువారి యుల్లముల నాకర్షించు మధురకంఠస్వరము పలుకులు బుద్ధునకుఁ గలవనియు నవి యెదుటి వారిని లోఁగొని శిష్యులనుగాఁజేయు గొప్ప సాధనములై యుండె ననియు నతని చరిత్రములు చెప్పుచున్నవి. ఆవల నతని దర్శింప నటకువచ్చిన యెల్లవారికి జాతి మతభేదములు శత్రు మిత్రులు స్త్రీ పురుషులను విచక్షణలేక తన సిద్ధాంతముల భగవానుఁ డుపదేశింప సాగెను.

అత్తఱి కుశీనగరమందలి యశుఁడను ధనికుఁడు బుద్ధుని కడకువచ్చి తద్ధర్మములువిని తనవారగు ఏఁబదిపలువురతోడ భిక్షువై సంఘమునఁజేరెను. జ్ఞానోదయమైన యెదుమాసముల లోపల నఱువండ్రు శిష్యులైరి. ఆవల యశుని తల్లి తండ్రి భార్య మువ్వురును వచ్చి ధర్మములువిని యుపాసకులైరి.

అంత నాయఱువండ్రు శిష్యులనొకచోఁ గూర్చుండఁజేసి 'మీకుపదేశించిన యట్లే మీరు పలుతావులకేగి జ్ఞానహీనులగు

మానవుల కుపదేశించి వారిని విజ్ఞానవంతులనుగా, సన్మార్గ చరులనుగాఁ జేయుట మీముఖ్య ధర్మమగును. వర్షకాలమున మీరెల్లరు నన్ను చేరుచుండుఁడు.' అని యాజ్ఞాపింప యశుఁడు కాశియందుండెను. తక్కినవారు వేర్వేఱు ప్రదేశములకు బోధింప నేగిరి. వానకాలమున నెల్లరొక్కచోఁజేరుటయు మంచిచెడుగులు చర్చించుకొనుటయు వారికి వాడుక యయ్యెను.

ఉరువేలా వనమందాకాలమున నాచార్యుఁడను పేరొంది యగ్నికార్యము నెఱవేర్చుచు వానప్రస్థుఁడై యుండిన అగ్నికాశ్యపుఁడను విప్రునికడ కొకనాఁడు బుద్ధుఁడు చని యతని కడనుండిన చెడుపామును తన మహిమావిశేషముచే నడంచి యతఁడు నిత్యమర్చించు నగ్నినే యుదాహరణముగఁజూపి విషయము లింద్రియముల త్రోవనేగి కామక్రోధ మోహముల నుల్లమున వృద్ధిచేయ నజ్ఞానము గొప్పయగ్నిచే నెల్లరు మాడి పోవునట్లు చేసికొనుచున్నారనియు నయ్యగ్నినార్చి నిర్వాణ మందుటకు యత్నించు వారందఱు విషయములవలన నెదచలింప కుండ నట్లింద్రియముల జయింప వలయుననియు, నిదితక్క నిర్వాణమంద వేఱు దారిలేదనియు నుపదేశింప నవ్విప్రుండు నతని శిష్యులైదువందల మందియు తమ మతమువదలి సంఘమునఁ జేరిరి. తరువాత కాశ్యపుని తమ్ములగు నదీకాశ్యపుఁడు గయా కాశ్యపుఁడను నిరువురును తథాగతుని శరణమంది భిక్షుకులైరి. అగ్నికాశ్యపునకు బుద్ధుఁ డగ్ని నుదాహరణముగాఁగొని యుప

దేశించిన విషయములు ఆదిత్య పర్యాయ సూత్రమను గ్రంథ మందు చెప్పఁబడియున్నవి.

పూర్వ మనుగ్రహించిన వాక్కు తప్పక బుద్ధుఁడగ్ని కాశ్యపునితో రాజగృహమున కేగి సమీపమందలి యష్టివనమున దిగెను. బింబసారుఁ డానందముతో వచ్చి కాంచి గౌరవించి అగ్ని కాశ్యపునంతటి మహాపురుషుఁడితని శిష్యుఁడయ్యెఁగా యని యచ్చెరుఁగొందెను. అట బుద్ధుఁ డగ్ని కాశ్యపుని మహిమను పూర్వజన్మము నెఱుకపఱచు జాతక కథ యొండు వచించెను. బింబసారుఁడు చెఱసాలలోని దండితులనెల్లర విడిచెను. బుద్ధుని ధర్మోపదేశములువిని యనేకు లతని మతము నవలంబించిరి.

## విహార నిర్మాణము

తదుపరి యొకనాఁడు బుద్ధుఁడు భిక్షుకై నిత్యము రాజ గృహనగరమునకు దూరమగుటచే వచ్చుట కష్టమని రాజనగర సమీపమందలి వేణువనమున విహారమొండు కట్టించి సంఘమును వశము కావించెను. అందు కొంతకాలముండి తథాగతుఁడెల్ల వారి హృదయముల జ్ఞానదీపము వెలిగించుచుండెను. ఒకతఱి అశ్వజిత్తు బాష్పుఁడను శిష్యులు భిక్షుకై రాజగృహవీధులఁ బోవుచుండఁ గపిలుని శిష్యులలో మేటియగు [1] శారీపుత్రుఁడను

1. బోధి సత్త్వావధాన కల్పలతయను సంస్కృతగ్రంథమున నితఁడు శారీసూనుఁడని చెప్పఁబడెను. తల్లి పేరు శారి. ఇతఁడును తరువాత వచ్చు మౌద్గల్యాయనుఁడును సంజయుఁడను నతని శిష్యులుగా చెప్ప బడిరి.

నతఁడు వారిముఖ లక్షణంబుల లక్షించి గౌరవించి సంభాషించి గౌతముని మహిమలు విని తన మిత్రుఁడగు మౌద్గల్యాయనుని తోడను ఇన్నూట యేఁబదిమంది శిష్యులతోడను వేణువనము చేరి బుద్ధుని శరణుచొచ్చి ధర్మోపదేశము విని [1] యర్హత్తదశ నందెను. శారీపుత్రుఁడు ధర్మరాజు శిష్యులు [2] పదుండ్రలో గొప్పవాఁడు. బౌద్ధ సిద్ధాంతవేత్తలలో పేరొందినతఁడు. మౌద్గల్యాయనుఁడు అద్భుత సిద్ధియందు గొప్పవాఁడు.

శారీపుత్రక మౌద్గల్యాయనులకు సంఘమున నున్నత పదవి యొసఁగఁబడినందులకుఁ గొందఱు శిష్యు లలుకగొని కలహము లేవఁదీసిరి. అది యెఱిఁగి బుద్ధుఁడు సంఘమునందలి వారెల్లప్పుడు నడవ వలసిన విధుల నప్పు డుపదేశించెను. అవ్వల సంఘు మొద్దిక కలిగియుండెను. అదిమొదలుకొని సంఘము సేవక సన్నిపాతమను పేరొందెను. పై విధులు ప్రాదిమోక్ష మను గ్రంథమునందు గలవు

బౌద్ధసంఘు దినదినాభివృద్ధి నోర్వని యితరమతముల వారు కావించిన దుష్ప్రచారములకు లెక్క లేదు. వానిని బుద్ధుఁడు

1. అర్హత్తదశ – నిర్వాణమందువారికిఁ దగిన ధ్యానము లైదింట నాల్గవధ్యానము నొందిన వారిస్థితి.

2. పదుండ్రు – కాశ్యపుఁడు, ఆనందుఁడు, శారీపుత్రుఁడు మౌద్గల్యాయనుఁడు, అనురుద్ధుఁడు, సుభూతి, పూర్ణుఁడు, కాత్యాయనుఁడు, ఉపాలి, రాహులుఁడు.

లెక్క పెట్టలేదు. కాశ్యపాగ్నిదత్తుఁడను సన్యాసి యొకరుండు వై శాలినగరమునకుఁ జనువాఁడు దారిలో శాక్యముని మహిమము విని యతని దర్శించి తదుపదేశములు విని యతని శిష్యుఁడై భిక్షువై సంఘమందు మేటియై మహాకాశ్యపుఁడను గౌరవమందె. కోసలదేశమున శ్రావస్తి నగరవాసి అనాథ పరిపాలకుఁడను వణిజుఁడు బుద్ధుని కారుణ్యము నుపదేశసంపదయు విని చూడ వచ్చి రాజనగరమున చూపుఁడను మిత్రునింట బసచేసి బుద్ధుని దర్శించి శరణమంది యుపదేశమునిని సందియము వీడి సన్మార్గము నందెను. వేణువనమందు బుద్ధుఁడుండిన కాలమున ధర్మములు విని తమతమ మతములఁ ద్యజించి చీవరధారులైనవారు తొమ్మిది వందలమంది యనియు యుపాసకులైనవారు అసంఖ్యాకులనియు తెలియుచున్నది.

## బుద్ధుఁడు శుద్ధోదనుఁ గానవచ్చుట

బుద్ధుని ధర్మోపదేశములవలన పెక్కండ్రు చెడుత్రోవల వీడి సన్మార్గ మవలంబించిరని విని తన జీవితకాలములో నొక పరియేని యతనిఁ జూడఁగలుగుదునా ? యని యువ్విళ్లూరుచున్న శుద్ధోదనుని యుత్కంఠ నెఱిఁగిన కొందఱు రాజగృహమున కేగి బుద్ధునకు విన్నవించిరి. అతండును వారిని సన్మార్గమున నడప నిశ్చయించి వేణువనము వీడి కపిలవాస్తునగరమునకు బయలు దేఱెను. అట్లు చనుచు మార్గమధ్యమున ప్రభాస దేశప్రభువగు

వై దూర్యని వేడికోలుచే బుద్ధుఁడట నాఁగి రాహిళ్ల్లునుసానవట్టి చేసిన నూటయెనిది పూసలుకూర్చిన సరముతో 'నమో బుద్ధాయ; నమో ధర్మాయ, నమస్సంఘాయ' యని దినమునకు రెండులక్షలు జపింపుమని తత్ఫలము నతనికిఁ దెలిపి యవ్వలికిఁ జని న్యగ్రోధవనమునఁజొచ్చి కొన్నినాళ్లచ్చట నుండెను.

తరువాత కపిలవాస్తుపురమును సమీపింప శుద్ధోదనుఁ డుచితరీతి నుపచరించి స్వాగతమొసఁగెను. నగరములోనికిఁ జనఁ జుట్టములును తక్కిన పౌరులెట్టి మర్యాదయుఁ జూపరైరి. కావున బుద్ధుఁడు వేళకు శిష్యులతో నెచ్చటికేని భిక్షకుఁబోవ నది శుద్ధోదను [illegible]. తన పుత్రుఁడు బిచ్చమెత్తుట తనకు గిట్టక పరుగునవచ్చి "తండ్రీ! ఏల బిచ్చమెత్తి మమ్మెల్లర నవమానించెదవు? మీకు భిక్ష యిడ నావలనఁ గాదా?" యనియె.

బుద్ధుఁడు :- మా సంఘమువారికిట్లు భిక్షించి భుజించుట ధర్మము.

శుద్ధో :- అది యెట్లు? రాజవంశమున నీవు జనింపవా?

బుద్ధుఁడు :— నీవు నీ పూర్వులును క్షాత్రధర్మమునకుఁ దగినవారు. ఇంతకు పూర్వము పుట్టినవారును ఇఁక పుట్టఁగలవారునగు [1] బుద్ధుల వంశమునకు నేను తగినవాఁడను. మఱియొక మాట. ఒకఁడొక నిధిని త్రవ్వి యెత్తినచో దానిని తండ్రికొ

సంగుట పుత్రునిధర్మము. నే నరుదుగఁ గనిపెట్టిన నిధిని మీ కిచ్చెదను. ఆలసింపక కైకొనుఁడు.

అనుడు శుద్ధోదనుఁడు బిడియమంది బుద్ధునిచేతి పాత్రమును తానుకైకొని అంతఃపురమునకుఁ గొనిపోయి యతనితో వేయిన్నైన్నూఱుగురు భిక్షువులకును మంచి వంటకములు పెట్టించెను. క్రమక్రమముగ బుద్ధుని మహిమ లెఱిఁగి రాజును రాజబంధువులును అబ్బురమంది యావల ధర్మోపదేశమొందిరి. బుద్ధుఁడు కపిలవాస్తు పురముచేరిన మొదట కాలశ్రేష్ఠుఁడను ప్రభునింటను పదపడి తల్లి శరీరధాతువుల దాఁచియుంచిన యాలయమందును విడిసి నగరవీధుల బిచ్చమెత్తి పాత్రము నిండినతోడనె మరలి యిరవున కేగుచుండు వాఁడనియుఁ జెప్పుదురు. ఆ నగరమున ద్వాదశ నిదానములఁ గూర్చియు మహాప్రజ్ఞా సూత్రమునఁగలయట్లు ప్రజ్ఞా పారమితం గూర్చియు బుద్ధుడుపన్యసించినది విని బౌద్ధులైనవారు పలువురు.

## యశోధర యుపదేశమందుట

ఆ దినములలో నొకనాఁడు శిష్యులతోడ బుద్ధుఁడు శుద్ధోదన రాజభవనమునకు భిక్షకేగినతఱి నట గల స్త్రీలు పురుషులు గుంపులు గుంపులై వచ్చి బుద్ధుని సేవించి మరలు

1. మణి 30 ప్రక. చూ. గౌతమ బుద్ధునకు తరువాత రాఁగలవాఁడు మైత్రేయ బుద్ధుఁడందురు.

చుండిరి. యశోధర మాత్రము రాలేదు. చెలులు కొందఱేగి బుద్ధదర్శనమునకు రమ్మని పిలువఁగా నాయమ "నన్ను గుణవతిగా నాతఁడెంచి యుండునేని తానే నన్ను సన్మార్గమున నడపనిటకే వచ్చును. అప్పుడతని నే నిచ్చటనే యుచితరీతి సేవింపఁదగియుందును" అనియెను. తన్ను దర్శింపవచ్చిన స్త్రీల కూటమున యశోధర కానరామిఁ దాను మున్నుతలంచిన యట్లే యామె కడకేగి యాచార్యత్వము పొందనెంచి యిరువురు శిష్యులతో నామె కడకేగి పూజలుగొని తమ పూర్వస్థితిని దలంచి మిక్కిలి దుఃఖించిన యశోధరను తనయింపు పలుకుల నూరార్చి యెల్లవిధముల మేలు బంతియగుటయు నామె స్థిరచిత్తమును అచ్చటికి వచ్చిన శుద్ధోదనుఁడు చెప్ప విని సంతసించి పూర్వజన్మమందును ఆయమ పరిశుద్ధురాలేయని యటఁగల వారెల్ల రెఱుఁగ బుద్ధుఁడొక జాతక కథం దెల్పి తరువాత ధర్మ ముపదేశించెను.

## రాహులుఁడు సంఘమునఁ జేరుట

యశోధర యుపదేశమందిన కొన్నాళ్లకు పిదప కొడుకగు రాహులుం బిలిచి నీ తండ్రికడకేగి యతని కడనుండి పొందఁదగిన యర్థంబులనెల్లఁ బొందుమన నబ్బాలకుండు నా తండ్రి నీ వఱకెఱుఁగను. ఎవరినని గుర్తింతునన నా దేవి కుమారు నక్కునఁ జేర్చి యెత్తుకొని యొక గవాక్షము కడకేగి భిక్షసేయుచున్న బుద్ధుని చూపెను. పదెనిమిది యేండ్లకు మీఱని యబ్బాలు

డక్లే యేగి తనకీయఁదగు సొత్తు నిమ్మని కోరి వీడక యతని వెంబ డించి న్యగ్రోధవనము చేరెను. అయ్యెడ బుద్ధుఁడు 'లోకమునఁ గల తండ్రులెల్లరు కుమారుల కిచ్చు నర్థములు నశించునవి. నేను పొంది నీకిచ్చునిధి నాశములేనిది. అది యిచ్చెద' నని శారీ పుత్రుంగాంచి రాహులుని సంఘమునఁ జేర్చుకొండని యాజ్ఞా పింప నతఁడట్లే కావించెను.

మరల నొకపరి బుద్ధుఁడు కపిలవాస్తువున కేగిన తఱి నట పెండ్లికొడుకుగానున్న [1] నందునిచేరి తన్ను గాంచినంతనే భక్తితోఁ బరుగునవచ్చి నమస్కరించిన వానింగాంచి అహంకార మమ కారముల వీడి పరిశోధించి సత్యవస్తువు నరయుటయే యన్నింట మేలైనది యని యుపదేశింప విని యానందించి వాఁడన్నింటిని పరిత్యజించి యతని భిక్షాపాత్రమును గైకొని తనచేతనుంచుకొని యతనితోడ న్యగ్రోధవనమున కేగి భిక్షువై సంఘమునఁ జేరెను.

ఇట్లు రాహులుఁడు నందుఁడు సన్న్యాసులగుటచే రాజ్య భారము వహింపఁ దన తరువాత నెవరును లేమికి శుద్ధోదనుఁడు

1. గౌతముని పెంచుచుండిన పిదప గౌతమికిఁ గలిగిన పుత్రుఁడు నందుఁడు. కూఁతురు రూపనంద. బుద్ధునకు జ్ఞాతియైన నందుఁడు వంటి యొకఁడు కలఁడు. వానికి ధర్మోపదేశము చేసి పిటకత్రయము చదివింప వాఁడు నిద్రవేళలో దనపత్నియగు వరసుందరిని తలఁచుకొని కలవరింప నా మోహభ్రాంతి వదలింపనెంచి బుద్ధుఁడు అప్సరసలనుచూపి సుందరిపై నుపేక్ష గలిగింపఁబూన, వాఁడచ్చరలఁ గాంచి నంత స్త్రీ వ్యామోహము బలియఁ దపమువిడి పాఱిపోయెను.

చింతింప నది బుద్ధుని విసోకెను. అప్పటినుండి యట్టి చింత పెద్దలకు లేకుండునట్లు తల్లిదండ్రుల యనుమతిలేక వారి కుమారులను భిక్షుకులనుగాఁ జేయరాదను నియమ మేర్పఱచెను. బోధిమూలమున జ్ఞానోదయమైనది మొదలుగ నప్పటికి పదునెనిమిది మాసములు జరిగెను.

పడమటి రాజగృహమునకుఁ జనుచు నడుమ ననోమ నది గట్టున నున్న అనుప్రియ యను స్థలమున విడిసియుండ నటఁ దన్ను దర్శింప వచ్చిన బంధువులగు శాక్యులు పలువురు కోలియులు పలువురు మఱియు నితరు లనేకు లుపదేశమంది బౌద్ధులైరి. వారిలోఁ బ్రసిద్ధులు[1] ఆనందుఁడు, దేవదత్తుఁడు, ఉపాలి[2] అనురుద్ధుఁడను వారు. ఆనందుఁడు బుద్ధుని ప్రేమను చూఱగొన్న వారిలో మేలుబంతి. దేవదత్తుఁడు తరువాత కొంతకాలమునకు విరోధియై సంఘమున పెక్కు కలహములు లేవఁదీసినవాఁడు. ఉపాలి జాతి యందు మంగలి. తన బుద్ధివిశేషముచే బౌద్ధులలో మిక్కిలి గౌరవమందినవాఁడు అనురుద్ధుఁడు బౌద్ధతత్త్వ నిష్ణాతుఁడు.

## జేతవనవిహారము

ఆవల తథాగతుఁడు తన గొప్ప సంఘముతో కోసల దేశమున అజిరవతి నదిగట్టుననున్న శ్రావస్తి నగరమున కేగి యటఁ

1. ఆనంద దేవదత్తులు శుద్ధోదను తమ్ముఁడగు శుక్లోదను పుత్రులు.

2 అనురుద్ధుఁడు శుద్ధోదను నతోక తమ్ముఁడగు అమృతోదనుని కుమారుఁడు.

దమకు స్వాగతమొసఁగ నలంకరించియుంచిన జేతవనవిహారమును సంఘమునకై అనాథ పరిపాలకుఁడు ధారాదత్తముచేయ బుద్ధుఁ డంగీకరించి యందు నిలిచి పెక్కండ్రకు ధర్మోపన్యాసములుచేసి వారిని సంఘమునందు చేర్చుకొనెను. తన్నగర రాజగు ప్రసేన జిత్తను నతఁడును సంఘమునఁజేరి యిహబంధములఁ దెగఁగోసెను. ధర్మచక్ర ప్రవర్తకుఁడై నది మొదలుగ బుద్ధునకిట్లు మూడేండ్లు కడచెను.

## శుద్ధోదన మరణము

పిదప వైశాలికేగి మహావనమున చూడాకార విహార మున నుండు తఱి రోహిణీనదిం గూర్చిన వివాదము కోలియులకు శాక్యులకు పెరుఁగుటవిని కపిలవాస్తువున కేగి వారికి సమాధానము కుదిర్చి మరలి మహావనమున కరుదెంచెను. అటనున్న కాల ముననే శుద్ధోదనుఁడు వ్యాధిగ్రస్తుఁడై మిక్కిలి బాధ నొందు చున్నాఁడని విని కపిలవాస్తు పురికేగి యతఁడు మరణించుతఱి సమీపముననే యుండి పదపడి యుత్తరక్రియలు తానే నిర్వర్తిం చెను. శుద్ధోదను నవసానకాలము ఈశాన శకాబ్ది నూట యేడవ వత్సరము. అప్పటి కాయన వయస్సు తొంబది యేడందురు.

అటనుండి బుద్ధుఁడు మరలి మహావనమందలి చూడా కార విహారమున సంఘముతోఁగలిసి తనతోడవచ్చిన మహా ప్రజాపతి గౌతమి యశోధర మున్నగు శాక్యస్త్రీలకు పలువుర

కును కోలియస్త్రీలు పలువురకును ధర్మోపదేశము కావించెను. విన్న గౌతమియు యశోధరయు గార్హస్థ్యమున విసుగొందితి మనియు సంఘమునఁజేరి లోకసేవ చేయుదుమనియుఁ దమకోరిక యెఱిఁగించిరి. తల్లికోరిక నెఱవేర్చుట సన్న్యాసులకును ముఖ్య ధర్మమే కావున బుద్ధుఁడామెకొఱకే స్త్రీలు సన్న్యాసినులై సంఘమునఁ జేరఁదగుదురని నియమము కావించి వారికిఁ దగిన కొన్ని నియమము లేర్పఱచెను. మొదట గౌతమియు యశోధరయు భిక్షుకురాండ్రైరి. ఆపై పెక్కండ్రు సన్న్యాసినులైరి. మొదట స్త్రీలను సంఘమునఁ జేర్చుకొన బుద్ధున కిష్టములేకుండెననియు ఆనందుని వేఁడికోలున సమ్మతించెననియుఁ జెప్పుదురు.

తరువాత గౌతముఁడు ప్రయాగ సమీపమందలి మకుటగిరికేగి కొంతకాలముండి యటనుండి రాజగృహమునకేగి బింబసారుని మహిషియగు క్షేమ కుపదేశముకావించెను. ఆమెయు భిక్షుకియయ్యెను. ఆ కాలమున భిక్షువొకఁడు తనబుద్ధి శక్తిచే నద్భుతమగు భిక్షాపాత్రమును బడయుటఁగాంచి బుద్ధుఁడు మిక్కిలి పరితపించి బౌద్ధులు తా మొందిన బుద్ధి నద్భుతకార్యములకు వినియోగించి జనుల మెప్పులొందుట చాల విచారకరము. అది నిర్వాణమార్గమునకు సాధనము కాదగునని మందలించి దానిని పగులఁగొట్టించెను.

## సంఘ కలహము

ఆవల బుద్ధభగవానుఁడు కపిలవాస్తు సమీపమందున్న

యొకబండపైఁ గొంతకాలముండెను. ఉండుటతో ప్రసిద్ధ శిష్యుఁడగు నకులుని తల్లిదండ్రులును మాగ్దలియను వాని తల్లిదండ్రులును ధర్మములువిని బౌద్ధులైరి. మరల కౌశాంబికి తథాగతుఁడు మరలివచ్చెను. అట మాగ్దలివలన సంఘమునందు గొప్ప కల్లోలము కలిగెను. తన వలన శక్యమైనంతవఱకు శ్రమించి ఫలము లేనందున బుద్ధుఁడు వారిని వదలి యొంటరియై చని పారిలేయకమను వనముచేరి యందలివారు కట్టియిచ్చిన యుటజమందుండెను. కొన్నాళ్లకు శిష్యులు తమ యవివేకమున కనుతాపమంది గురుని వెదకుచుఁబోయి యతని పదములఁబడి తమ తప్పుల మన్నింప వేఁడిరి. మహాత్ములు క్షిణకోపులు కదా! అతఁడు వారిని మన్నించి వారికి చిత్త సమాధానముగఁ గొన్ని నీతు లుపదేశించెను.

## భరద్వాజుఁడు సన్న్యాసియగుట

అటనుండి యతఁడు శిష్యులతో మగధకేగుచు నొక గ్రామమున కృషిచే జీవించు భరద్వాజుఁడను బ్రాహ్మణునింట బిక్షమడుగ నతఁడు 'సన్న్యాసీ! నేను శ్రమించి కృషిచేసి సుఖించుచున్నాను. మీరును ఇట్లు చేసితిరేని తిండికి కొఱఁతయేల కల్గు నని యడిగెను. అందులకు సమాధానముగ బుద్ధుఁడిట్లనియె. 'నేనును కృషి చేయుచున్నాను. ఫలమనుభవించు చున్నాఁడ' నన నతఁడు ఎడ్లేవి? నాగలమేడ? గింజలేవి? సాధన సామగ్రియేది? అట్లున్న ఈ బిచ్చమెత్తుటేల? యనియడుగ బుద్ధదేవుఁడిట్లనియె.

శ్రద్ధయే విత్తు. వర్షమునతాఁర్యము. క్షేత్రము ధర్మశాస్త్రము. తెలివి వినయ మనునవి సాధనములు. ధర్మము మడకపిడి. వీడని పట్టుదలయే యెద్దు. త్రాడు మనస్సు. ఉత్సాహము మునికోల. కామక్రోధాదులచే నగు దుఃఖములే కలుపు. ఫలము నిర్వాణ సుఖము. విప్రవరా! అల్పఫలమున కేల మురిసిపోవుచున్నాఁడవు! శాశ్వత ఫలమున కేల యిచ్ఛగింపవు?' అనుటయు భారద్వాజుఁ డతని పదముల వ్రాలి తన యవివేక వాగ్వాదము క్షమింపవేఁడి యతని శిష్యుఁడయ్యెను.

బుద్ధుఁడటనుండి కోసలమందలి సత్యప్రియనగరమునకు నటనుండి దక్షిణమునకు నటనుండి కాశీ వైశాలి మార్గముల శ్రావస్తికి నేగెను. నడుమ నడుమ శిష్యులైనవారు పెక్కండ్రు. శ్రావస్తిలో రాహులునకు మహారాహుల సూత్రధర్మముల బోధించినతఱి నతని వయస్సు పదునెనిమిదేండ్లు అతఁడు పరిపాక దశనొందెనని తెలిసి భిక్షువుగాఁజేసెను. తరువాత న్యగ్రోధవన మునకుఁజని కొంతకాలముండి శుద్ధోదనుని యనంతరము రాజైన భద్రకుఁడను వానికిని వాని తరువాత ప్రభుఁడైన మహానామునకు నుపదేశముచేసి వారి నుద్ధరించెను.

ఆకాలమున సుప్రబుద్ధుఁ డటకువచ్చి తనపుత్రి యశోధర భిక్షుకియై నందుల కాగ్రహించి నోటికి వచ్చినట్లు బుద్ధుని దూషించెననియు భూమి పగుల నందుపడి సుప్రబుద్ధుఁడు మర

క్షించెననియు నొకచోఁ జెప్పఁబడినది. పదపడి ఆలవియను
గ్రామమునకేగి యట పిల్లలను భక్షించుచుండిన రాక్షసుని తన
దివ్యబోధచే సజ్జనునిగా మార్చి యటకాఁకలితో ధర్మములు విన
వచ్చిన యొకనికి మొదట నన్నమిడి యావల ధర్మములు విని
పించెను. అనల మగధలో నూరూరికి పల్లె పల్లెకుఁబోయి వారి
వారికి తగిన రీతుల బోధించుచు సంఘము నభివృద్ధి పఱచుచుఁ
జనుచుండు తఱి నొక యడవిత్రోవ ప్రక్క వలలోఁ దగులుకొని
విలవిలఁ దన్నుకొనుచున్న జింకను విడిచి పుచ్చి యటఁగల యొక
చెట్టునీడఁగూర్చున్న తఱి వలపన్నిన వేఁటకాఁడువచ్చి జరిగిన
దారసి కినుకగొని కత్తితో బుద్ధుని నఱకవచ్చి యతని ముఖతేజ
ముఁగని నిశ్చేష్టుఁడై నిలిచి తత్ప్రియవాక్కులువిని కరఁగి భృత్యాను
భృత్యుఁడై సంఘమునఁ జేరెను.

## ఆనందుని తోడుగ నుంచుకొనుట

ఆపై శ్రావస్తిలో కొంతకాలము ధర్మవర్షము కురియించి
పాప తాపములఁ జల్లార్చుచుండి యొకనాఁడు తనతోడనుండిన
భిక్షువొకఁడు తన భిక్షాపాత్రము నపహరించుకొని యెటకో
వెళ్లుట రెండుసారు లోర్చినవాఁడు కావున తరువాత అట్లు జరుగ
కుండుటకై తోడువీడకుండు నట్లానందున కాజ్ఞాపించెను అతఁ
డట్లే దగ్గఱనుండి సేవలు సేయుచుండెను. అట్లుండ నా నగరమున
విశాఖయను నొక పుణ్యవనిత సంఘమువారు విడియుటకు

పూర్వారామమను వనమును అందు సంతనగఁ గట్టఁబడిన విహారమును వారికొసఁగెను.

## దొంగను శిష్యునిగఁజేసికొనుట

శాలియను గ్రామ సమీపారణ్యమందుండిన [1] యంగులి మాలుఁడను దొంగను గని బోధించిన పలుకులవలన వాఁడు తన దుర్వృత్తిని మానుకొని బుద్ధుని శిష్యుఁడయ్యెను. జ్ఞానోదయానంతరము బుద్ధున కిట్లిరువదేండ్లు గడచెను.

తదనంతరము బుద్ధుఁడు పెక్కుచోట్లకేగి గుణము వృత్తి జ్ఞానము మొదలగు వానికిఁదగిన రీతుల బోధించి జనుల సన్మార్గవర్తులనుగాఁజేసెనని చెప్పు చరిత్రములు పెక్కులుగలవు. వానిలో దీని తరువాత నిది నడచెనని యెఱిఁగి వివరింప శక్యముకాకున్నది. కావున దీనిపై నతని నిర్వాణమునకు పూర్వము జరిగినవానిలో ముఖ్యమైనవి కొన్నిమాత్రమే యిందు వ్రాయబడుచున్నవి.

ఒకానొకతఱి శూన్యప్రాంతమను చోటినుండి వచ్చి యుపదేశమువిని సన్న్యాసియై సంఘమునఁజేరిన యొక వణిజుఁడు

1. అంగులి మారకుఁడను పేరొందిన యొకఁడొక విద్యనుసాధింప వేయివ్రేళ్లను బలియిచ్చువాఁడై రెండు కొదువగా సాధించి యా రెంటికొఱకు తల్లివ్రేళ్లను ఖండింపఁబూను తఱి బుద్ధుఁడటకేగియుండి యదివిని వానిని తన మధురవాక్కులచే వశపఱచుకొని యా దుష్కార్యమును మానిపి శిష్యునిగా ననుగ్రహించెనని నీలకేశియందుగలదు. వాఁడే వీఁడనుటకును కొంత యవకాశము కలదు.

నన్ను ననుసరించిన వారిని సన్మార్గమున నడప నిచ్చగించితి నుత్తరు విండనియడిగె. బుద్ధుఁడు ఇచ్చటివారు చాలమూర్ఖులుకదా ? వారు నిన్ను మతింపక దూషించిన నేమిచేయుదువని యడుగ నతఁడు మాఱాడననెను. వారు కోపించికొట్టిన నేమిచేయుదువన మాఱుగా వారిని కొట్టననెను. వారు నిన్ను చంప యత్నించిన నేమిచేయుదువన నాతఁడు చావువలననాకుఁగలుగు చెడుగేదియు లేదు ; చావునే యిచ్ఛించువారు లోకమున పలువురు ; నేను నా జీవితకాలము హెచ్చించుటకుగాని తగ్గించుటకుఁగాని యత్నింపను అనియెను. అతని మనశ్శుద్ధినెఱిగి బుద్ధుఁడట్లే చేయుమని యుత్తరువొసఁగెను.

వేఱొకతఱి లేకలేక కన్నకొడుకు చావ వానినెత్తుకొని వచ్చి బ్రదికింపుమని తల్లి వేఁడుటయు బుద్ధుఁడు ఎవరును చావని వారి యింటి యావాలు తెమ్మనిపంప, నామె విచారించి విచారించి విసిగి బుద్ధితెచ్చుకొని యుపదేశమందిన కత యెల్ల రెఱిఁగినదే.

## లోభి నుద్ధరించుట

ఒక పెనులోభి యింటి తలుపులువైచి భార్యతోడ అటుకపై నెక్కి అప్పములుకాల్చి తినుచుండ వానివిషయమున మిక్కిలి జాలిగొని బుద్ధుఁడు వాఁడున్న కడకేగి అప్పము యాచించికొని లోకప్రవృత్తిని వానికిఁ దెలియఁజెప్పి యుద్ధరించెను.

ఒకతఱి గృధ్రకూట పర్వతాగ్రమున నిలిచి యటఁజేరిన వేలకొలఁది జనులకు ధర్మముపదేశించినతఱి నతఁడు తన పాదములట నడుముటచే సహస్రార కమలరేఖలతోడి పాదచిహ్నము లేర్పడినందున నగ్గిరి పాదపంకజగిరి యని పేరొందెను. (చూ. మణి. ౧౦ ప్ర.)

ఒకపరి మగధదేశమందలి గ్రామాధికారులెల్ల రొకచోఁ జేరి బుద్ధునివలన ధర్మములువిని తమగ్రామములలో వ్యాపింపఁ జేసిరి. ఒక సమయమున వైశాలినగర సమీపమందలి ఆమ్ర వనమునఁ గట్టఁబడిన విహారమందు కొంతకాలముండి చేసిన యుపన్యాసములవలన బౌద్ధులైనవారు ఇరువదివేలకుఁ బైఁబడి యుండిరి.

ఒక వానకాలమున వేణువనమున నుండినతఱి దేవదత్తుఁడును తనతండ్రియగు బింబసారుఁజంప యత్నించిన అజాతశత్రువునుచేరి బుద్ధునిపైఁ జేసిన నిందలు, వేఱుమతము స్థాపింపఁ జేసిన యత్నములు, బుద్ధుంజంపఁబూని జేసిన పన్నాగములు మున్నగువాని నాభగవానుఁడోర్పుచేతనే జయించెను.

బుద్ధుఁ డుపన్యసించిన విషయములు పెక్కులు కేవల మతపోషకములుకావు. అవి జీవకారుణ్యము, మద్యనిషేధము, మాంసనిషేధము, అవ్యభిచారము, సత్యవాక్కు, అస్తేయము, దేహసంపదల యస్థిరత్వము, పరోపకారము, కృతజ్ఞత, మున్నగు

ననేక విషయములు. అతని యుపన్యాసములెల్లను పాళీభాషలో వ్రాయఁబడినవి. అవి పిటకములనఁ బ్రసిద్ధికెక్కె. బుద్ధుఁ డుపదేశించినది పాళీభాషయందే.

## అంతిమ దినములు

బోధివృక్షముక్రింద జ్ఞానోదయమైన కాలమునకు నలువది నాల్గవవత్సర వర్షకాలము జేత వనవిహారమునఁ గడపఁబడినది. ఆవల వైశాలికడ ఆమ్రవనమునఁజేరి యుపన్యసించుచుండు తఱి విని యానందించి ఆమ్రపాలిని యను గణిక తనవనమును సంఘమున కొసఁగెను. ఆమెయింట నొకదినము బుద్ధుఁడు సంఘముతోడ భిక్షగ్రైకొనియె. నలువది యైదవ వానకారు వెలువమను గ్రామముకడఁ గడపఁబడినది. అత్తఱి నతనికి దేహారోగ్యము తగ్గినది. అటనుండి వైశాలి కరుదెంచి కపినరః ప్రాంతవనమున విడిసె. అట నొకనాఁడు బుద్ధుఁడు సమాధిస్థితినుండి కనులు తెఱచి జీవితావధి యెఱింగి శిష్యులఁగాంచి "నా జీవితకాలము పూర్తియైనది. ఇఁక సమాధియందే శేషించియున్న కాలమును కడప నిశ్చయించితి. నామేను దొరలని చక్రములుగల తేరువంటి దయ్యె. ఇఁక పరిపూర్ణ నివృత్తినిపొంది గ్రుడ్డునుండి వెలువడు పిల్లవలె వెడలువాఁడను" అను నెడ భూమియదరెను. ఆనందుని గుండెయు గబుక్కుమన ఈ యదరుపునకుఁ గతమేది? యన నేను దేహము వీడఁ దలంచియుండుటయే యని బుద్ధుఁడోదార్చెను.

అటనుండి మెల్లనఁగదలి చనుచు 'ఇఁక నీ వైశాలి నాచేఁ జూడఁబడునదికాదు' అనిపలికి భోగనగర ప్రాంతమందలి ఆనంద చైత్యమను సాలవనమున విడిసి యట శిష్యులకు తత్త్వోపదేశముచేసి తదుపరి కుశీనగరమున కేగుచు భావనగరము చేరి యట నుపచరించిన మల్లురకు సంతసము గలిగించి యా నగరమందలి చందుఁడను కమసలి వేఁడికోలున నతని యింటికేగి శిష్యులతోఁడ భిక్షచేసెను. ఆ యాహారమున పందిమాంసము కలుపఁ బడియుండుటచే నది దేహవియోగమునకుఁ గారణమైన యసౌఖ్యము ను వృద్ధిపఱచెననియు నదియే భగవానుని తుది యాహార మనియుఁ జెప్పుదురు. అప్పుడతని వయస్సు ఎనుబది.

సమస్త మస్థిరమే యను ప్రసంగమాదినమున నాతనిచేఁ జేయఁబడినది. ఆవల నచ్చోటువీడి బయలుదేఱి చనుచు నడవఁ జాలక నిలిచి నిలిచి నడచుచు శ్రమచెంది యానందునిగాంచి దప్పి యెక్కువయ్యెనని అతఁడు కొనితెచ్చిన జలము త్రావి తేఱి యటఁ బ్రవహించు కుకుష్ఠయను నదిం జేరి యందు కడనారి స్నానము కావించెను.

చందుఁడొసఁగిన యన్నమువలననే యసౌఖ్యము వర్ధిల్లె నని మెల్లమెల్ల ననుకొనుచుండు వారి వాక్కులు బుద్ధుఁడువిని యానందుంగని 'వత్సా! చందుఁడు నా మరణమునకు కారకుఁ డయ్యెనని పలువు రతని నిందింతురు. అతఁడు నట్లే తలంప

వచ్చును. అదితప్పు. అతఁడొసఁగిన యన్నము భుజించిన పిమ్మటనే నేను నిర్వాణమంద నర్హుఁడనైతి. దీనివలన నతఁడు గొప్పపుణ్యము పడయఁగలఁడు. రావిమ్రానిక్రింద జ్ఞానము నొందు పూర్వము సుజాతయొసఁగిన యన్నమును ఇప్పుడు నిర్వాణమందుటకుఁ బూర్వము చందుఁడొసఁగిన యన్నము నన్నింటికంటె మేలైనవి. ఇది యతనికిఁ దెలుపుము' అనియె.

## మహానిర్వాణము

తరువాత నతఁడచ్చోటువీడి మెల్ల మెల్ల నడచుచు నిలిచి శ్రమదీర్చికొనుచుఁబోయి పోయి కుశీనగరముచేరి హిరణ్యావతి యను నదీతీరముచేరి శ్రమదీర్చుకొని యానందుంగాంచి, 'నాయనా! ఆ సాలవృక్షద్వయ మధ్యభాగమును శుద్ధిచేసి నిరుచల్లి చాఁప పఱుపుము. నేఁడు నడుజామున నిర్వాణమందుదును' అనియెను. ఆ పలుకులువిన్న యానందుఁడు దుఃఖ మాఁపుకొన లేక పోయినను అతనియాజ్ఞ నెఱవేర్చుట ముఖ్యధర్మమని యెంచి యట్లు కావించి యెఱిఁగించెను. తథాగతుఁ డచటుచేరి తల యుత్తరముననుంచి కుడిచేతిని తలగడగానుంచుకొని పడమటి దెసగా మొగముత్రిప్పి కుడిప్రక్క కొఱగి కాలిపై కాలువైచి మగసింగము భంగిఁబరుండి తాను నిర్వాణమందిన పిదప దేహము నిట్లుంచవలయు ననియు, తనకు తరువాత శిష్యులెల్లరు నడవ వలసిన విధానములను ఆనందునకుఁదెలిపెను. తెలిపి యానం

దుఁడు వందురుటఁగాంచి ఈ లోకమున నొక్కటియు శాశ్వతము
కాదుగదా! ఒక్కొక్క వస్తువునుండియు మనము [1] విడివడ
వలయును. అదియే ముక్తికిఁగారణ మగునని పలికి తన్నే
కాంచుచు చుట్టుమూఁగి విలపించు శిష్యులఁగాంచి నే నెఱిఁగినవి
యెల్ల నెఱిఁగిన వాఁడానందుఁడు. కావున నికమీఁద నావలన
నెఱుఁగవలసినవి యెల్ల నితనివలన నెఱుఁగుఁడని వచించి కొంత
సేపు నిదురించె. నిదురించుతఱి శిష్యులెల్లరు చుట్టునిలిచి ప్రపం
చము మఱచినదేయని నిట్టూర్చిరి. గాలి మెల్లననిలిచినది. వెల్లు
వలు శబ్దమువీడినవి. పక్షులు మృగములు ఎట్టి సద్దు గానింప
వయ్యె. వేలుపులు మనుజులు మిక్కిలి దుఃఖమునందిరి. అట్టి
యెడ బుద్ధభగవానుఁడు మేల్కాంచి యానందుంగాంచి నానిర్వాణ
కాలము సమీపించెనని మల్లురకుం దెలుపు మన నతఁడు పల
వించుచు నేగి వారికిఁ దెలుప వారలు నేడ్చుచువచ్చి యతని
దర్శించి యతని దేహశక్తి తగ్గుచుండుటఁగాంచి యెలుగెత్తి పల
వించిరి. భగవంతుఁడు సుఖవికాసముతో వారిఁగని దుఃఖింప
కుఁడు. ఇది సంతసింపఁ దగుకాలము. పొందఁదలఁచి చాల
కాలము యత్నించుచుండిన గొప్ప యానందము నిప్పుడు పొంద
నున్నాఁడ. దుఃఖకరమైన యింద్రియ కారనుండి విడివడి
శాశ్వతానంద మయమైన నిర్వాణమందుచుంటినని మఱికొన్ని

---

1. వేనివేని తగులు వీడుచునుండు, వాని వానివలన వనరుటలేదు.

త్రిపర్గము 3౬౧

వాక్యములాడి వారి నూరార్చి సత్యముపదేశింప వారొక తీరున చిత్తసమాధానమంది దూరమేగిరి.

అట్టియెడ గొప్పవిద్వాంసుఁడు సచ్ఛీలుఁడు కుశీనగరవాసి సుభద్రుఁడను బ్రాహ్మణసన్న్యాసి బుద్ధుని స్థితిని దర్శింప విని వినవచ్చి యట నానందుంగాంచి తన యుద్దేశముం దెలుప నతం డితఁడు వాదింపవచ్చెనని యెంచి యటకుఁ గొనిపోవ సమ్మతింప లేదు. అదియెట్లో యెఱిఁగి బుద్ధుడు రప్పింపుమని యాజ్ఞా పించెను. సుభద్రుఁడు సమీపించి యతనితో యుక్తసంభాషణ మాచరించి యతని సిద్ధాంతమువిని సమ్మతించి యతని తుదిదశ గానఁజాలక చింతతో వేఱుచోటి కరిగెను.

రేయి తొలిపాలు కడచె. ప్రపంచమే నిశ్శబ్దమయమై యుండె. బుద్ధుఁడు క్షీణించిన మనశ్శక్తితో శిష్యుల విలోకించి తథాగతుఁడు పలికిన వానిలో నేవేని సంశయగ్రస్తులై యున్నవా? ఉన్నచోఁ దెల్పుఁడనియె. ఎవ్వరు నేమియుఁ బలుకరైరి. ఆవల మీరు నన్నును నాపలుకులను బ్రేమించిన రీతిని పరస్పరము బ్రేమించుచు వర్తింపుఁడు. అని యాజ్ఞాపించె. ఎల్లవారలు మౌనముద్ర ధరించియుండ ననురుద్ధుఁడు మిక్కిలి దుఃఖించుచు తథాగత భగవానుఁడేల యింత శీఘ్రకాలమున నిర్వాణమందవలయు ననియె. వానికి బుద్ధుఁడు సమాధాన మొసఁగి యెల్లరఁగాంచి 'నెచ్చెలారా! జన్మమునకు హేతు

వేదియో యదియే మరణమునకును హేతువగును. ఈ సత్య వాక్యమును మఱవకుఁడు. మనస్సులనుంచుకొనుఁడు. ఇఁక నావార్తలు వెలివడునవికావు' అని యుపదేశించి యన్ని బంధములు వీడి నిర్వాణమందెను. ఆ కాలము ఈశాన శకాబ్ది ౧౮౮౮-వ సంవత్సరము వైశాఖమాసము విశాఖతోడి పూర్ణిమదినము మంగళవార మందురు.

## చరమక్రియలు

శిష్యులు ఇతర జనములు మునులు వేలుపులు పలువిధములఁ గొంతవడి పలవించి తుదకు చిత్త సమాధానమందిరి. పదపడి భగవానునిమేను పరిమళ వస్తువులతోఁ గడిగి పైఁడిపల్లకి యందుంచి బహువిధ వాద్యములతో కీర్తనములతోఁ గొనిచని హిరణ్యావతిదాఁటి పూర్వము నిర్వాణమందిన బుద్ధులకై కట్టియుంచిన చైత్యముచేరి యట చందనాదిక సుగంధకాష్ఠములఁ చేర్చి యావేర్పుపై నతని మేనినుంచి పై నాకచ్ఛెలనుంచి పరిమళ తైలములందుపోసి యగ్గిముట్టించి ప్రదక్షిణముచేసి చేయఁదగు విధుల నెఱవేర్చిరి బూదియు నెమ్ములు మిగిలినవి. మల్లురా యెముకలనొక బంగరు పాత్రమునందుంచి పూజించి కొలుచుచుండిరి.

## ధాతు గోపములు

ఆపై తథాగతుని నిర్వాణమువిన్న మగధరాజు మున్నగు రాజులేడుగురువచ్చి యా యంగముల భాగము పంచుకొనఁగోరి

రాయబారమంపిరి. మల్లు రొప్పుకొనలేదు. దానిచే కోపములు పెరిఁగి యుద్ధమే జరుగుస్థితి సంఘటిల్లెను. అట్టితఱి[1] సుభద్రుఁడను విప్రుండొక్కరుండు మధ్యస్థుఁడై నిలిచి సమాధానము కావించి యా యస్థులను ఎనిమిది భాగములు చేయించి తలకొక పాలిప్పించెను. తమతమ భాగములఁ దమదమ దేశములకుఁ గొంపోయి ధాతుగోపనములను పేర వారాలయములుకట్టించి యందు వానిని భద్రపఱచి పూజించుచువచ్చిరి. సుభద్రుఁడు మల్లురఁ బ్రార్థించి యా పైఁడిపాత్రను దీసికొని యా యెనమండ్రు రాజులకడకేగి యొక్కొక్క మఃక్కనడిగి గైకొని యాపాత్ర మందుంచి తానొక చైత్యముకట్టించి యందు పదిలపఱచి పూజింపసాగెను.

ఆ చైత్యమునకు సువర్ణపాత్రి ధాతుగోపమనిపేరు. కుశీనగర ప్రజలాబూడిదను ప్రోగుచేసి దానినొక చైత్యమును గట్టించి భస్మధాతుగోపమని పేరిడి సేవించుచుండిరి.

## పరంపరగా వచ్చిన అలవాటులు

వైడూర్యుఁడను రాజునకు బుద్ధుఁడు నూటయెనిమిది రావిపూసల హారమునిచ్చి జపింపుమన్న కారణమున జపమాల గొని మంత్రముజపించు అలవాటైనది. బుద్ధుని యెడఁబాటు సైఁపలేని బింబసారుఁడు మున్నగువారు అతనివలెనే అయిదడుగుల రెండంగుళముల విగ్రహములను మంచిశిల్పులచేఁజెక్కించి

1. ఇతఁడు మునుపటి సుభద్రుఁడుకాఁడు, వేఱు.

గృధ్రకూట విహారమున స్థాపించి సేవించుచుండినందున బుద్ధ విగ్రహ పూజయేర్పడియె. ఇప్పుడన్ని విగ్రహముల పూజలు పుష్పపూజలేర్పడుట కదియే మూలకందము. బుద్ధుఁడు గృధ్రకూట విహారముననుండినతఱి నతనిఁ జంపనెంచిన దేవదత్తుఁడొక మంత్రవాదినంప వాఁడు ప్రేరేపించి పంపిన పిశాచగణములఁదోల దేవగణములు కాశ్యపుని మున్నుంచుకొని పెక్కుపడగల (పతాకల) ధరించి జయఘంట మున్నగువాద్యముల వాయించుచుఁ జనుటచే బుద్ధాలయములందు వాద్యములు వాడుకకు వచ్చినవి. ఆ మంత్రవాది కోఁడెరూపము దాల్చినతఱి శక్తిగ్రుంగి మరణించు నపుడు నాచర్మముచేఁ గట్టించినభేరి బుద్ధునియెదుర వాయించు నట్లు వరముకోరినందున ఆలయములలో భేరివాయించు నాచారమైనది. బుద్ధచైత్యాలయములం బట్టియె తక్కిన శివ విష్ణ్వాలయము లేర్పడినవనియు ఆలయపద్ధతులు కూడ నయ్యవియే యనియు విజ్ఞులు విమర్శకులు తెలుపుచున్నారు.

ఈ మణిమేఖల గ్రంథమున బుద్ధుని పాదచిహ్నములున్న యాలయములు సంగమపురి యందును లంకయందు నున్నట్లు తెలియుచున్నది. మఱియు మణిపల్లవము, పాదపంకజగిరి, ఇంద్ర విహారములు మున్నగునవి యున్నట్లు తెలియుచున్నది.

శ్రీరామ.

## 2. బౌద్ధ ధర్మము.

రెండవ మణియగు ధర్మమునుగూర్చి యించుక విచారింతము. హిందూదేశమందలి వేదమతమునకు విరుద్ధముగ బుద్ధుఁడు తనమతమును స్థాపించెనని బ్రాహ్మణుల యభిప్రాయము. అభిప్రాయమేకాదు తీర్మానముకూడ. విచారించిచూడ ఉపనిషత్తులందును షడ్దర్శనములందును లేని ధర్మములేవియునిందు లేవు. ఈ విషయము నితరదేశీయులగు రైస్‌డేవిడ్స్, మాక్సుముల్లర్, మోనియర్ విలియమ్స్ అను విజ్ఞానవేత్తలు విమర్శించి వ్రాసియున్నారు. మఱి యీ యపవాదమునకు కారణమేదియన, అన్నిజాతులవారిని బుద్ధుఁడు తనమతమునఁ గలుపుకొనుచుండె. దానిచే బ్రాహ్మణాధిక్యము తగ్గినది. అది కారణముగ వారీనింద మోపుటలో నాశ్చర్యమేమియులేదు. బౌద్ధధర్మములలో కొన్ని బ్రాహ్మణాధిక్య మతవిరుద్ధములు కావచ్చును కాని మానవ విరుద్ధములు లోకవిరుద్ధములు మాత్రముకావు వైదికులద్వైతులను సైతము ప్రచ్ఛన్న బౌద్ధులని నిందించిరి. వారి యాధిక్యమును కొఱంత వఱచి సర్వమానవ సమానత్వము స్థాపించునవన్నియు వారి దృష్టికిఁ జెడ్డవే. ప్రచ్ఛన్న బౌద్ధులన్న వాక్యమే వేదాంతులకును బౌద్ధులకును గల సన్నిహితత్వము చక్కఁగాఁ దెలుపుచున్నదిగదా! పౌరాణికులును బుద్ధుని విష్ణ్వవతారములలో లెక్కించుటచూడ నా మతము హిందూమతము కంటె వేఱుకాదని తెలియుచుండలేదా?

బౌద్ధమతమున మహాయానము హీనయానమని రెండు మార్గములుకలవు. నేపాళము, త్రివిష్టపము, చీనా, జపాను దేశములందు మహాయానముకలదు. బర్మా యందును లంక యందును హీనయానము వ్యాపించినది. మహాయాన సంబంధ ములగు పెక్కుగ్రంథములు సంస్కృతమునఁగలవు. హీనయాన మునకు పాళీభాషయందు వ్రాయఁబడిన త్రిపిటకమే మూలగ్రం థము. బుద్ధునికాలమందు బౌద్ధులకు వేదాంతులకు తత్త్వ విషయమైన వాదోపవాదములు ఎక్కువగానున్నట్లు తెలియ రాదు. కావున నతనికిఁ దరువాతనే బౌద్ధమతమందు ప్రసిద్ధమై యున్న మాధ్యమికులు, యోగాచారులు, సౌత్రాంతికులు, వైభాషికులు అను నాల్గుతెగలవారి తత్త్వశాస్త్ర సంప్రదాయ ములును కలిగియుండవలయును.

వేదాంతశాస్త్రమునం దడఁగియున్న అప్రత్యక్ష తత్త్వ ములను అనుమాన ప్రమాణముచే సాధింప వీలుకాదను నభి ప్రాయము గలవాఁడు బుద్ధుఁడు. అయినను వారి ధర్మతత్త్వ విధులను చేకొనక యుండలేదు. స్వప్రయోజనముకొఱకు చేయు నది ధర్మము కాదనియు నట్టియత్నము దుఃఖమే మూర్తీభవించిన యట్లు ఐహికబంధములను వృద్ధిపఱచు చుండుననియు స్వప్రయో జనము కోరని పరోపకార కర్మమే యైహికబంధములఁ ద్రెంపఁ జాలుననియు నతని ముఖ్యాభిప్రాయము. ఈ విషయము, స్వార్థ రహితుఁడు పరులకొఱకె యను పారమార్థికుఁడు (మ. ని ౫. ప్రక.) మున్నగు వాక్యములవలనఁ దెలియనయ్యెడిని.

దేవుఁడు కలఁడనియు ఆత్మకలదనియు వానిలక్షణము
సంబంధము నెఱుఁగుటయే సన్మార్గమున కాధారమనియు నతఁడు
దృఢముగ నెంచినవాఁడుకాఁడు. దైవమును గూర్చియు
నాత్మను గూర్చియు నెవ్వరు నెంతమాత్రము నెఱుఁగ వలంతులు
కారని యతని యుద్దేశమైయుండవచ్చు. అయినను దుఃఖ
ములతో నిండిన భవరోగమునుండి విడివడుటయే మనుజులు
పొందఁదగు గొప్పఫలమనియు 'నేను నాయది' యను ఇరుతెగల
బంధమే భవరోగమునుండి తొలఁగనీయక యడ్డుపడుచున్న
దనియు, నది వీడిన నిర్వాణస్థితియందు దుఃఖములకు చోటే
లేదనియు నాతఁడు గట్టిగ నమ్మెను. ఆత్మనుగూర్చి బ్రహ్మ
మునుగూర్చి వాదాడుటకంటెను నడవడిని బాగుచేసికొని జీవికను
సాగించుటచే దుఃఖజాలము తగ్గునని నిశ్చయించి తనపద్ధతిని లోక
మునకుఁ జాటి యట్లుపదేశించెనని తలంపఁదగుదును. బుద్ధుని
కొందఱు నాస్తికుఁడనియు అనాత్మవాదియనియు చెప్పుదురు.
త్రిపిటకమందలి యతని యుపదేశములం దొక్కచోటేని యీ విష
యమును పూర్తిగ వివరించునదిగా తెలియరాదు. ఇట్లు వాదించు
వారు బౌద్ధుల నిర్వాణమును శూన్యస్థితి యందురు. అది
బుద్ధుని సిద్ధాంతమని చెప్పుటయు మహాసాహసము.

సంయుక్తనికాయమను బౌద్ధగ్రంథమున వత్సగోత్రుఁడగు
సన్న్యాసి గౌతముని కడకేగి ఆత్మకలదా? యన నతఁడు మౌనము
వహించెను. ఆత్మలేదా యన్నపుడును మౌనమే తాల్చెనని
చెప్పఁబడినది. అందే మఱొకచో, కోసలరాజగు ప్రసేనజిత్తు

సాకేతమునకు శ్రావస్తికి నడుమఁ జనుచుండి క్షేమయను భిక్షుణిని సంధించి తనసంశయముదీఱ నిట్లు సంభాషించె.

రాజు :— భగవతీ! తథాగతుఁడు మరణించిన పిదపను కలఁడా?

క్షేమ :— రాజేంద్రా! ఆ వార్య బుద్ధుఁడట్లు చెప్పలేదు.

రాజు :— భగవతీ! అట్లైన మరణించిన పిదప నతఁడు లేఁడా?

క్షేమ :— అట్లును భగవానుఁడు సెలవీయలేదు.

రాజు :— భగవతీ! అట్లైన బుద్ధుఁడు మరణించిన పిదప నున్నాఁడనవచ్చు; లేఁడనవచ్చునుగదా! లేక ఉన్నవాఁడును కాఁడు లేనివాఁడునుకాఁడు అనవచ్చునుగదా?

క్షేమ :— ఇందు దేనినిగూర్చియు నాచార్యుఁడు సెలవిచ్చి యుండలేదు ఈ ప్రశ్నోత్తరములును నిర్వాణమును శూన్యావస్థయని చెప్పలేదు. ఆత్మలేదని యతఁడు నిశ్చయించి నట్లెందును చెప్పఁబడదు. నిర్వాణమొందిన పిదప దుఃఖములు పూర్తిగఁ దొలఁగుననియు నాదుఃఖములఁ దెంప యత్నించుటయే సమస్త ధర్మములకును ముఖ్యఫలమనియు నిశ్చయించి లోకము సుఖించుకొఱకు తనమతము నతఁడెల్లర కుపదేశించె.

బుద్ధుఁడు బోధిమూలమున జ్ఞానోదయమొందినపిదపఁ దన మతమునకు పునాదులైన నాలుగు సత్యములతని మనసునఁ

ప్రవేశించినవి. వానిపైనే తనమత సౌధమెల్ల నిలిచియున్నది. అవి ౧ దుఃఖము. ౨ దుఃఖోత్పత్తి. 3 దుఃఖనివారణము. ౪ దుఃఖనివారణమార్గము. జ్ఞానోదయమందిన తరువాతఁ దనతోడ మున్ను తపము గావించుచుండిన యేవురకుఁ దొలుత నుపన్యసించిన సారాంశమిది.

సన్యాసులారా! తొలి సత్యమిది. జన్మదుఃఖము, వ్యాధి దుఃఖము, జరాదుఃఖము, మరణదుఃఖము, అప్రియ సంగదుఃఖము, ప్రియవిరహదుఃఖము, అనుపలబ్ధి (కోరినది పొందమి) దుఃఖము. సంగ్రహించి చెప్పవలసినచో పంచేంద్రియ విషయమే దుఃఖము. రెండవ సత్యమిది. అల్పాశయములు నెఱవేఱుటకొఱకగు కామలోభములతోఁ జేరిన తృష్ణ. ఇదియే జన్మమునకు విత్తు [1] సుఖతృష్ణ, జీవితతృష్ణ, అధికారతృష్ణ యను నవి యిందలి విభాగములు. మూఁడవ సత్యమిది. ఆశవదలి మరలఁ జేరనీయక తాను దానినుండి విడివడి పదపడి చేరక దానిని పూర్తిగ నాశముచేయుట తృష్ణానాశము. నాల్గవ సత్యమిది. అష్టాంగమార్గమిదియే! ఇది సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము, సమ్యగ్వాక్కు, సమ్యక్కర్మము, సమ్యగాజీవము, సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి అను నెనిమిది కలది.

---

1. అన్ని జీవములకు నన్నికాలముల, నెన్న వాసయె బాములిచ్చెడి విత్తు. త్రివర్గము. ౩౬౧.

లోకజీవితము దుఃఖమయమగుట సాంఖ్యులకును వేదాంతులకును తక్కిన దార్శనికులకును జైనులకును బౌద్ధులకును సామాన్యమే.

మఱియు నయ్యేదుగురు శిష్యుల కిట్లుపదేశించెనని మహావర్గమను గ్రంథమువలనఁ దెలియుచున్నది. ఓ సన్న్యాసులారా! రూప మాత్మకాదు. రూప మాత్మయైనచో దానికి రోగములు రారాదు. ఆత్మ కానందున నది రోగముల కిల్లైయున్నది. తన దేహ మిట్లుండవలె నిట్లుండరాదని యాజ్ఞాపింప నగ్గావై యుండలేదు.

వేదన, సంజ్ఞ, సంస్కారము, విజ్ఞానము అను తక్కిన స్కంధములంగూర్చియు నివి యాత్మ కానేరవు అని తెలియంబలికి యీ క్రిందిరీతి సంభాషించె.

బు:— దేహము స్థిరమైనదా?

శి:— తండ్రి! కాదు.

బు:— అస్థిరమైన వస్తువు సుఖకారకమా? దుఃఖకారకమా?

శి:— దుఃఖకారకమే.

బు:- అస్థిరము దుఃఖకారకము మాఱుపాటుకలది యగు వస్తువును బాగుగా పరిశీలించినపిదప నొకండు 'అది నాయది' యనియు 'అది నేనే' యనియుఁ జెప్పఁదగునా?

శి:— తండ్రీ! చెప్పఁదగఁడు, తగఁడు.

ఇట్లే పై నాలుగు స్కంధములఁ గూర్చియు సుస్థిరములు కాని కారణమున నాత్మ కావని దుఃఖనిలయములని చెప్పి యున్నాఁడు.

ఆత్మ తత్త్వమునుగూర్చియు పరబ్రహ్మమునుగూర్చియు వేదాంతులు ప్రవచించిన తీరున విస్పష్టముగ బుద్ధుఁడు చెప్ప కుండినను ప్రపంచ సంబంధమైన వస్తువులన్నియు నస్థిరము లగుటచే లోకమును లోకజీవితమును దుఃఖనిలయములని నుడివి యున్నాఁడు. ఇట్లన్నియు దుఃఖమయములగుటచే బౌద్ధులు లౌకిక వ్యాపారమొక్కటేని కూడదని విడిచి తమ్మునుతామే కష్ట పెట్టుకొనువారని చెప్పుటకును వీలులేదు. ధర్మపథమందలి యీ క్రింది వాక్యములఁ జదువుఁడు.

"అలవఱుచు వానిచే వశపఱచుకొనఁబడిన గుఱ్ఱములం బోలె నెవని కామాదులడఁగింపఁబడునో యెవఁడహంకారమును వీడునో యెవఁ డపవిత్రమునుండి తొలఁగునో అట్టి పరిపక్వజనుని గాంచి దేవతలును [1] అసూయపొందుదురు. పగనిండిన యీ లోకమున నొకశత్రువేని లేక పరిపూర్ణానందముతో మేము జీవించుచున్నారము. పగగల మనుజులలో పగలేక వసించు చున్నారము. రోగులనడుమ నీరోగులమై యున్నారము. కష్టించువారినడుమ కష్టములేక ఆనందపూర్ణులమై యున్నారము. దేవతల యానందము మాచేతి రొక్కపుసంచివలె నున్నది.

---

1. ఇంత గొప్పవాఁడయ్యెనా యను నధికాశ్చర్యము.

అని ఎవ్వరును లేనియింట వసించుచు ఆత్మను శాంతిచే నిండించు కొనుచున్న భిక్షువు సత్యోద్దేశము కలవాఁడై మనుజ సహజమైన యానందముకంటె నతిశయానంద మనుభవించుచున్నాఁడు. ”

దుఃఖోత్పత్తికిఁ గారణమిట్లు చెప్పఁబడినది. అవిద్యనుండి సంస్కారములు, సంస్కారములనుండి విజ్ఞానము, విజ్ఞానము నుండి నామరూపములు, నామరూపములనుండి షడాయతనము (ఇంద్రియములు, మనస్సు), షడాయతనమునుండి స్పర్శము, స్పర్శమునుండి వేదన (అనుభవము), వేదననుండి తృష్ణ, తృష్ణ నుండి భవము (జన్మకారణమగు కర్మసంచయము), భవము నుండి జన్మము, జన్మమువలన వార్ధకము, మరణము, నొవ్వి, రోదనము, శ్రమము, చింత, నిర్వేదము నను కర్మఫలములు కలుగుచున్నవి. దుఃఖములకెల్ల నిదియే మూలము (చూ. మణి. 30-వ ప్రక.)

ఆశ పూర్తిగ విడిచిన అవిద్య నశించును. అవిద్య నశింప సంస్కారములు నశించును. సంస్కారములు నశింప విజ్ఞానము నశించును. విజ్ఞానము నశింప నామరూపములు నశించు. నామ రూపములు నశించిన షడాయతనము నశించు. షడాయతనము నశింప స్పర్శము నశించును. స్పర్శము నశించిన వేదన నశించును. వేదన నశించిన తృష్ణ నశించును. తృష్ణనశించిన ఉపాదానము నశించును. ఉపాదానము నశించిన భవము నశించును. భవము

నశించిన జన్మము నశించును. జన్మము నశించిన ముదిమి మరణము నొవ్వి రోదనము శ్రమము చింత నిర్వేదము నశించును. (చూ. మణి. 30-వ ప్రక.)

ఈ యవిద్య మున్నగు పండ్రెండును ద్వాదశ నిదానము లనఁబడును. వీని పరస్పర కారణ కార్యపద్ధతి నెఱిఁగినచో బుద్ధుని రెండవ మూఁడవ సత్యములైన దుఃఖోత్పత్తి దుఃఖ నివారణములు తేట తెల్లమగును. బౌద్ధమతము సకల మూల వస్తు తత్త్వచర్చకుఁ బూనలేదు. అట్టిప్రశ్నకు త్తరముగ బుద్ధుఁడు మౌనముఁ దాల్చుటచే తద్విమర్శనము ఫలము నీయదనుటయే మౌనఫలమని తెలియుచున్నది. అట్టి సకల వస్తు మూలతత్త్వ చర్చ బౌద్ధమతమందు లేకున్నను సమస్తము కారణ కార్యములకు లోనైనదనుట తన్మతము సమ్మతించియే యున్నదికదా? కారణమున్నచో కార్యముకలుగును. కారణమును పోఁగొట్టినచో కార్యమును లేకపోవునను న్యాయముం గొనియే బుద్ధుఁడు లోకమున నెల్లయెడలఁ గానంబడు దుఃఖము నెల్లవారు పోఁగొట్టుకొన యత్నింపవలసిన మార్గమును తాను కనిపెట్టి యుపదేశించెను. ఈదుఃఖము మూలతత్త్వమునకుఁ జెందనిదగుటచే నీ దుఃఖమును తొలగించుకొనుటకా మూలతత్త్వజ్ఞాన మవసరము లేదనియే యతఁడు భావించినట్లు తెలియుచున్నది. కాఁబట్టియే ద్వాదశ నిదానములలో నన్నింటికి మూలకారణముగా నొక్కటియుఁ జెప్పఁబడలేదు.

## పంచ స్కంధములు

బౌద్ధుల మానసశాస్త్ర సిద్ధాంతపద్ధతి నారసితిమేని విజ్ఞానముగల ప్రాణులన్నియు నైదుస్కంధముల చేరికచేఁ గలిగి నవని వారు తలంచియున్నట్లు తెలియవచ్చుచున్నది. అవి రూపము, వేదన, సంజ్ఞ, సంస్కారము, విజ్ఞాన మనునవి.

అందు రూపస్కంధము రూపములకెల్ల కారణమగు వస్తువును తెలుపుచున్నది. ఈ రూపస్కంధమున పృథివ్యప్తేజో వాయువులను నాలుగు భూతములును జ్ఞానేంద్రియములైదును శబ్ద స్పర్శరూప రసగంధములను నైదుతన్మాత్రలును స్త్రీ పురుష భేదములు మున్నగు సిరువది యెనిమిది తత్త్వము లిమిడియున్నవి. ఆకాశము నొక భూతముగా వారు కైకొనరు.

వేదనాస్కంధమన, ఇంద్రియములకు తన్మాత్రలకుఁ గల సంబంధముచేఁ గలుగు విజ్ఞానము. ఇంద్రియములైదు మనస్సు నను షడాయతనముచే నీ జ్ఞాన మాఱువిధములగును. ఈ యాఱింట నొక్కొక్కటియు కుశలము అకుశలము కుశలాకుశల మను మూఁడు విభాగములగుటచే వేదన యనునది పదునెనిమిది విధములగుచున్నది.

సంజ్ఞాస్కంధ మనునది షడాయతనముచే నగు నాఱు విధముల విజ్ఞానమునకు సంబంధమంది యాజ్ఞానముచేఁ గలుగు సామాన్య విశేష విజ్ఞానములఁగాని వస్తువులను వేరిడి గుర్తించి

చూపుటకు వలసిన తెలివియగును. ఈ స్కంధము షడింద్రియ ములద్వారమున నేర్పడుటంబట్టి యాఱువిధములగుచున్నది.

సంస్కార స్కంధమన, మనస్సు వాక్కు కాయ మను కరణత్రియముచే చేయఁబడు కార్యభేదములచే నాకరణ ములకుఁ గలుగు పరిపాక విశేషము. ఇయ్యది యేఁబది రెండు విధములగును.

విజ్ఞాన స్కంధమన, నిద్రించువారి తెలివి కర్తృత్వ భోక్తృత్వములు లేక సాక్షిమాత్రమై నిలిచిన కరణిని చేతనుల శరీరమందుండి వారి విజ్ఞానములకెల్ల నాధారమైయుండు చైతన్య తత్త్వము. ఈ విజ్ఞాన స్కంధము తనకార్యములైన పలువిధముల తలంపులవలనఁ గలుగు పుణ్యపాపములఁగాని యెనుబది తొమ్మిది విధములుగ విభజింపఁబడియున్నది.

ఈ స్కంధములన్నియు నిలుకడలేనివి. రూపము నురుగు వలె నేర్పడి వెంటనే నశించునదనియు వేదన నీటిబుడగవంటి దనియు సంజ్ఞ యెండమావుల వంటిదనియు సంస్కారము అరఁటి పలె బలము నిలుకడ లేనిదనియు విజ్ఞానము ఇంద్రజాలమును పోలినదనియుఁ జెప్పఁబడినవి.

## పునర్జన్మకారణము

జన్మమే దుఃఖములకు ముఖ్యకారణము. జన్మమున కవ కాశ మున్నంతవఱకు మనుజుఁడు దుఃఖములేని స్థితినొందలేఁడు.

పునర్జన్మకారణమును పునర్జన్మమార్గమును బౌద్ధగ్రంథములం దిట్లు చెప్పఁబడినది.

ఒకఁడు మరణము నొందునపుడు వానింజేరిన యైదు స్కంధములును తమ చేరికనుండి విడివడుచున్నవి. ఏ స్కంధము లిట్లు విభజింపఁబడిన స్థితిలో వానిజీవితకాలమునఁ జేయుచుండిన పాపపుణ్యములన్నియు విజ్ఞానస్కంధమునందు విత్తువలె నడంగియుండి యవ్విజ్ఞాన స్కంధమును తమకు తగిన గతి (జన్మము)లో తక్కిన నాలుగు స్కంధములతో కలిపి మఱుజన్మమును గలిగించుచున్నది. ఇట్టి కర్మప్రవాహమే మఱు జన్మమునకు మూలము. ఒకదీపమునుండి పలుదీపములు ముట్టింపఁబడునట్లు ఒకజన్మమునుండి పెక్కుజన్మములు కలుగు చున్నవి. ఒకనదిలో నీరు ప్రవహించుచున్నపుడు ఒకచోట నొకక్షణమునఁ జూచిననీరు మఱుక్షణమున లేకపోయినను ప్రవాహ మెడతెగక పోవుచుండుటచే ప్రవాహ మొక్కటిగనే తలంపఁబడినట్లు రాఁగల జన్మముల తొడరిక యొకటిగనే యుండును. దీనిని వివరింపకొఱకే ఈతొడరికకు వాయు సంతానము దీపసంతానము ధారాసంతానము పిపీలికా సంతాన మను నాలుగింటి నుదహరింతురు. తామొనర్చిన పుణ్యపాప ముల ననుసరించి మనుజగతి దేవగతి బ్రహ్మగతి నరకగతి మృగ గతి పిశాచగతి యను నాఱింట నొకటి నొందుదురు. (చూ. మణి. ౩౦-వ ప్రక.) ఈ గతులొందువారు చక్రవాళమనఁబడు

బ్రహ్మాండమున నడఁగిన ముప్పదియొక్క లోకముల నందురు.

ఈ ముప్పదియొక్క లోకములు చక్రవాళము నడుమ నున్న మేరుగిరి యడుగునుండి యుచ్చివఱకు క్రమముగా నొకటిపై నొకటియుండును. ఇట్లనేక చక్రవాళములు గలవనియు నవి [1] కల్పముల మొదటఁ దోఁచి తుదిని నశించునవనియు నొక్కొక్క చక్రవాళమందును మేరుగిరియు దానిం జుట్టియుండు సప్తకుల పర్వతములును ఆగిరుల నొక్కొక్కటిం జుట్టి యాగిరి పొడవు లోఁతు వెడలుపుగల యేడు సంద్రములును వీని నన్నిటిని చుట్టి యున్న మహాంబుధియందలి జంబూద్వీపము మున్నగు నాల్గు మహాద్వీపములును ఆ నాలుగింటిలో నొక్కొక్క దానిని చుట్టి యైదేసినూర్ల చిన్నదీవులును కలవనియు బౌద్ధుల విశ్వాసము. మహాద్వీపములు నాలుగింట దక్షిణమున నుండునది జంబూ ద్వీపము. అట్టి యీ చక్రవాళమునందున్న ముప్పదియొక్క లోకములలో క్రిందిది నరకలోకము. అది మహానిరయము, రౌరవము, కాలసూత్రము, సంజీవనము, మహావీచి, తపనము, సంప్రతాపనము, సంఘాతము ను నెనిమిది విధములు. నరక లోకమునకు పైది తిర్యగ్లోకము. దానిపైది ప్రేతలోకము. ఈ క్రింది పథకము చూడుఁడు.

---

1. కల్పమనఁగా యుగము. హిందువుల జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతము మేరకు కల్పమునకు 432 కోట్ల సంవత్సరములు. బౌద్ధుల సిద్ధాంతమునందు స్పష్టముగా లేదు.

## లోకములు ౩౧.

ఈ నాలుగును అరూప బ్రహ్మలోకములు

౩౧. అసంజ్ఞాయతనము
౩౦. అకించన్యాయతనము
౨౯. విజ్ఞానానంద్యాయతనము
౨౮. ఆకాశా నంద్యాయతనము

ఇవి యైదవధ్యానమున తేలినవారు పొందఁ దగినవి.

యిరువదియేడును బ్రహ్మలోకములు

పదునారును రూపబ్రహ్మలోకములు

౨౭. అఘనిష్ఠ
౨౬. సుదర్శి
౨౫. సుదర్శ
౨౪. అరప
౨౩. అబృహత్
౨౨ అసంజ్ఞా (అసత్వము)
౨౧. బృహత్ఫల

ఇవి నాల్గవధ్యానమున తేలినవారు పొందఁ దగినవి.

౨౦. శుభకృత్స్న
౧౯. అప్రమాణ శుభ
౧౮. పరీత శుభ

ఇవి మూఁడవధ్యానమున తేలినవారు పొందఁదగినవి.

౧౭. అభాస్వర
౧౬. అప్రమాణాప
౧౫. పరీతాప

ఇవి రెండవధ్యానమున తేలినవారు పొందఁదగినవి.

౧౪. మహాబ్రహ్మ
౧౩ బ్రహ్మ పురోహిత
౧౨. బ్రహ్మ కాయిక

ఇవి మొదటిధ్యానమున తేలినవారు పొందఁదగినవి.

ఇవి ౧౬ బ్రహ్మలోకములు

| | | |
|---|---|---|
| ఈ యారును ఊర్ధ్వ లోకములు | ౧౧. పరనిర్మిత వశవర్తి | ఈ పదునొకండును కామలోకములు. |
| | ౧౦. నిర్మాణరతి | |
| | ౯. తుషిత | |
| | ౮. యామ | |
| | ౭. త్రయ త్రింశత్ | |
| | ౬. మహారాజిక | |
| | ౫. మనుష్య | |
| ఈ నాలుగును అధోలోకములు | ౪. ఆసురిక | |
| | ౩. ప్రేత | |
| | ౨. తిర్యక్ | |
| | ౧. నరక | |

శ్లో॥ యే ధర్మా హేతు ప్రభవాః
తేషాం హేతుం తథాగత
ఆహ తేషాం చయో నిరోధః
ఏవం వాదీ మహాశ్రమ (ణ)ః.

"కారణాను సరణము గలిగిన ధర్మములేవియో? వానికి కారణమెయ్యదియో? వానికెయ్యది నిరోధమో? అనువానిని తథాగతుఁడు చెప్పెను. అని చెప్పినవాఁడు మహాశ్రమణుఁడు" అనునర్థముగల పై శ్లోకము బౌద్ధమతమందలి ముఖ్యసారమును తెలుపునదియై యున్నది. ఈ శ్లోకము బౌద్ధవిహారములు ధాతు గోపురములు కొన్నింటిలో రాలపైఁ జెక్కఁబడియున్నది. ఈ హేతు ఘటనము తెలిసినట్టి పటమే బుద్ధుని గొప్పతనమునకు హేతు

వైనది. రూపము మొదలుగ విజ్ఞానము వఱకుఁగల పంచస్కంధ ములును కారణములనుండి యేర్పడిన కార్యములనుటయే బుద్ధుని సిద్ధాంతము హేతుసంఘటితమైన యీ కారణకార్యపరంపర అడ్డులేక జరుగుచున్నంత కాలము నిలుకడ లేకుండుటచేఁ గలుగు దుఃఖములు తొలఁగవు. కారణములనుండిఁ బైనవి యన్నియు నా కారణములు తొలఁగినప్పుడే యవియు తొలఁగుట నైజము కావున నిట్టి వన్నియు నిలుకడ లేనివి. సారము లేనివి. దుఃఖజనకములు.

నిలుకడ లేమియే గొప్పదుఃఖముగా బౌద్ధులు విశ్వసించి యుండుటచే నిలుకడలేని స్థితినుండి తొలఁగుటయే వారి ముఖ్య పురుషార్థమగును. ఇట్లు నిలుకడలేని స్థితినుండి తలఁగి నిలుకడ గల స్థితినందుటయే వారు తెలుపు నిర్వాణమున కర్థమని తెలియు చున్నది. ఈ లోకమున ప్రత్యక్షప్రమాణముచేతను అనుమాన ప్రమాణముచేతను తెలియునవియెల్ల హేతుసంఘటనమునకుఁ జేరినవనియు అస్థిరములనియు వారిచే నిశ్చయింపఁబడినను హేతు సంఘటనమునకు లొంగనిదియు నచంచలమైనదియు నగు దశ యొకటి కలదని వారు గ్రహించినట్లు మనమూహింపవచ్చును. ఈ దశకు సుస్థిరత్వమును దుఃఖమంటమియు లక్షణము. ఇంతకంటె వేఱేమియుఁ జెప్ప వలనుకాదు. ఈ దశను పొందుటకు ప్రత్య క్షముచేతను అనుమానముచేతను గ్రహింపరాని ఆత్మ, బ్రహ్మము అను వస్తువుల జ్ఞానమావశ్యకము కాదని నడవడిని దిద్దుకొనుట వలననే పైఁజెప్పిన దుఃఖములేని నిశ్చలావస్థను ఎల్లరు పొంద

నగునని నిశ్చయించి బుద్ధుఁడు తన ధర్మచక్రము నడపె. చంచల స్థితిలో నుండుటయే దుఃఖమగుటవలనను నిలుకడలేని వస్తువు లన్నియు కారణముల నుండియైన కార్యములుగా నుండుటవలనను కారణము నశింపఁజేసినఁ గార్యముకు పోవుటచేతను అస్థిరత్వ మును దృఢపఱచునది యగు కారణమే దుఃఖమునకుఁ గారణ మగును. ఆ యస్థిరత్వమును తొలఁచుటకు వలయు కారణమే దుఃఖనాశమునకు వలయు కారణమగును. కాఁబట్టి బౌద్ధుల పరమపురుషార్థమును పొందుటకు ప్రత్యక్షానుమానములచేఁ దెలియఁదగిన హేతుఘటన జ్ఞానమును దానికిఁదగిన మంచి నడ వడియే చాలును.

సుఃఖములు దుఃఖకారణములు ప్రత్యక్షానుమానములచే నెఱుంగఁ దగినవిగా నుండుటచే నవి వ్యావహారిక దశకుఁజేరి నవిగా నున్నవి. కావున పారమార్థిక విషయవిచారము ప్రవృత్తి నుండి నివృత్తిపొందుటకు వలసినది కాదు. హేతుఘటనము మూలప్రకృతియగు ఆదికారణమును తెలుప నేర్పడినది కాదు. వ్యావహారికమైన సంస్కార పరంపరా జననమును నాశమునే తెలుపుచున్నది.

సాధారణముగా నొకఁడొక వస్తువును తన యింద్రియ ములచేఁ దెలిసికొన యత్నించునపుడు మొదట నేర్పడునది వస్తు వులకును వాని యింద్రియములకును గలుగు సంబంధము. ఈ

సంబంధమును స్పర్శమందురు. ఈ స్పర్శము కలిగినవెంటనే సుఖదుఃఖరూపమైన యనుభవము సహజముగనే యేర్పడుచున్నది. ఈ యనుభవమునే వేదనయందురు. ఈ యనుభవము పడసిన పిదప సుఖమును పొందవలయు ననియు దుఃఖము నీగవలయు ననియు నేర్పడు తలంపు స్వభావముగనే కలుగుచున్నది. ఈ తలంపు తృష్ణ (వేడ్క) యనఁబడును. దీనిఫలము పట్టు (బంధము). దీనిని ఉపాదానమందురు. త్రోవకాని త్రోవలోఁ జరింపఁ బ్రోత్సహించునది యిదియే. ఈయుపాదానమే యంతము లేని జన్మపరంపరకుఁ గారణమైన భవమును గలిగించును. ఇట్టి తీరుగల మఱుజన్మములేదేని భవము ప్రోత్సాహముచేఁ జేయఁబడు పనుల ఫలమగు పుణ్యపాపములు స్వభావసిద్ధముగా ననుభవింప వీలులేకపోవును. పుణ్యపాపఫలములు నిలుకడలేని వగుటచేతను సారములేని వగుటచేతను దుఃఖమునే యొసఁగును. లోకవస్తువుల మీఁదికి నింద్రియములఁ బ్రయోగించుటచే పైని చెప్పినతీరున దుఃఖములు గలుగుచున్న వనుటలో నేరికిని సందేహములేదు. ఈ యింద్రియములు దుఃఖము నొసఁగుటకే యేర్పడుచుండుటకు కారణమేమని యించుక విచారింతము.

బౌద్ధులు పంచేంద్రియములను మనస్సును చేర్చి ఆఱింద్రియములు (షడాయతనము) గా నంగీకరించియున్నారు. ఈ యాఱును వెలుపలఁగల రూపజ్ఞానమును లోనఁగల నామజ్ఞానము నొసఁగుటకుఁ దగిన స్వభావముతోఁ గూడిన వగును.

ఈ యింద్రియములకు అంతర్బహిర్జ్ఞానము నొసఁగుటకు మూలమైనది విజ్ఞానము. వేదాంతగ్రంథములందు నిట్లే బహిర్వస్తువుల కంటెను ఇంద్రియములు గొప్పవనియు, నింద్రియముల కంటె మనసు గొప్పదనియు, మనస్సుకంటె బుద్ధి గొప్పదనియు, బుద్ధి కంటెను ఆత్మ గొప్పదనియుఁ జెప్పఁబడియున్నది. వేదాంతులు బుద్ధి యనుదానినే బౌద్ధులు నామరూపములని చెప్పుచున్నట్లు తెలియుచున్నది. ఈ నామరూపములు విజ్ఞాన సంస్కార సంజ్ఞా స్కంధములకు సంబంధము గలదని బౌద్ధ గ్రంథములచే విశదమగుచున్నది. అయినను బౌద్ధుల విజ్ఞానము వేదాంతుల యాత్మతత్త్వమునకు సమానమైనదికాదు. ఆత్మకు అనాదిత్వమును నిత్యత్వమును లక్షణముగాఁ జెప్పుచున్నారు. విజ్ఞానమున కీ రెండును లేవు. దీర్ఘనికాయమను బౌద్ధగ్రంథమున నొకచో బుద్ధుఁడు పృథివి అప్పు తేజస్సు వాయువు ఆకాశము విజ్ఞానమను నాఱుభూతములున్నవని చెప్పినట్లు తెలియుచున్నది. కాన బౌద్ధులు విజ్ఞానమునుకూడ నొకభూతముగా గ్రహించినట్లు తలంపవలసియున్నది. ఈ విజ్ఞానము కపిలుని సాంఖ్యదర్శనమునందుగల మహత్తను తత్త్వమునకు సరియైనదిగా నుండవచ్చును. ఇది సంస్కారమునుండియు సంస్కార మవిద్యనుండియుఁ గలిగినవని చెప్పుదురు.

అద్వైత సిద్ధాంతమున మాయను అవిద్యయనియు అజ్ఞానమనియుఁ జెప్పుదురు. ఈ మాయ అవిద్య అజ్ఞానమను

మూఁడుపేరులును ఆ సంప్రదాయమున ప్రకృతిని గుర్తించి చూపు చున్నవి. బుద్ధునకుఁ దరువాత ద్వాదశ నిదానములలో నొకటగు అవిద్యను అద్వైతులు తెలుపుమాయకు సమమని బౌద్ధులు తలంచినట్లు చెప్పవీలున్నది. ప్రజ్ఞాపారమితయను గ్రంథమున బుద్ధునకు శారీపుత్రునకు జరిగిన యీ క్రింది సంభాషణముగలదు.

బు:— శారీపుత్ర! మిక్కిలి మమకారముగలవారై దిద్దఁబడనివారై సామాన్యులై అజ్ఞానులై యున్న మనుజులు తలంచు విధమున పదార్థములకు సుస్థిరత్వము లేదు.

శా:— తండ్రీ! అట్లని వానికి నిలుకడ యెట్లు?

బు:— వత్సా! సత్యముగా అవి లేనివై యున్నవి. వానిని సుస్థిరత్వము లేమి వలననే అవిద్యయందురు. ఈ విషయ మెఱుఁగనివారై సామాన్యులై యజ్ఞానులై యున్న మానవులు దీనియందు మమకారమెక్కువ గలవారై యున్నారు. తమలో నొకదానికేని నిజముగా స్థిరత్వము లేనివస్తువుల నన్నింటిని సత్యమైన స్థిరత్వము కలవానినిగా భావించుచున్నారు.

ఆ ప్రజ్ఞాపారమిత యందే మఱియొకచో రూపము మొదలుగాఁగల స్కంధములైదును ఇంద్రజాల విద్యయందు నేర్పరియగువాఁ డొక చదుకమున తనవిద్యచే గుంపులు గుంపులుగా మనుజులఁ గానిపించి మఱుఁగు పఱుచులాగున నున్నవని బుద్ధుఁడు సుభూతియను శిష్యునకుఁ జెప్పినట్లు చెప్పఁబడియున్నది.

కాని ఇవ్విధమైన యభిప్రాయము పాళీగ్రంథములందు కానరాదు. మధ్యమ నికాయమునకుఁ జేరిన సమ్యగ్దృష్టి సూత్రాంతమను గ్రంథమునఁ జెప్పఁబడినట్లు త్రిపిటకమున అవిద్యంగూర్చి చెప్పిన చోట్లయందెల్లను "మిత్రుఁడా! దుఃఖము నెఱుఁగకుండుటయు దుఃఖోత్పత్తి నెఱుఁగకుండుటయు, దుఃఖనివారణ మెఱుఁగకుండుటయు అవిద్యయందురు" అని చెప్పఁబడియున్నది. కాన బౌద్ధుల చతుస్సత్యముల నెఱుఁగమియే అవిద్యయని రూఢి యగుచున్నది.

ఇట్టి యవిద్యనుండి సంస్కారము పుట్టుచున్నది. సంస్కారమన మనోవాక్కాయములు తమ తమ విధుల నెఱవేర్చుటచే వానికిఁగలుగు పరిపాక విశేషమేయని మున్నే చెప్పఁబడినది. పదార్థ తత్త్వములన్నింటిని సంస్కారఫలములుగా బౌద్ధులు నుడువుచున్నారు. బుద్ధుఁడు నిర్వాణము నొందినతఱి నింద్రుఁడు "సంస్కారములు నిక్కముగా నిలుకడలేనివి. జననమరణములకు లోఁబడినవి. అవి పుట్టినయట్లే నశించును. వాని నడంచుటయే సుఖము" అని చెప్పిన వాక్యములు త్రిపిటకమున నచ్చటచ్చటఁ గలవందురు. ధర్మపథమున సంస్కారమునుగూర్చి, "సంస్కారములన్నియు ననిత్యములై యున్నవి. వీని నెవఁడు బాగుగ నెఱుఁగునో వాఁడు దుఃఖములనుండి మరలును. ఇదియే పరిశుద్ధ మార్గము. ప్రకృతులన్నియు ననాత్మలు. దీని నెవఁడు నిక్కముగ నెఱుఁగునో వాఁడు దుఃఖములనుండి మరలును. ఇదియే పరి

శుద్ధ మార్గము” అని చెప్పఁబడినది. ఇట నాత్మ లేదని చెప్పి
నట్లు భావింప వలనుపడదు. సంస్కారములును ప్రకృతులు
నైన ప్రపంచమందలి యెల్ల వస్తువులు ననిత్యములనియు దుఃఖ
మయములనియు ననాత్మలనియునే చెప్పఁబడియున్నది. చతు
స్సత్యముల నెఱుఁగమియును నవిద్య సంస్కారములను పెంచుట
సహజక్రమమే. ఈ సంస్కార మొకజన్మమునుండి మఱుజన్మ
మునకును బోవును. పూర్వజన్మమునుండి యీ జన్మమునకువచ్చిన
సంస్కారమును జన్మాంతర వాసనయని యెల్లరును చెప్పు
చుందురు. ఇట్టి జన్మాంతరవాసన యొక్కొకనికిని ఈ జన్మమున
వాఁడు పడయఁదగిన జ్ఞానాజ్ఞానములకుఁ గారణమై యుండును.
అది పూర్వజన్మ సంస్కారము చెడ్డదై యుండినచో నీ జన్మమునం
దవిద్యను కలిగించును. మంచిదై యుండిన అవిద్యను నాశిల్లఁ
జేయును. మఱియు పూర్వజన్మమందలి యవిద్య మఱుజన్మ
మందు అవిద్యను గలిగింపఁజాలిన సంస్కారములకు ఈ జన్మ
మందే కారణముగా నున్నదనుట సులభముగాఁ దెలిసికొన
వచ్చును. ఒకేజన్మమున నవిద్య సంస్కారమును గలిగించు
చున్నది. ఒకజన్మమునుండి వేఱొక జన్మమునకుఁ బోవుతఱి
పూర్వజన్మ సంస్కారము తరువాతి జన్మమున నవిద్యను గలి
గించుచున్నది. కావున అవిద్య సంస్కారమునకుఁ గారణమనియు
సంస్కారమున కవిద్య కారణమనియుఁ దెలియవలయు. ప్రతి
జన్మమందు నిట్టి సంస్కారము లేక నశించునేని విజ్ఞానమును

దానిఫలములును కలుగనేరవు. వీనిం బరికించి దుఃఖోత్పత్తి దుఃఖనివారణములను సత్యములను స్పష్టముగా నెఱుఁగవచ్చును. (పైఁజెప్పఁబడిన ద్వాదశ నిదానముల లక్షణములు మణిమేఖల 30-వ ప్రక. చూడుఁడు.)

## దుఃఖనివారణ మార్గము

బుద్ధుఁడు కాశియందు మొదటి శిష్యులైన యైదుగురు సన్న్యాసులకు చతుస్సత్యముల నుపదేశించినతఱి దుఃఖనివారణ మార్గములగూర్చి యిట్లనియె:—

"దుఃఖ వినాశమునకుఁ దగిన మార్గమగు పరిశుద్ధ సత్యమిదియే. ఇదియే యష్టాంగమార్గ మనఁబడుచున్నది."

ఈ యష్టాంగ మార్గముతోఁ గూడినది పరిశుద్ధజీవిత మనఁబడును. విచారించిచూడ నీ పరిశుద్ధమార్గ మవలంబించిన వారికి మూఁడు ముఖ్యగుణములు వలయునందురు. అవి శీలము సమాధి ప్రజ్ఞ యనఁబడును. శీలమన విడువఁదగినవానిని పూర్తిగా వీడి విధింపఁబడినవాని నాచరించుట. సమాధియన మనస్సు నేకముఖము కావించుట. ప్రజ్ఞయన సత్యజ్ఞానము. ఇవి సన్మార్గుని జీవయాత్రలోని విడుదులని చెప్పఁబడును. యాత్రా పూర్తి నిర్వాణము.

"శీలముతోడఁ గూడిన సమాధి ఫలము నిచ్చునదిగ మిక్కిలి మంగళము నొసఁగునదిగ నున్నది. సమాధితోఁగూడిన

ప్రజ్ఞయు నట్లే ఫలమునిచ్చునదిగ మిక్కిలి మంగళము నొసఁగు నదిగ నున్నది. ప్రజ్ఞతోఁ గూడినపుడాత్మ, ఆశయను కృశత్వము నుండియు జన్మమను కార్శ్యమునుండియు దోసములను బక్కఁదనము నుండియు నవిద్యయను బడుగుఁదనము నుండియు నన్ని వగ్గుఁదనములనుండియు పూర్తిగ వెలివడిన దగుచున్నది" అని త్రిపిటకమున నొక్కచోఁ జెప్పఁబడినది.

మఱియొకచోట "ఒకచేయి మఱియొక చేతిచేఁ గడుగఁబడునట్లు శీలము ప్రజ్ఞచే కడుగఁబడుచున్నది. ప్రజ్ఞ శీలముచే శుద్ధిచేయఁబడుచున్నది. ఎచట శీలము కలదో అచట ప్రజ్ఞ కలదు. ఎచట ప్రజ్ఞకలదో అచట శీలముకలదు. శీలవంతుల ప్రజ్ఞయు, ప్రజ్ఞావంతుల శీలమును అన్ని శీలములకంటె, అన్ని ప్రజ్ఞలకంటె గౌరవము గలవని చెప్పఁబడినది. కాబట్టి శీలసమాధి ప్రజ్ఞలచే పూర్వజన్మ సంస్కారములను ఈ జన్మమందలి సంస్కారములను మఱుజన్మమునకు చోటీయకుండులాగునఁ దొలఁగించుకొనవలయు ననుటయే విశుద్ధ మార్గసిద్ధాంతమని తెలియుచున్నది.

శీలము శీలపంచకమనియు శీలాష్టకమనియు శీలదశకమనియు మూఁడు విధములుగనున్నది. అహింస, అస్తేయము, అవ్యభిచారము, సత్యము మద్యనిషేధ మనునవి శీలపంచకము. ఇది గృహస్థులకెల్లరకు వలసినది. ఈ యైదింటితోడ రాత్రులం దశుద్ధాన్నము భుజింపమి, చందనాదిక సుగంధ ద్రవ్యము లుప

యోగింపమి, నేలపై చాఁపపైఁ బరుండుట యను మూఁడుచేరి శీలాష్టకమనఁబడును. ఇవి గృహస్థులలో నిష్ఠాపరులకే తగినవి. ఈ యెనిమిదింటితో గాన నాట్యాదుల నిచ్ఛాసమి, వెండి బంగారు తాఁకమి యనునవి చేరి శీల దశకమనఁబడును. ఇవి సన్యాసులకే తగినవి. ఈ పదింట అవ్యభిచారమునకు మాఱుగ బ్రహ్మచర్యమును ధార్మికసూత్రమను గ్రంథము చెప్పుచున్నది.

ఈ పదింటితోఁ దమ మతమే గొప్పదని తలంచి పరమత దూషణము సేయమి యొక శీలముగాఁ జెప్పఁబడుచున్నది. శీల వంతులలో శ్రేష్ఠులగువారు భార్యలను బిడ్డలను సంపదను ప్రాణమును జన్మమును ఆసక్తిని (ఐదింటిని) వదల వలయును. ఇది పంచత్యాగమనఁబడును. శీలవంతులకు ఆస, మమకారము (బంధము), అవిద్యయను మూఁడు నుండుట దోసమగును. (చూ. మణి. ౩౦-వ ప్ర.) ఈ దోసమునకు ఆస్రవ మనిపేరు.

పైని శీల సమాధి ప్రజ్ఞలకు విరోధులై నిలిచి వానిని వర్ధిల్లనీయకచేయు మనోభావములు పది కలవు. వానిని నాశిలఁ జేయకున్న శీల సమాధి ప్రజ్ఞలు వర్ధిల్లవు. వర్ధిల్లకున్న నిర్వాణము లేదు. ఆ పది మనోభావములకు దశ సంయోజనములని పేరు. సంయోజనమన సంకెల. మమత గలిగించి దుఃఖమయమగు జీవితమునుండి నివృత్తిగలుగనీయక కట్టివై చుటచే నీపేరు సార్థకముగ నుంచఁబడినది. అవి,

౧. సత్కాయ దృష్టి (దేహము సత్యమనుతలంపు)

౨. విచికిత్స (సందేహము.)

3. శీలవ్రతము (ఫలము గోరిచేయఁబడు వ్రతాదికము.)

౪. కామము (శబ్దాది విషయకాంక్ష.)

౫. ప్రతిఘ (కోపము.)

౬. రూపరాగము (మంచిరూపము పొందవచ్చ)

౭. అరూపరాగము (రూపములు పొందక యుండఁదగిన లోకములందు జీవింప నిచ్ఛగించుట.)

౮. మానము (గర్వము.)

౯. ఔద్ధత్యము (తానే గొప్పవాఁడని పొగడుకొనుట.)

౧౦. అజ్ఞానము (అరయమి.)

వీనిని పోఁగొట్టకున్న విశుద్ధ మార్గమునఁ జని నిర్వాణమంద నేరికిని శక్యముకాదు.

ఈ సంయోజనములను నశింపఁజేయఁదగిన ప్రయత్నములతో విశుద్ధిమార్గమునఁ జనువారు నాలుగు తెగ లగుదురు. సత్సంగము, బౌద్ధధర్మ శ్రవణమననములు, సచ్ఛీలము, అనువానిచే సత్కాయదృష్టి, విచికిత్స, శీలవ్రతమను మూఁటిని పోఁగొట్టుకొని పాపము ద్వేషము అశుద్ధి అనునవి లేక తొలఁగించి నాల్గు సత్యములనెఱుఁగ యత్నించుటకు స్రోతాపత్తి యని

పేరు. స్రోతాపత్తియన నదింజేరుట. బుద్ధధర్మమను నదిని పైని చెప్పిన తీరునఁ జేరినవారు స్రోతాపన్నులని చెప్పఁబడుదురు. అట్లు బుద్ధధర్మములఁ జేపట్టి పై మూఁడు సంయోజనములను తొలఁగింప యత్నించి విజయమందినవారు కామ క్రోధ మోహములను పీలైనంతవఱకు తమయెడ లేకుండఁ జేసికొందురు (తగ్గించుకొందురు). అట్లు విజయమందినవారికి సకృదాగాము లనిపేరు. సకృదాగామి యగువాఁడు తరువాత నొకేజన్మము నొందఁ దగియుండును. ఆ మనుజన్మముననే యతఁడు నిర్వాణ మందునని దీని యభిప్రాయము. ఈ మార్గముననే వర్ధిల్లి కామ క్రోధ మోహములను పూర్తిగ వీడి తిమ్ముగూర్చికాని తక్కిన వారిని గూర్చికాని నీచాభిప్రాయములేని స్థితినందినవారికి అనాగాము లనిపేరు. అనాగామి మనుజన్మము నెత్తవలసిన వాఁడుకాఁడు. మఱియు నలవాటుచే వృద్ధినొంది మిగిలిన సంయోజనములఁ బోఁద్రోలి యీ జన్మముందే నిర్వాణమంద నర్హుఁడగును. జ్ఞానదృష్టిచే సత్యము నెఱిఁగి రూపారూపరాగములను మానోద్ధత్యములను అవిద్యను పోఁగొట్టుకొని అన్నిదోషములనుండి విముక్తులై పదార్థములనెల్ల నిశ్చయదృష్టితోఁ గాంచువారై చెడు తలంపొందునులేక పరులయెడ దయయు పరిశుద్ధప్రేమయు గలవారు అర్హతులని చెప్పఁబడుదురు. అర్హాతులన పూజార్హు లని యర్థము. ఇట్లు పరిపూర్ణాభ్యాసము చేసినవాఁడు అద్వై

తులు వచించు జీవన్ముక్తునకు సమునఁడుగా నెన్నఁదగువాఁడు. ఇట్టి స్థితినొందినవాఁడు పరినిర్వాణమును అదుఃఖదశ నందును.

పైఁజెప్పఁబడిన తీరున క్రమక్రమముగఁ బరిపాకమంది నిర్వాణస్థితినొంద యత్నించువారికి సహాయముగా స్మృతులను పేరుగల నాలుగు సతి ప్రస్థానములును నాలుగు సంయక్ప్ర ధానములును పంచబలములును సప్తబోధ్యాంగములును చెప్పఁబడియున్నవి. బుద్ధుఁడు నిర్వాణమొందుటకుఁ బూర్వము చూడాకార పర్వతమున కూడియుండిన తమ శిష్యులగు సంఘము వారి కుపదేశించినట్లు మహాపరినిర్వాణసూత్ర మందిట్లు చెప్పఁ బడినది. "ఓ భిక్షువులారా! ఈ మతము వృద్ధియై జనసంఘమునకు మేలిమిని సుఖమును కలిగింపఁ దగినదై స్థిరముగ నుండుటకును లోకులయెడ కరుణ గలిగించుటకును దేవతలకు మానవులకు లాభమును అభివృద్ధిని కలిగించుటకును నేను తెలిసికొని యుప దేశించుచు వచ్చిన ధర్మమును బాగుగానేర్చి ఆచరించి వ్యాపింపఁ జేయుఁడు. ఆ ధర్మమేదియన నాలుగు సతిప్రస్థానములును నాలుగు సంయక్ప్రధానములును నాలుగు ఋద్ధిపాదములును పంచబలములును సప్తబోధ్యాయములును అష్టాంగమార్గమునై యున్నది.

స్మృతులైన నాలుగు సతిప్రస్థానములు.

౧. దేహ మశుద్ధమని తలఁచుట.

౨. వేదనలనుండి కలుగు చెడుగులఁ దలఁచుట.

3. తలంపుల (కోరికల) యస్థిరత్వమును దలఁచుట.

౪. నిలుకడకు స్వభావమగు స్థితులఁ దలఁచుట.

## నాలుగు సంయక్ప్రధానములు

౧. చెడుగుణములు కలుగనీయక యడ్డగింప యత్నించుట.

౨. కలిగియున్న చెడుగుణములు వీడుటకు యత్నించుట.

3. మునుపులేని సద్గుణముల నలవడ యత్నించుట.

౪. ఉన్న సద్గుణముల వృద్ధిపఱుప యత్నించుట.

## నాలుగు ఋద్ధిపాదములు.

ఇవి అర్హత్వస్థితియగు సిద్ధిని పొందుటకు వలసిన సాధనములు.

౧. ఋద్ధి పొందవలయునను తలంపు.

౨. ఋద్ధిని పొందఁ దగిన ప్రయత్నము.

3. దానికిఁ దగిన హృదయ పరిపాకము.

౪. దానికిఁ దగిన పరిశ్రమము.

## పంచ బలములు

మనస్సునందలి యంగములకుఁ గలశక్తి.

౧. శ్రద్ధ, ౨. సామర్థ్యము, 3. జ్ఞాపకము, ౪. మననము, ౫. ఊహ.

## సప్తబోధ్యాయములు.

నిశ్చయజ్ఞానమును గలిగించుటకు వలసిన సాధనములు ౧. సామర్థ్యము, ౨. జ్ఞాపకము, 3. మననము, ౪. త్రిపిటక పరిశీలనము, ౫. ఆనందము, ౬. శాంతి, ౭. సమదృష్టి.

బంధములఁ దెగఁగోసి సంస్కారములఁ ద్రోసిపీడుట సులభసాధ్యమని బుద్ధుఁడు తలంచియుండలేదనుట పై విషయములఁ బరామర్శించి చూచిన వారికిఁ దెలియక పోదు. కాన నియ్యది కష్టమని సామాన్యులు తలంచుటలోఁ దప్పులేదు.

ఇట్టి కష్టఫలమును పొందుటకు మఱియు రెండు సాధనములు గలవు. అవి అయిదు భావనలు, నాలుగుధ్యానములు.

**అయిదు భావనలు :—** మైత్రీభావన, కరుణాభావన, ముదితభావన, అశుభభావన, ఉపేక్షాభావన.

మైత్రీభావన :— సన్యాసి వసతియగు స్థలమున తగిన యాసనముననుండి 'ఉత్తమప్రాణులెల్ల సంతోషముతో జీవించుఁగాక. అవి దుఃఖము, వ్యాధి, దురాశ లేనివగుఁగాక. ఎల్లమనుజులు దేవతలు నరక పీడితులు సంతోషిత హృదయులగుదురుగాక' యని ధ్యానించుట.

కరుణాభావన :— బీదలు ధనవంతులగుదురు గాక యని భావించుట. ఎల్లప్రాణులయెడఁ గరుణకలిగియుండుట.

ముదితభావన :— భాగ్యవంతుల భాగ్యమెల్లప్పుడు కొఱఁత లేకుండుఁ గాక. ఎల్లవారు తమ తమ సత్కర్మఫలము లొందుదురుగాక యని భావించుట. ముదితమన సంతోషము. అది వస్తుసంపదచేఁ గలుగు సంతోషము కాదు. మైత్రీ కరుణా భావనలకు సంబంధించినది.

పై మూఁడు భావనల నభ్యసించు సన్న్యాసి మొదట కొందఱపై ఆవల వీదివారిపై నాపై నూరివారిపై తరువాత దేశము వారిపై పదపడి ప్రపంచముపైఁ జూపవలయు.

అశుభభావన :— ఆనందములేమి, వెగటుగలిగించునది. దీని నభ్యసించు సన్న్యాసి శరీరము సర్వదోష నిలయమనియు, పేఁడకుప్పలో పుట్టి పెరుగు పురుఁగువలె గర్భకోశమునఁబుట్టి పెరుఁగునది యనియు, మఱిఁగు దొడ్డివలె నశుద్ధముతో నిండి నదనియు రోఁత పుట్టించు వస్తువులే నవద్వారములనుండి వెలు వడుచుండు ననియు, జలదారివలె దుర్వాసన సదా కలది యనియు భావించుట. శరీరకాల పరిమాణ మొకనిమిషమే. అది మెఱుపును నురుగును నీటిలోఁబడిన యుప్పును, తృణమునఁబడిన నిప్పును, కడలియలను, తృణాగ్రముననిలిచిన మంచు బిందువును ఆకసమున సంచరించు జ్వాలను పోలినదనియు నాశము క్షణములో నున్న దనియు భావించుట దీనికి క్షీలక్షణభావన యనియు పేరుకలదు.

ఉపేక్షాభావన :— సమస్తప్రాణుల సమబుద్ధితో భావించుటయు, ఆస వెగటులేకయుండుటయు. ఇది తక్కిన వానికంటె గొప్పది. అర్హతులచే ననుష్ఠింపఁబడునది. ఇది సమచిత్తత్వమనియుఁ జెప్పఁబడును.

## నాలుగుధ్యానములు.

మొదటిధ్యానము :— భిక్షువు కామమునుండి పాపము నుండి తొలఁగి మననముతో పరిశీలనముతోఁ గూడియుండు తఱి ఏకాంతవాసముచేఁ గలుగు ఆనందమయమైన స్థితి.

రెండవధ్యానము :—మననము పరిశీలనము లేక అవి యడఁగింపఁబడియుండు తఱి శాంతినుండి యేర్పడు ఆనందమయస్థితి.

మూఁడవధ్యానము :- భిక్షువు కామక్రోధములను నశింపఁజేసి సంతోషమొంది విజ్ఞానియై అర్హతులు నినుతించునదియు, క్షమ ఎఱుక మున్నగువానితోఁ గూడిన దగు ఆనందము తనలో ననుభవించు స్థితి.

నాల్గవధ్యానము :— పూర్వముండిన సుఖదుఃఖములను వీడి సుఖదుఃఖ నాశముపొంది సుఖమును దుఃఖమును లేక సమదృష్టి యెఱుకగల పరిశుద్ధ స్థితి.

పై ధ్యానములు నాలుగును సమాధికి సాయముగా నుండునవి.

ఇట్లు క్రమారోహణ పద్ధతిగల ధ్యానమున మనస్సు నిలుపుటచే బౌద్ధభిక్షువులు సమాధియను యోగసిద్ధి పొందిరని తెలియుచున్నది. బుద్ధుఁడు బోధివృక్షమూలమున నుండి జ్ఞానోదయమగు పూర్వమొక రేయి ధ్యానమున నుండెననియు, మొదటిజామున మొదటిధ్యానమున పూర్వజన్మస్థితి యెఱుక యయ్యెననియు, రెండవ జాముననుండిన రెండవధ్యానమున వర్తమాన జన్మస్థితి మొత్తము తెలియవచ్చెననియు, మూఁడవ జామున చేసిన మూఁడవధ్యానమున ద్వాదశ నిదాన రూపమైన హేతుఘటనములు తెలియ వచ్చెననియు, నాల్గవ ధ్యానమున సూర్యుఁడుదయించుచుండ సమస్తము తెలియనయ్యెననియు కొన్ని బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి.

మహాపరినిర్వాణ సూత్రమందు ధ్యానము లిట్లు చెప్పఁబడినవి.

"తరువాత భగవానుఁడు ప్రథమధ్యానమును పొందెను. ఆ మొదటి మెట్టెక్కి ద్వితీయధ్యానమునకుఁ బోయెను. ఆ రెండవ మెట్టు దాఁటి తృతీయధ్యానమున కేగెను. ఆ మూఁడవసోపానము దాఁటి తురీయ ధ్యానస్థితి నందెను. ఆ నాల్గవమెట్టు దాఁటి బట్టబయలు కాంతి మట్టుమీఱెనన్నట్టి యెఱుకను లోన సాక్షాత్కరింపఁ జేయు ఆకాశానందాయతన మను ధ్యానమును పడసెను. దానిని దాఁటి విజ్ఞానము మేర కడచెనను ఎఱుకను

లోన సాక్షాత్కరింపఁ జేయు విజ్ఞానానంద్యాయతన మను ధ్యానమును పొందెను. దానిని కడచి సత్యముగా ఏ వెలివస్తువును లేదను ఎఱుకను లోన సాక్షాత్కరింపఁ జేయు అకించన్యాయతన మను ధ్యానమును పడసెను. దానిని కడచి ఎఱుక కలదియు ఎఱుక లేనిదియు కాని దగు అసంజ్ఞాయతన మను ధ్యానమును పొందెను".

మఱియు ననేకవిధములుగాఁ జెప్పఁబడిన ధ్యానలక్షణముల వివరించి చూప శక్యముకాక యున్నది. ఈ ధ్యాన సాహాయ్యముచే యోగసమాధి నొందినవారికి ఆఱువిధములైన అభిజ్ఞలు కలుగుననుట బౌద్ధుల సిద్ధాంతము.

అభిజ్ఞయన మఱచిన విషయము మరల జ్ఞప్తికి వచ్చుట. అవి, ౧. యోగశ్రోత్రము ౨. యోగచక్షువు. ౩. పరచిత్త జ్ఞానము. ౪. జన్మాంతరస్మరణము. ౫. కామ దోష వినాశ జ్ఞానము.

ఋద్ధులన నద్భుతసిద్ధులు. అవి నేలపైవలె నీట నడచుట, నీటఁ జొచ్చుటవలె నేలఁ జొచ్చుట, ఆకాశమున సంచరించుట మున్నగు ఆశ్చర్యకరములగు కార్యములు. (చూ. మణి ౨౪ ప్ర. ౩౦-౫౩ పంక్తులు)

ధ్యానమార్గమున యోగసమాధి నొంద యత్నించుట వదలి యభిజ్ఞలగు నసాధారణశక్తులను పొందుట బౌద్ధుల

ముఖ్యోద్దేశము కాదు. ఇంద్రియములను వెంబడించి మనస్సును పోనీయక యడంచికొని స్పర్శవేదన తృష్ణాబంధములను తెగఁగోయుటయే ముఖ్యోద్దేశమని తెలియుచున్నది. అద్భుతచర్యలు చేయుచున్న శిష్యుని బుద్ధుఁడు మందలించెనని యొకచోఁ గలదు.

శీలసమాధి ప్రజ్ఞలను పొంది యర్హతులైన పిదప అధిక పరిపక్వదశ నొంది బోధిసత్త్వుల స్థితినొందినవారు బుద్ధపదవి నొందుటకు వలసినవి యగు దశపారమితలు బౌద్ధగ్రంథములందు వివరింపఁబడియున్నవి. పారమితయన, ఒడలు అవయవములు అర్థము గలుగునట్లు దానాదులను పూరించుట. రూపొందునట్లు చేయుట. (పారమిత = గట్టు చేరుట)

దశపారమితలు :— దానపారమిత, శీలపారమిత, క్షమాపారమిత, వీర్యపారమిత, ధ్యానపారమిత, ప్రజ్ఞాపారమిత, ఉపాయపారమిత, దయాపారమిత, బలపారమిత, జ్ఞానపారమిత.

ఇవి ఒడలు అవయవము అర్థము అను వానిచే ముప్పది విధము లగును. ఈ పదియుఁ గలుగుటచే బుద్ధునకు దశబలుఁడను పేరు కలిగెను. శీలసమాధి ప్రజ్ఞలు సన్న్యాసులకు మాత్రమే యగును. గృహస్థులగు స్త్రీలకు పురుషులకు (ఉపాసకులకు, ఉపాసికలకు) పంచశీలములు, అష్టశీలములు చెప్పఁబడినవి. పాప కర్మములు పదియందురు. (చూ. మణి-౨౪. ప్ర. ౧౩౧—౧౩౮)

గృహస్థులై యున్న బౌద్ధులు సంఘమున వినయ పిటకము చదువు తఱి నచ్చటికేగి వినవలయుననియు అష్టమి పూర్ణిమా అమావాస్యదినములలో పస్తుండవలయుననియు, సన్యాసులు బయట సంచరింపఁ గూడని ప్రాతిహారక పక్షమని చెప్పఁబడు వర్షాకాలమునందును విధించినవఱ కుపవాసము చేయవలయు ననియు, ఉపవాసమున్న మఱునాటి యుదయమున శక్తికొలఁది మొదట భిక్షుకులకుఁ బెట్టి పదపడి పారణచేయవలయు ననియు బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి.

గృహస్థులకు వలయు నియమము లీ క్రింది విధమున సృగాలవాదసూత్ర మను గ్రంథమునఁ జెప్పఁబడినవి.

౧. తల్లిదండ్రులకును బిడ్డలకును తగిన విధులు

తల్లిదండ్రులు :—

౧. బిడ్డలను చెడు అలవాటులనుండి తొలఁగింపవలయును.
౨. మంచి యలవాటులు వారికి నేర్పవలయును.
౩. వారికి విద్య నేర్పవలయును.
౪. వారికి తగిన దాంపత్యము కుదుర్చవలయును.

బిడ్డలు :—

౧. తమ్ముకాపాడిన తల్లిదండ్రులను తాము కాపాడవలయును.
౨. కుటుంబసంబంధములైన విధులను తప్పక చేయవలయును

3. కుటుంబపు సొత్తును కాపాడవలయును.
౪. కుటుంబ ద్రవ్యమును పొందుటకు తగినవారినిగా తమ్ముఁ దామే చేసికొనవలయును.
౫. తల్లిదండ్రులు మరణించినపిదప వారిని జ్ఞప్తియందుంచి వారికిఁ గావింపవలసిన విధులు నెఱవేర్పవలయును.

## ౨. గురుశిష్యులకు వలసిన విధులు

గురువులు శిష్యులను :—

౧. సన్మార్గమున నడపుట చేతను
౨. జ్ఞానమును చేపీడకుండున ట్లుపదేశించుట వలనను
3. కావ్యశాస్త్ర జ్ఞానము కలిగించుట చేతను
౪. వారింబట్టి వారిమిత్రులకును సహపాఠులకును తన సదభిప్రాయములు వెలివఱచుట వలనను
౫. అపాయమునుండి తప్పించుట వలనను

అభిమానింప వలసిన వారై యున్నారు.

శిష్యులు గురువులను,

౧. సమీపమందే యుండుటవలనను
౨. ఉపచారములు చేయుటవలనను
3. వినయముతో నుండుటవలనను
౪. వలసినవి తెచ్చి యొసఁగుట వలనను

౫. వారి యుపదేశములను శ్రద్ధతో విని యట్లాచరించుట వలనను గౌరవింపవలయును.

### ౩. పతి పత్నుల విధులు.

పతి పత్నిని :—

౧. గౌరవముతో నడపుట వలనను
౨. ప్రేమతో చూచుట వలనను
౩. ఆమెను వీడి అతిచరణము చేయకుండుట వలనను
౪. పరులు గౌరవించునట్లు చేయుట వలనను
౫. తగిన ఆభరణములను వస్త్రములను ఇచ్చుట వలనను ఆమె ప్రేమను చూఱగొనవలయు.

పత్ని భర్తయెడ ప్రేమను గౌరవమును చూపునదయ్యేని,

౧. ఇంటిపనులను శ్రద్ధతో సక్రమముగా నడపుకొను చుండవలయును.
౨. చుట్టములకు స్నేహితులకు మర్యాదతో విందిడవలయును
౩. పతిభక్తి కలిగియుండవలయును.
౪. ఇంటి కర్చులు మితముగా చేయవలయును.
౫. తాను చేయుపనులలో మఱపు లేమియు శ్రద్ధయు చూపవలయు.

౪. మిత్రులు పరస్పర మాచరించుకొనఁదగు విధులు.

శీలవంతుఁడు తన మిత్రులకు :—

౧. మంచి వస్తువు లిచ్చుట వలనను
౨. గౌరవించి భాషించుట వలనను
౩. మేలిమి నభివృద్ధి పఱచుట వలనను
౪. సమాన గౌరవమొసఁగుట వలనను
౫. తన సౌఖ్యమున వారికిని పాలొసఁగుట వలనను
గౌరవము పొందుచున్నాఁడు.

వారు :—

౧. అజాగ్రత్తతోనున్నపుడు హెచ్చరించి కాచుటకు
౨. అతని స్వత్తును కాపాడుటకు
౩. అపాయము కలిగినపుడు అభయమిచ్చి యాదుకొనుటకు
౪. కష్టములు కలిగిన తఱి చేవీడకుండుటకు
౫. అతని కుటుంబము వారిపై ప్రేమ చూపుటకు
తమ స్నేహము వినియోగింప వలయును.

౫. యజమానునకు సేవకులకు వలసిన విధులు

యజమానుఁడు :— సేవకులమేలు గమనించి

౧. వారివారి శక్తికిఁదగిన పనులు విధించుట చేతను
౨. వారివారికిఁదగిన యాహారము కూలి యిచ్చుట చేతను

౩. వ్యాధిగ్రస్తులై రేని ఆహారము మందులిచ్చి యిప్పించి యుపచరించుట చేతను

౪. రోగములు తీఱినపిదప రుచిగల బలకర పదార్థము లిప్పించుట చేతను.

౫. సెలవు దినము లప్పు డప్పు డొసఁగుటచేతను వారి కుటుంబముల నభివృద్ధి చేయవలసిన వాఁడగుచున్నాఁడు.

వారు

౧ వేకువను (సకాలమున) లేచుట వలనను,

౨ యజమానుఁడు నిద్రించిన పిదప తాము నిద్రకుఁ బోవుట వలనను,

౩. ఇచ్చిన దానితో తృప్తిచూపుట వలనను,

౪. ఎట్టి కొఱఁతయు మనస్సున నుంచక కార్యము నుత్సాహముతో చేయుటవలనను,

౫. అతనితోడను తదితరులతోడను గౌరవవాక్యము లాడుట వలనను తమకు యజమాను నెడఁగల భక్తి చూపవలసినవారు.

౬. ఉపాసకులకు భిక్షువులకు వలయు విధులు.

శీలవంతుఁడగు ఉపాసకుఁడు భిక్షువులను :—

౧. మాటలతో ప్రేమ చెల్లించుట వలనను,

౨. కాయముచే ప్రేమ చెల్లించుట వలనను,

3. తలంపుతోడను ప్రేమ చెల్లించుట వలనను,
౪. కాంచిన వెంటనే స్వాగతము పలికి పిలిచి గౌరవించుట వలనను,
౫. వారికి వలయునవి యొసఁగుట వలనను వారి ప్రేమను సంపాదింప వలసినవాఁడు.

వారు:— ఉపాసకుల యెడఁదమకుఁగల ప్రీతిని,

౧. అధర్మము చేయకుండునట్లును ధర్మమే యాచరించునట్లు నుపదేశించుట వలనను,
౨. ప్రేమను చూపుట వలనను,
3. మత సంబంధమైన గ్రంధ విషయములు వినిపించుట వలనను,
౪. వారి సందేహములు తీర్చుట వలనను,
౫. గృహస్థధర్మము లెఱిఁగించుట వలనను వారి గౌరవము పొందవలయును.

పైని యాఱు తెగలవిధుల యందును పట్టుగలవారు శాంతితో ఆనందముతో జీవింపఁ గలరనియు, గృహస్థధర్మములఁ జక్కఁగా నిర్వర్తించి మేలిమి నొందఁగలరనియు మరియాద, దానము, ప్రేమ, స్వార్థరహితబుద్ధి, మున్నగునవి యన్నియు లోకయాత్రచేయు తేరికి కడచీలల వంటివనియు చెప్పి యివ్విషయ మింతటితో ముగించుచున్నారము.

శ్రీరామ.

## 3. బౌద్ధసంఘము.

బౌద్ధ సన్న్యాసుల కూటమునకు బౌద్ధసంఘమనిపేరు. బుద్ధుఁడు, ధర్మము, సంఘమునను మణిత్రయ మందిది మూఁడవది.

జ్ఞానోదయమైన పిదప బుద్ధుఁడు కాశికేగి పూర్వము తనతోఁదపము సేయుచుండిన యైదుగురు సన్న్యాసులకుఁ దా నెఱిఁగిన సత్యచతుష్టయము నుపదేశించి శిష్యులనుగాఁ జేసికొన్న కాలమే యీ సంఘమున కుత్పత్తికాలము. తరువాత ననేకులు శిష్యులై సంఘమునఁజేరి దానిని పెద్దదిగాఁజేసిరి. అందన్ని జాతులవారు నుండిరి. బుద్ధుఁడు దేశసంచారము చేయుకాలమున స్త్రీలు మనబిడ్డలను సన్న్యాసులఁ గావించికొనిపోవ వచ్చిన వాఁడని వాపోవువారఁట! దీనింబట్టి బుద్ధునకు శిష్యులఁ జేర్చుకొనుటలో నెంత పట్టుదలయుండెనో తెలియఁగలదు. ఆ పట్టుదలకు కారణమాతని కరుణయు వైరాగ్యమే. అతఁడు తన ధర్మముల నుపదేశించి వదలుచు సంఘము నియమింపకున్నచో తన మతము శీఘ్రకాలముననే పేరులేక పోయి యుండెడిది.

బౌద్ధసన్న్యాసుల నియమములకును స్మృతులలోఁ జెప్పఁబడిన సన్న్యాసుల నియమములకును పెక్కు విషయములలో నొద్దిక కానవచ్చుటచే బుద్ధుని సంఘము క్రొత్తదికాదని కొందఱు వాకొందురు. స్మృతుల యందలి ధర్మములు సర్వజన సమ్మత

ములుగా నున్నను గొందఱ యధీనమందే యుండుటచేతను సర్వ జనుల కందుబాటులో లేకుండుటవలనను అది పెరుఁగదయ్యె.

మహావీరుఁడు తన జైనమతమును వ్యాపింపఁజేయుచు వచ్చినకాలమున ఆర్యావర్త మందనేక విధములగు సిద్ధాంతములు గల యనేకసంఘము లటనట నుండెనని జైనగ్రంథములఁ గాన వచ్చుచున్నది. గార్హస్థ్యమునుండి వానప్రస్థమునంది యడవులఁ జేరి గృహస్థధర్మములకు లోఁబడక స్వాతంత్ర్యమంది తత్త్వములఁ బరిశీలించుచుండిన మహాత్ముల విజ్ఞానమున కందిన సత్యములే వేదములందలి యారణ్యక భాగమందుగల యుపనిషత్తులం దడంగి యున్నవి. ఇట్లు తత్త్వములఁ బరిశీలించుచుండిన కాలమున ననేకు లనేక విధములైన సిద్ధాంతములుచేసి తమ తమ మతముల వెవ్వేఱుగ స్థాపింపసాగిరని పెక్ర్రండ్ యభిప్రాయము.

ఓల్డన్ బర్గు (Oldenberg) అను నైరోపాదేశస్థుఁడు బుద్ధునిగూర్చి వ్రాసిన గ్రంథమున పూర్వకాల స్థితినిగూర్చి యిట్లు వ్రాక్రుచ్చెను.

"అస్థిరములైన వస్తువులఁగొని మతముతరువాత మతము స్థాపించుచు వచ్చిరి. వానింబట్టి కొన్ని ముఖ్యములైన యంశములు తెలియవచ్చుచున్నవేగాని ఎక్కువగాఁ దెలియరావు. లోక మెల్లపుడు నుండునదా? కాదా? ఆత్మ నిత్యమా? అనిత్యమా? ఒకవిధమున నిలుకడ లేనిదిగను వేఱొకవిధమున నిలు

కడ కలదిగను తోఁచు తత్త్వమును సమంజసముగఁ బలికి సిద్ధాంతీ కరించుటెట్లు? లోకము పరిమితి కలదియా? లేనిదియా? లేక ఏకకాలమున పరిమితి కలదిగాను లేనిదిగాను ఉన్నదా? లేక పరిమితి కలదియు లేనిదియు కానిదా? అను ననేక విషయములం గూర్చిన పరిశోధనము లా కాలమున నడచుచుండినవి. అప్పుడు తర్కశాస్త్రము నాధారముగాఁగొని సంశయ పరిశోధనము చేయుచు వచ్చి 'పుట్టునవెల్ల సత్యములే' 'పుట్టునవన్నియు నశించునవే' అని చెప్పఁబడు ముఖ్య ప్రతిజ్ఞలతోఁగూడిన రెండు తెగల సిద్ధాంతములు బయలుదేఱినవి. ఇట 'పుట్టునవి యెల్ల సత్యములు కా' వను తార్కికుంగాంచి సర్వము సత్యము కాదని చెప్పుచున్న సిద్ధాంతము నీ వాక్యములంబట్టియు సరిపడునా? ఆ నీ సిద్ధాంతమును నశించునదే (సత్యము కానిదే) కదా? యని యడుగుదురు. పరలోక మొండు కలదనియు మరణమునకుఁ దరువాత స్థితి కలదనియు మనుజుని సంకల్పమునకు నిర్బంధమేదియు లేదనియు పుణ్యపాపములకు తగిన ఫలము లభించుననియు నా కాలమున జనములు వాదించుచుండిరి. చెడుమార్గముల నుపదేశించుచువచ్చిన వారిలో మిక్కిలి దుష్టుడని బుద్ధునిచేఁ దలంపఁబడిన, మర్కలి కోశాలుఁడను నతఁడు నోదన (ప్రేరేఁచు) శక్తి యగు సంకల్పమునకు స్వాతంత్ర్యము లేదని చెప్పినట్లు తెలియ వచ్చుచున్నది. మనుజునకు శక్తి లేదు; సామర్థ్యములేదు; అధికారములేదు; ఎల్లవస్తువులు ఎల్లప్రాణులు నగు వానికి శక్తి

సామర్థ్యము లేవియు లేవు. విధిచేతను స్వభావముచేతను ఒక్కొ-క్క-టియు తన గతినొందుటకు త్రోయఁబడుచున్నది. జ్ఞానియు అజ్ఞానియు తుది నొకవిధమగు దుఃఖము ననుభవించుచున్నారు. లోకమునందలి పదార్థములన్నియు దేవునాజ్ఞకు లోఁబడియున్న వనుటకూడ ఖండింపఁబడియుండినది. పురాణకశిపుఁడను నతఁడు, 'ఒకఁడు గంగ దక్షిణ తీరమున దాడిచేసి ప్రాణివధచేసియు చేయించియు, లోకమును పాడుచేసియు చేయించియు, అగ్గి పెట్టియు పెట్టించియు, తాను చెడుగు లాచరించియు దోషము తనపై నారోపించు కొనుటలేదు; దోషమునకు శిక్షయేదియు లేదు. మఱియొకండు గంగ యుత్తరతీరమునఁజని ధర్మదానములు చేయుట వలనను చేయించుట వలనను యాగాదులు చేయుట వలనను చేయించుటవలనను సత్కార్యమొక్క-టియు చేసినవాఁడు కాక పోవుచున్నాఁడు. సత్కా-ర్యమునకు సత్ఫలమేదియు లేదు; అని యుపదేశించుచు వచ్చెననియు "జ్ఞానియు అజ్ఞానియు కళేబరము పడిన వెంటనే నాశమంది శూన్యమగుచున్నారు; చచ్చిన పదపడి వారు లేరు; అను సిద్ధాంతమును ఆ కాలమున నుండిన" వనియుఁ జెప్పఁబడియున్నది.

ఇట్లు పలువురు సిద్ధాంతులు పలుత్రోవలలో పలుమాఱు బుద్ధిఁజొనిపి తత్త్వమును వెదకి కనిపెట్టి సత్యమైన ధర్మమును జనుల కుపదేశింపవలయునను నాసతో గృహస్థ జీవితము వదలి గుంపులు గుంపులుగాఁ గూడి ధర్మవిచారములు సలుపుచుండిన

కాలమున నేర్పడిన బౌద్ధమతము తనకొక యంగముగా సంఘము నేర్పఱచుకొన్నది క్రొత్తయుఁగాదు ; వింతయుఁగాదు.

'హార్మన్ జాకోబి' యను నాంగ్ల విద్వాంసుఁడు జైన సూత్రములఁగూర్చి వ్రాయుచు జైనము బౌద్ధమునకు మును పటిదా? తరువాతిదా? యని విచారించి జైన బౌద్ధములు రెండును ముఖ్యముగా బ్రాహ్మణ సన్న్యాసులనుండి కలిగిన వేయని వెల్లడించియున్నాఁడు. అట్లతఁడు తలంచుటకు జైన బౌద్ధ సంప్రదాయములందును బ్రాహ్మణుల స్మృతి సంప్రదాయ ములందును గల సన్న్యాసధర్మముల నతఁడు పోల్చి చూచి యున్నాఁడు.

బౌద్ధులలో ఉపాసకుల కనుష్ఠేయములైన పంచశీలములు సన్న్యాసుల కనుష్ఠేయములైన దశశీలములు మున్నే చెప్పఁబడి యున్నవి. జైనసన్న్యాసుల ఈ క్రింది శీలములను పోల్చి చూడుఁడు. అహింస, సూనృతము, అస్తేయము, బ్రహ్మచర్యము, అప్రతిగ్రహము అనునవి. బ్రాహ్మణ సన్న్యాసులకుఁగల పంచ ప్రతిజ్ఞ (వ్రతము) లు:— అహింస, సూనృతము, అప్రతి గ్రహము, బ్రహ్మచర్యము, శౌచాద్యము అనునవి (బోధాయనుప ధర్మసూత్రములు). బ్రాహ్మణ సన్న్యాసులకు మఱియు నైదు వ్రతములుకలవు. అవి అక్రోధనము, గురుభక్తి, విమృశ్యకారి త్వము, పరిశుద్ధత, ఆహారశుద్ధి యనునవి.

మఱియు మాక్సుముల్లర్ మున్నగు ఐరోపా విద్వాంసులు పలువురు జైన బౌద్ధ సన్న్యాసులు బ్రాహ్మణ సన్న్యాసుల పద్ధతులను గ్రహించిరని చెప్పుచున్నారు. బ్రాహ్మణుల సన్న్యాస నియమములు ఆశ్రమ విభాగములు కలిగిన కాలము ననే యేర్పడి యుండవలయు. జైన సన్న్యాసులును బౌద్ధ సన్న్యాసులును తమమతము లేర్పడిన ఆదికాలమందే ఆర్యావర్త మందచ్చటచ్చట కొలఁది కొలఁదిమంది యుండినట్లు వారి మత గ్రంథముల వలననే తెలియవచ్చెడిని. ఆకాలమున బ్రాహ్మణ సంప్రదాయము ననుసరించిన సన్న్యాసులు దేశమందంతట వ్యాపించియుండిరి. బ్రాహ్మణ సన్న్యాసుల ధర్మములు కొన్ని యిట వివరింతము.

వారు ధనధాన్యములు నేకరించి యుంచుకొనరాదు. జితేంద్రియులై యుండవలయు. వానకాలమున సంచరింపరాదు. అన్నభిక్షకొఱకు మాత్రమే గ్రామమునందు ప్రవేశింపనగును. అడిగినచోట మరల నడుగక అందఱును సాధారణముగా భుజించు కాలముననుక తరువాత భిక్షకేగి అన్నము కొనవలయును. రుచులపై నాసయుండరాదు. వాగ్వర్తనము చక్షుర్వర్తనము నడంచుకొని యుండవలయు. నగ్నుఁడై యుండరాదనుటకై యేవస్త్రము ధరింపవలయును. ఒకగ్రామమున నొకరేయికంటె నెక్కువకాలము నిలువరాదు. తమకు మేలుచేసినను కీడు చేసినను ఎల్లప్రాణులయెడ నుపేక్షవహించి యుండవలయును. శిఖ

యుంచుకొనవచ్చు లేదా తీసివేయవచ్చు. స్వప్రయోజనమునకై (అది యీ జన్మమునకై నను మఱుజన్మమునకై నను) ఏదియును చేయరాదు. దండము, కమండలువు, భిక్షాపాత్రము, నీరు వడియఁగట్టు వస్త్రము, బావినుండి నీరుతోఁడుకొనుటకు సన్న దారము అనునవే సన్న్యాసు లుంచుకొనఁదగిన వస్తువులు. ఇట్టి నియమములు జైన సన్న్యాసులకును బౌద్ధ సన్న్యాసులకును గలవు. అయినను సన్న్యాసమునకు ముఖ్యమగు తొలిలక్షణము మనస్సు నడఁచుకొనుటయు, ఆసలేమియు ననుట అన్నిమతముల వారును కైకొన్న సిద్ధాంతమే.

## బౌద్ధ సన్న్యాసి లక్షణములు

ధర్మపథమను బౌద్ధగ్రంథమున ఉత్తమ భిక్షు లక్షణము వాని వేషమందును కాషాయమందును లేదనియు వైరాగ్య మందును శాంతియందును శుచియందును కలదనియు అనేక విధములుగాఁ జెప్పఁబడియున్నది.

"తనవాక్కును నియమసహితముగా నుంచుకొని క్రోధ రహితుఁడై వివేకముతో సంభాషించి యిరుజన్మముల తెఱఁ గెఱిఁగి యెవఁడు వర్తించునో వాని యుపదేశము మధురమై యుండును. ప్రేమయే ప్రాణముగా ధర్మమే యానందముగాఁ గల భిక్షువు శాంతిస్థితినొంది సంస్కారములకెల్ల తుదినొసఁగు నిర్వాణానందము నొందును. స్కంధముల యుత్పత్తిని నాశమును

తెలిసికొన్న వెంటనే జ్ఞానులకు అమృతరూపమైన నిర్వాణా నందము కలుగును. దయయే వానికి జీవనోపాయముగా నుండ వలయును. అవక్రమగు విశుద్ధిమార్గమే యతని ప్రవర్తనమై యుండవలయు. ఇట్లున్నచో పరిపూర్ణానందమును పొంది దుఃఖ ముల నాశిల్లఁజేయును. వార్షికీయను తీఁగ (ఒక తెగమల్లె) వాడిన పూవులను రాలుచు తీరున భిక్షువులారా! మీరు కామ మును చెడుతలంపులను మొదలంట వీడుఁడు. సర్వజ్ఞుఁడగు బుద్ధునిచే నుపదేశింపఁబడిన ధర్మము నెఱిఁగినవాఁడు, వేలిమి యగ్గి నెల్లపుడు పాటు (డారాధించునట్లు తాను తన ధర్మము నారాధింపవల్లయును. బ్రాహ్మణునకు కష్టములు కలిగింపరాదు. తాము తన్నకీడుమ గలిగింప వచ్చినవానిని కొట్టుటకు పోరాదు. బ్రాహ్మణుని కొట్టువానికి చేటు పాటిల్లును. తన్ను కొట్టినవానిని ఎదిరించి కొట్టువానికి మఱియు నెక్కువగా కీడుమూఁడును. అవి వేకీ! వెంట్రుకలను జడలుగా చుట్టుకొన్నందుచేఁ గలుగు ఫల మేమి? తోలు చుట్టుటచే ఫలమేమి? నీ దురాశలన్నియు నీ హృదయమున నున్నవి. నీవు బయటమాత్రమే శుద్ధి చేసికొను చున్నావు." అని యీ తీరున నా గ్రంథము సన్న్యాసులకు మనః పరిశుద్ధియే ముఖ్యకార్యమని యటనటఁ దెలుపుచున్నది. భిక్షు వుల ధర్మములు ధార్మికసూత్ర మందిట్లు చెప్పఁబడినవి.

"భిక్షువులారా! వినుఁడు. పాపములఁ బాఱఁదోలు ధర్మములను మీ కుపదేశించుచున్నాఁడ. వానిని హృదయము

లందు దృఢముగ నిలుపుకొనుఁడు. మేలొంద విచారించు జ్ఞాని సంఘము వారికిఁ దగిన నయపద్ధతి (హ్రీయాపథము) చేపట్టి వర్తింపవలయు. పగట నకాలమున నన్నభిక్షకై గ్రామమునకుఁ బోరాదు. రాత్రులందును పోవరాదు. అకాలమందు భిక్షకేగుట వలన చెడుగు గలుగునని తెలిసి వివేకులట్లు చేయరు. ఇంద్రియ విషయములు ప్రాణులకు విభ్రాంతిని (మోహమును) కలుగఁ జేయుచుండును. వానిపై నేగు నాసను మొదలంటఁ గోసి వేయుఁడు. భిక్షువు తన మధ్యాహ్న భోజనమును తగిన కాల మందు చేయఁదగును. తగిన కాలమునఁ దనయన్నముగొని యొంటరియై మరలివచ్చి యేకాంతముగనుండి ధ్యానముచేయు చుండవలయును. తన చిత్తమును విచ్చలవిడి పోవనీయరాదు. దానిని బాగుగ నడంచి యుంచుకొనవలయును. అతఁడు ఉపాస కులతోఁగాని భిక్షువులతోఁగాని సంభాషించునపుడు బౌద్ధధర్మ గౌరవమును గూర్చియే మాటాడవలయును. పరులఁగూర్చి నిందావాక్యములు చాడీలు చెప్పరాదు. భిక్షువులతోఁ గొందఱు వాదముసేయుటకు వలసిన శక్తిని సంపాదింప యత్నించుచున్నారు. వారిమనసు సంకుచితమైనది. వారిని నేను గౌరవించుటలేదు. అట్లు చేయువారిని పెక్కుత్రోవలలో చెడుగుసందు తగులు గలుగును. వారికి వాదమునం దుత్సాహమున్నపుడు వారు వాస్తవముగ తమ మనస్సును చాలదూరము పోవనిత్తురు. బౌద్ధ భిక్షువు ఆహా రము ఆసనము పడక ఉడుపుల శుద్ధిచేయుటకు వలసిననీరు మున్నగు

వానిని గొనునప్పుడు తన నియమము లందొక్కటేనియు వదల రాదు. వానియందు మిక్కిలి పట్టుదలయు తీవరమును చూప రాదు. తామరాకుమీఁది జలబిందువువలె సంబంధములేనివాఁడై యుండవలయు."

## గురుశిష్య సంబంధము

బుద్ధునకు అతని శిష్యులకుఁగల సంబంధ మీ దేశమున నంతకు పూర్వమునుండి పరంపరగావచ్చుచున్న గురుశిష్య సంబంధమును పోలినదే. మొదట శిష్యులను చేర్చుకొనునపుడు 'భిక్షూ! ఇటురమ్ము. నీకు ధర్మ ముపదేశించెద. బ్రహ్మచర్యానుష్ఠానము చేయుచు నీదుఃఖముల నాశము కావింపుము', అని వారికిఁ జెప్పినట్లు చెప్పఁబడియున్నది. దీనిచే హిందూధర్మశాస్త్రమునందున్నట్లు బౌద్ధులకును నాలు గాశ్రమములున్నయట్లు తలంప వీలులేదు. బ్రహ్మచర్యమునుండి గార్హస్థ్యమునకు గార్హస్థ్యమునుండి వానప్రస్థమునకు వానప్రస్థమునుండి సన్న్యాసమునకు క్రమమున నేగు నాచారము బౌద్ధులచే నాశముచేయఁబడినదని కొందఱ తలంపు. దీనివలనను అన్ని జాతులవారికిని సన్న్యాసమునొంద నర్హతగలదని సమ్మతించి యట్లు కావించుట వలనను స్మృతి సంప్రదాయము ననుష్ఠించు వైదికులకును బౌద్ధులకును పొత్తు కుదురలేదని చెప్పుదురు.

పైఁదెలిపిన బ్రహ్మచర్యమునకు కామములేక ఆహార

విహార నియమములకు లోఁబడియుండుటయే యర్థమని యెఱుఁగ వలయు. ఆరంభకాలమున నిష్టమున్న వారెల్లరు చేరవచ్చు నను నియమముండినది. రాను రాను మఱికొన్ని నియమములు విధింపఁబడినవి. సంఘమునఁజేర నిష్టమున్నవాఁడు తనకు అంటు వ్యాధి యేదియు లేదనియు, క్షయరోగము లేదనియు మూర్ఛారోగములేదనియు తానెవ్వరికిని బానిసకాననియు ఋణగ్రస్తుఁడఁ గాననియుఁ సైనికోద్యోగి కాననియు, తాను సన్న్యాసియగుటకు తల్లిదండ్రుల సమ్మతికలదనియుఁ దెలుపవలయును. ఇవన్నియు తరువాతి కాలమున నేర్పడిన విధులే. తొలుత నొకఁడు తలబోడి చేయించుకొని కావి వలువగట్టి యొంటరియై యుండెనేని వానికి భిక్షుత్వమబ్బెనని తలంచుచుండిరి. తరువాత సంఘప్రవేశమునకు వలసిన మంచి నియమము లేర్పడినవి.

## సంఘమునఁ జేరుటకు వలయు నియమములు

సంఘప్రవేశమునకు రెండు త్రోవలుకలవు. ఒకటి యిరువదేండ్లకు పైఁబడినవారు తమంత వచ్చి సన్న్యాసము గైకొని సంఘమునఁ జేరవచ్చుననుట. రెండవది ఎనిమిదినుండి యిరువది యేండ్లవఱకుఁగల ప్రాయమువారు తరువాత సన్న్యసించుటకు వలయు సాధనములనొంద యత్నించుచు సంఘ సంబంధము గలిగి యుండవచ్చుననుట.

సన్న్యాసమిచ్చు పద్ధతిలో రెండు తరగతులు కలవు. మొదటి తరగతికి ప్రవ్రజ్యయనియు రెండవతరగతికి ఉపసంపద యనియు పేరులు. ప్రవ్రజ్యయన ప్రాతస్థితి వదలుట. ఉప సంపదయన భిక్షుకుల నిష్ఠను చేపట్టి సంఘమందొకఁడగుట ప్రవ్రజ్యను పొంది ఉపసంపదను పొందని సన్న్యాసి బయటివారికి సంఘము వాఁడుగాఁ గానఁబడినను సంఘమందతనికి క్రింది తర గతి గౌరవమే. కొందఱకు ప్రవ్రజ్యా సంస్కారము ఉపసంపత్సం స్కారము నొకేసారి చేయఁబడును. సాధారణముగా ప్రవ్రజ్యా సంస్కారమునొందిన కొంతకాలమునకుఁ బిమ్మటనే ఉపసంపత్సం స్కారమీయఁబడును. ప్రవ్రజ్యను పొందఁగోరినవాఁడు సంఘము వారి యెదుటికేఁ జనియైనను ముదుసలియగు బౌద్ధసన్న్యాసి కడ నైనను ఆ సంస్కారమును పొందవచ్చును. ఆ సంస్కారమున కధికముగా చేయవలసిన విధులులేవు. సంస్కారమొందువాఁడు కావివలువగట్టి తలయు మొగము మొత్తము గొఱిగించుకొని తనకు సంస్కారముచేయు సన్న్యాసికడ మూఁడుసారులు భక్తితో వినయముతో 'బుద్ధం శరణం గచ్ఛామి' 'ధర్మం శరణం గచ్ఛామి' 'సంఘం శరణం గచ్ఛామి' యని చెప్పవలయు. చెప్పినపిదప బౌద్ధసన్న్యాసుల కర్తవ్యములైన దశశీలములను తా ననుష్ఠించునట్లు సంకల్పించుకొనవలయును.

ఉపసంపదను పొందునపుడు సంఘమువారి యెదుటికేఁ జని నమస్కరించి శిరముపైఁ గేలుమోడ్చి సంఘముంగాంచి

యీ క్రింది వాక్యములు పలుకవలయును. "పూజ్యులారా! నాకు సన్న్యసన మిప్పింపుఁడని సంఘమువారిని వేఁడుచున్నాను. సంఘమువారు నన్ను తమలో నొకనిగాఁ జేసికొనుఁడని వేఁడుచున్నాఁడను. సంఘమువారు నాపై దయగలవారుగ నుండవలయునని ప్రార్థించుచున్నాను. పూజ్యులారా! మీరు నాకు సన్న్యసన మిప్పింపవలయునని యిట్లే ముమ్మాఱు వేఁడుచుంటి. సంఘమువారు నా పలుకులు గౌరవించి నన్ను తమలో నొకనిగాఁ జేసికొనుఁడని వేఁడుచుంటి. నాపై కరుణ గలవారుగా నుండ వేఁడుచుంటి" అని యతఁడు చెప్పినపిమ్మట కొన్ని ప్రశ్నలడిగి యతనిని పరిశోధించి సంఘమునఁజేర నర్హుఁడని తెలిసికొందురు.

ఆప్రశ్నలివి:— (వచ్చిన వానిని పేరుపెట్టిపిలిచి) నేను చెప్పునది చెవియొగ్గి వినుచున్నావా? సత్యముగాను వంచనము లేకయు మాటాడ నికిదే సమయము. నీస్థితులెట్లున్నవో వానిం గూర్చియే యడుగుచున్నాను. నీ వున్నదియున్నట్లుగనే చెప్పవలయును. లేనిది లేదనియే చెప్పవలయును. నీకు కుష్ఠువు, తెల్లకుష్ఠువు, కంఠమాల, క్షయ, మూర్ఛయను వానిలో నొకటియు లేదా? నీవు వంచనవేషము వేయని నిక్కపు మనుజుఁడవా? నీవు పురుషుఁడవా? నీవెవరికేని బానిసవైయుంటివా? నీవు చెల్లింపవలసిన ఋణమేదియులేదా? నీవు రాజసేవకుఁడవా? సన్న్యసము పొందుటకొఱకు నీతల్లిదండ్రులయాజ్ఞ నొందితివా?

నీ కిఱువదియేండ్లు నిండినవా? నీకు వలసిన కాషాయవస్త్రములును భిక్షాపాత్రమును కలవా? నీపేరేది? నీగురునిపేరెయ్యది? అని సంఘమువారిలో నొకఁడు లేచి యడుగును. ఇందు కడపటి ప్రశ్నమున ప్రవ్రజ్యపొందినవాఁడు ఉపసంపద నొందు పూర్వము సంఘమువారిలో నొకని గురువుగాఁగొని యతనికడ బౌద్ధాచార సంప్రదాయములను ధర్మములను ఎఱుఁగవలయునని తెలియుచున్నది. ఈ ప్రశ్నము లడిగిన పరిశోధకుఁడు తన ప్రశ్నముల కన్నింటికిఁ దగు సమాధానములువచ్చిన వెంటనే సంఘమువారిఁగాంచి యిట్లు చెప్పును.

"పూజ్యులారా? నేఁజెప్పునది సంఘమువారు వినఁగోరుచున్నాను. (గురుశిష్యుల పేరులు చెప్పి) వీరి శిష్యుఁడగు నితఁడు సన్న్యాసముఁగొని సంఘమునఁజేరఁ గోరుచున్నాఁడు. ఇతఁడు సంఘమునఁ జేరుటకు విరోధములగు నడ్డంకు లేవియు లేవు. భిక్షాపాత్రమును కావిబట్టలను తెచ్చుకొనియున్నాఁడు. ఇతఁడు ( ) వారి శిష్యుఁడయియుండి భిక్షువై సంఘమునఁ జేరవచ్చునని సంఘమువా రాజ్ఞాపింపఁదలంచుచున్నారు. ఈ సంఘమునందలి పెద్దలలో నితని ( ) శిష్యుఁడయియుండి సంఘమునఁ జేరవచ్చునని తలంచినవారు మౌనమువహించి యుండవలయును. అట్లు తలంపనివారు తమయుద్దేశముల వెలిపఱుపవలయును" అని యిట్లు ముమ్మాఱు చెప్పిన తరువాత

నొక్కరును మాటాడకుండిరేని ఆ పరిశోధకుఁడు సంఘాధ్యక్షుఁడగు స్థవిరుని గాంచి నమస్కరించి (గురుశిష్యుల పేరులుచెప్పి) "ఇతఁ డతని శిష్యుఁడై యుండి సంఘమునఁ జేరుటకు నియమనము పొందెను. సంఘమువారును సమ్మతించిరి. కావుననే మౌనము వహించియున్నారని తలంచుచున్నాను" అని చెప్పిన పదపడి యా శిష్యుఁడా సంఘమున నొకఁడగుచున్నాఁడు.

భిక్షమెత్తి పడసిన యన్నమే యతనికిఁ దగినదనియు, పరులు పాఱవైచిన పేలికలు చేర్చికుట్టిన బొంతయే యతనికి ధరింపఁదగిన యుడుపనియు, అడవియందలి చెట్టుక్రింది చోటే నివసింపఁదగిన వసతియనియు గోమూత్రమే తగిన మందనియు, ఉపాసకులు మంచి యుడుపు అన్నము చోటు మందు నొసఁగిరేని యంగీకరింపవచ్చునని యున్నను పైఁజెప్పిన విధమున నుండుట యుత్తమపద్ధతియనియుఁ జెప్పుదురు. తరువాతను అకామము అస్తేయము అహింస యను నియమములనుండి భ్రష్టుఁడైనను యోగముచే లభించు బుద్ధిశక్తులు తనకున్నవని గౌరవముగాఁ జెప్పికొన్నను సంఘమునుండి బహిష్కరించుటకు అవకాశము గలదనియుఁ జెప్పుదురు. ఇట్లు సంఘమునఁ జేరి సతఁడు గురుని తోడనేయుండి ధర్మము శీలము నెఱిఁగి తండ్రికడ బిడ్డవలె నడచుకొనవలయును. ఇట్లు సన్యాసియైనవాని కా నియమముల నడపశక్తి లేకున్నచో వాఁడందుండి మరలి గార్హస్థ్యమునకు రావచ్చును.

## భిక్షువులకుఁదగిన ఆహారనియమములు

సూర్యోదయమైనపిదప మధ్యాహ్నమునకు లోపల అన్న రూపమైన ఆహారమును భుజింపవచ్చును ఆయాహారమింటింటి కేగి బిచ్చమెత్తి కూడఁబెట్టవలయును. ఇంటివాకిటి కేగి మౌనముతో భిక్షాపాత్రముగొని నిలువవలయును. (చూ. మణి. ౧౬-వ ప్రక. ౧౩౬ — ౧౪౦) పెట్టినఁ గైకొనవలయు. పెట్టకున్న నావలి యింటి కేగవలయును. వీరియింటి కేగవలయునను నుద్దేశముతోఁ బోవరాదు. తనకొక వేళకు తగినంత దొరకిన పిమ్మట భిక్షకై కొనరాదు. బిచ్చమెత్తిన[1] యన్నము భుజించుటకుమున్న గశుభ భావనచేయుచుండి తరువాతఁ దాను తిరియకుండుటకుఁ దగినయంత భుజింపవలయు. ధనవంతులగు నుపాసకులు తాముగా భిక్షుకుఁ బిలిచినచోఁ బోయి భుజింపవచ్చును. భుజింపరాదను నిర్బంధములేదు పోవుచో ఒకవేళ పగటిపూఁట భోజనమునకే పోవచ్చును. ఉపాసకులు విశేషించి పూర్ణిమలయందు పిలుచుట వాడుక. తామున్నచోటికి ఉపాసకులువచ్చి అన్నము తెచ్చి పెట్టినచో భుజించు వాడుకయుఁగలదు. కొందఱు భిక్షుకులు ఆహారవిషయమునఁ గొన్ని కఠిన నియమము లనుష్ఠిం

1. తలగొఱుగుట, కనుబొమలు గొఱుగుట, అత్యుష్ణమతిభార మతి దుర్గంధమగు చీవరము దాల్చుట సర్వమశుచియని భావించి భుజించుట, కామసంతాపము, ప్రొద్దెక్కఁబో భుజించుట. మొ. చేయవలయు నీలకేశి గ్రంథము.

చుట కలదు. మాంసము తినుటలేదనియు బిచ్చమెత్తినది తక్క వేఱేదియు భుజించుట లేదనియు భిక్షాపాత్రమున దొరకినది పాఱ వేయుట లేదనియు నీ మొదలగు కొన్ని నియమములు కొంద ఱుంచుకొనియుండిరని తెలియుచున్నది. భిక్షు కేళ్ళుతఱి నూరి వారు భుజించియైన విషయము పీఁటెనంతవఱ కెత్తేగి యూపైఁ జనవలయు. తమ యాహారము సన్న్యాసుల కొఱఁగి యుపాస కులు వస్తుండునట్లు ముందుగా పోరాదు.

భిక్షాపాత్రము [1] మూఁడువస్త్రములు, గోచి, కట్టు సూది, క్షురిక, వడపోఁత గుడ్డ, అను యెనిమిది భిక్షుకులయొద్ద నుండఁదగినవి. ఇవిగాక తమదని యొకటేదియు నుంచుకొన రాదు. ఏదేనొకటి యుంచుకొన్నచో నిర్వాణమందుటకు గొప్ప యడ్డుపాటని వారి యుద్దేశము. పక్షులు తామెగిరి పోవుచోట్లకు ఱెక్కలు తక్క వేఱెద్దియుఁ దోడఁగొంపోవుటలేని యట్లు భిక్షుకులు కాషాయము తక్క వేఱొండు చేకొని పోరాదని బౌద్ధగ్రంథములు తెలుపుచున్నవి. వెండి బంగారములను వారు తాఁకనేరాదని విధి.

ఉపాసకులలో నెవరేని భిక్షుకులకు ధనము నీయ నిచ్ఛ గించిరేని ధనముగా నీయక వారికిఁదగిన వస్త్రములు మున్నగు వస్తువులమూలమున నీయఁదగియుండురు. ఒకభిక్షువు ధనము

1. మూఁడు వస్త్రములు :— అంతరవాసకము, ఉత్తరాసంగము, సంఘాటి

గొన్నాఁడని తెలిసెనేని సంఘమువారు విచారించి [1] దోషమేర్పడి నచో ఆధనము సమీపమందున్న ఉపాసకున కిప్పించుటయు, ఆ ధనమును గైకొనుట కుపాసకుఁడు సమ్మతింపకున్నచో అతనిచే నైనను వేఱుపాసకునిచేనైనను పాఱవేయించుటయు, అట్లు పాఱవేయ నే యుపాసకులు నొప్పరేని సంఘము వారొక భిక్షు వున కాజ్ఞాపించి పాఱవేయించుటయు, అట్లు పాఱవైచిన స్థలము నెవ్వరికిని చెప్పరాదనియు నియమము.

వస్త్రము :—బౌద్ధ భిక్షువు లెల్లవేళల వస్త్రములేక యుండ రాదనియు, దిగంబరులైయున్న వ్రతభంగము కలుగుననియుఁ జెప్పుదురు. సాధారణజనులు మేను మొత్తము మూసికొనని దేశములందుకూడ భిక్షువులు వస్త్రముచే నొడలెల్ల మూసికొని యుండవలయునని నియమము. ఈ నియమము జైనుల దిగంబర వాదమునకు సంపూర్తి విరుద్ధముగా నేర్పడినదని యూహింప నగుచున్నది. ప్రతి భిక్షువునకును అంతరవాసకము, సంఘాతి, ఉత్తరాసంగమను మూఁడు కావిబట్టలుండవలయు. అంతర వాసకమన లోనియుడుపు. సంఘాతియన నడుమునఁగట్టు బట్ట. ఉత్తరాసంగమన పైఁగప్పుకొనునది. వీని నుతికి యాఱవేయ మఱి మూఁడు మాఱు వలువ లుండవచ్చును. లోపలివస్త్రము మలినమై శిథిలమైనయెడల వేఱువస్త్రము సంపాదించుటకు

1 తప్పుచేసిన భిక్షువునకు ప్రాయశ్చిత్తము నందవనమునకు నీరు మోయుట. భిక్షుకికి బుద్ధనికోవెల ముంగిళ్ళకి ఇసుక మోయుట.

తాముగా యత్నింపఁగూడదు. లేకుండుట గాంచి యెవ్వరేని తాముగా నొసఁగినఁ గైకొనవచ్చును.

నివాసము :— వనమున వృక్షమూలమున నొంటరియై వసించుట యింద్రియ నిగ్రహమునకు మేలైన త్రోవయని బౌద్ధుల తలంపు. బుద్ధుఁడు ధర్మోపదేశము సేయఁదొడఁగిన నాఁటినుండి గ్రామములకు పట్టణములకు చేరువనున్న వనములలో వసించు చుండెను. అనేక భిక్షువులు కానలకేగి వృక్షమూలములం దొంటరులై యుండిరి. కొందఱు తమకుఁ గట్టించి యిచ్చిన విహారములలో కూటువలుగా నుండిరనియుఁ దెలియుచున్నది. విహారములన భిక్షుకులు విడియుటకై యుపాసకులు కట్టించి యుంచిన ఊరివెలుపలి తోఁటలలోని కట్టడములు. బుద్ధుని కాలమందే కొన్ని విహారములు అమర్పఁబడి యుండినవనియు నతని తరువాత నచ్చటచ్చట పెక్కు నిర్మింపఁబడినవనియుఁ దెలియుచున్నది. కొండ గుహాలందును కొండలలో చిన్నవిగను పెద్దవిగను శిల్పులచే తొలిచి యమర్పఁబడిన కల్పిత కుహరము లందును భిక్షువులు ఏకాంగులయ్యు కూటువలయ్యు వసించు చుండిరి. అట్టి గుహాలిప్పుడు మనదేశమం దట నటఁ గానఁబడు చున్నవి. అట్టి గుహాలందును విహారములందును భిక్షువులు సంవత్సరము పొడవున వసించు వాడుక లేదు. వర్షాకాలము తక్కఁ దక్కిన కాలములందొక చోటినుండి మఱొక చోటికిఁ దరలుచునే యుండవలయును. వానకారునమాత్ర మొక చోటన

యుండవలయు. ఆకాలమున బయటఁ జెట్టుక్రింద వసింపరాదు. చోటులు మార్చను రాదు. దీనింబట్టి వారికి ఆరోగ్యరక్షణము ప్రధాన కార్యములలో నొకటియని తేటపడుచున్నది.

భిక్షువుల దినచర్య:— క్రొత్త భిక్షువై గురునొద్ద శుశ్రూషసేయుచుండు వాఁడు సూర్యోఁదుదయించు మున్నే లేచి స్నానముచేసి తమ విహారమును శుభ్రపఱచి తాము పూజించు నశ్వత్థ వృక్షంపు టడుగుభాగమును శుభ్రపఱచి యా దినమునకు వలసిన పానీయ జలమును వడియఁగట్టి యుంచవలయు. ఆవల నేకాంతముగఁ గూర్చుండి బుద్ధధర్మములను మననము చేయవల యును. తర్వాత ధాతు గోపమునేని అశ్వత్థమునేని పూవులతో నర్చించి నమస్కరించి భిక్షాపాత్రమును చేఁబూని యాచార్యుని తోడ భిక్షకుఁ బోవలయు. భిక్షగొని వచ్చినపిదప గురుని పాద ప్రక్షాళనమునకు నీరు తెచ్చియిచ్చి భిక్షాపాత్రము నాతని యెదుర నుంచి యతఁడును తానును భుజించిన తరువాత భిక్షాపాత్రమును శుద్ధిచేయవలయును. తరువాతను బుద్ధుని వినుతించి ధ్యానింప వలయు. తదనంతరము బౌద్ధ సిద్ధాంతగ్రంథములు చదువుట, వ్రాయుట తనకుఁ దెలియనివానిని గురువునడిగి తెలిసికొనుట మున్నగునవి సాయంకాలమువఱ కతఁడు చేయవలసిన పనులు. సాయంవేళ విహారమును చిమ్మి శుద్ధిచేసి దీపమెత్తి నాఁడు బౌద్ధ గ్రంథములనుండి కంఠస్థముచేసిన భాగములను గురున కొప్పగించి తా నేదేని దోసఁగు గావించి యుండినచో నాచార్యునికడ వెల్ల

డించి క్షమింపఁ బ్రార్థింపవలయు. నిండుమనముతో నింద్రియ ములజయింప యత్నించుచు త్రికరణశుద్ధికలిగి శాంతితో వర్ధిల్లుచు రావలయు.

స్థవిరులగు భిక్షువులిట్లు శిష్యులచే నుపచరింపఁబడి తమ కాలమును శీలానుష్ఠానమందును పంచవిధ భావనలందును ధ్యాన మందును సమాధియందును వ్యయపఱచుచుందురు. ఆశనుగెలిచి బంధములఁద్రెంచి పూర్వజన్మంబులందును ఈ జన్మమందును చేసిన కర్మముల సంస్కారములను నాశముకావించి నిర్వాణము నొందుటయే వారి యత్నముల కన్నింటికి ఫలము. ఇట్లు శీల భావనాధ్యాన సమాధులచేఁ గలుగునవి క్రమముగా స్రోతా పన్నులు సకృదాగాములు అనాగాములు అర్హతులని నాలుగు తరగతులు గలవు. అశేషు లను నైదవ తరగతి యున్నట్లును చెప్పుదురు.

"సంఘమున వసించువాఁడు వేఱు విషయములఁ గూర్చియు అల్ప విషయములఁగూర్చియు మాటలాడఁడు. తన మతగ్రంథమందలి విషయములనే వివరించి ప్రకటించుచుండును. లేక యితరుల నట్లుచేయఁ బ్రోత్సహించును. లేక పరిశుద్ధమైన మౌనమును గౌరవముతో వహించును" అని త్రిపిటకమున నొకచోఁ జెప్పఁబడినది.

## ఉపవసథవ్రతానుష్ఠానము

నెలలో రెండుసారులు పర్వకాలములందు సమీప స్థలములనున్న సన్న్యాసులెల్ల రొకచోఁజేరి యుపవసథవ్రతానుష్ఠానము చేయుచుండుట వాడుక. ఉపవసథమన నుపవాసదినము. కూడియున్న భిక్షువులలో నొక్కొక్కరును తమవిధులను ఆచారములను క్రమముగా నడపుకొనుచువచ్చిరాయని విచారించి తెలిసికొనుటయు దోసఁగు లొనరించినవారు తమదోసముల నను తాపముతో వెలివెటిచి సంఘమువారి క్షమాపణము పొందుటయు నుపవసథానుష్ఠాన ముఖ్యోద్దేశము. ఒకయెల్లకు లోఁబడియున్న స్థలములందలి భిక్షువులలోఁ బెద్దయగు స్థవిరున కీయుపవసథానుష్ఠాన సభనుచేర్ప నధికారముకలదు. సభకు రావలసిన భిక్షువులందఱు నాపెద్ద విధించిన విహారమునకేని గుహకేని వచ్చి చేరవలయును. ఒకభిక్షువేనియు రాక నిలువరాదు. పిచ్చిపట్టినవారు మాత్రము రాక నిలువచ్చును. రాఁజాలక వ్యాధిగ్రస్తులై యున్నవారు తాము నియమము మీఱి యెట్టి దోషమును కావింపలేదని వేఱు భిక్షువు మూలమునఁ దెలుపఁగూడునేని అట్టివారు రాక నిలువ వచ్చును. అట్లు చేయలేకున్నచో నా వ్యాధిగ్రస్తుని సభకుమోచి తేవలయును. అదియు శక్యము కాకున్న సభయే యతఁడున్న చోటికేగవలయు. ఇట్లు రావలసిన వారందఱువచ్చి కూడినఁగాక యాసభను నడపుట కెవ్వరికిని అధికారములేదు.

సూర్యాస్తమయ కాలమునకుఁ దరువాత భిక్షుకులెల్లరు తమకుఁదగిన స్థలములఁజేరుదురు. ఉపాసకులలో నొక్కరేని ఆ సభచేరువేళ నచ్చటనుండరాదు. తరువాత సభలో నెల్లవారికి వినఁబడునట్లు స్థవిరుఁడు ప్రాధిమోక్ష వాక్యమును చెప్పును. ప్రాధిమోక్షమన దోసముల ననుతాపముతో నొప్పుకొని యీ బంధములనుండి విడుదలనొందుట. "పూజ్యులారా! నే వచించునది సంఘమువారు ప్రేమతో విననలయు. నేఁడు పక్షమున పదునై దవదగు ఉపవసథ్యదినము. సంఘమువారు సిద్ధులై యున్నచో ఉపవసథానుష్ఠానముచేసి ప్రాధిమోక్షమును వినవచ్చును. పూజ్యులారా! మీపరిశుద్ధిని సంఘమువారికిఁ దెలియఁజేయుఁడు. మీరు దోషమాచరించియుంటిరేని దానినొప్పుకొనుటకు వలసిన వాక్యములను తెలుపుచున్నాను. వినుఁడు" అని స్థవిరుఁడు పలికిన వెంటనే సభలోని భిక్షుకులెల్లరు 'మేమందఱము మీరు చెప్పినది విని తగిన యట్లు నడచుకొందుము' అని చెప్పుదురు. ఆపై స్థవిరుఁడిట్లు వాక్రుచ్చును. "ఎవరు దోషమాచరించి యుండినను ఒప్పుకొనవలయును. తప్పుచేయనివారు మౌనముతోనుండ వచ్చును. పూజ్యులారా! మీమౌనమువలన మీరు దోషమాచరించి యుండలేదని నేనెఱుఁగుచున్నాను. ప్రత్యేకించి యొక్కనిఁ బ్రశ్నించినచో నతఁడెట్లుత్తర మిచ్చునో అట్లే యీ సభనుద్దేశించి మూఁడుమాఱులు నేనడుగు ప్రశ్నములకు ఇటఁ గల యొక్కొక్కరును తగిన విధమునఁ బ్రత్యుత్తర మీయఁదగి

యున్నారు." అని యిట్లు స్థవిరుఁడు ముమ్మాఱు ప్రశ్నించిన పిదపఁ "దాఁజేసిన తప్పు తన జ్ఞప్తియందున్నప్పుడు దానిని బహిరంగముగఁ దెలిపి యొప్పుకొనని భిక్షువు అనృతవాద దోషమును పొందును.

మనఃపూర్వకముగాఁ జేయు ననృతవాదము తన్ను నాశము సేయునని తథాగతుఁడు సెలవిచ్చియున్నాఁడు. కావున చేసిన దోసము మఱవకుండి యాదోషమునుండి విముక్తిగోరు ప్రతి భిక్షువు తనదోషమును బహిరంగముగాఁజెప్పి యొప్పుకొనవలయు. ఒప్పుకొన్నచో పాపభారము చాలవఱకు తగ్గును" అని పలికి బ్రహ్మచర్యవ్రతభంగము, అస్తేయవ్రతభంగము, అహింసా వ్రతభంగము, బుద్ధిశక్తిని పొగడుకొనుట, అను నిట్టి యితర వ్రతములను గూర్చియు స్థవిరుఁడు ముమ్మాఱు ప్రశ్నించినపిదప సభలోనెల్లరు మౌనముతోనున్నచో అప్పుడతఁడు "పూజ్యు లెల్లరు నిర్దోషులై యున్నవారు. కావుననే మౌనముతోనున్నార లని నమ్ముచున్నాను" అని పలికి మరల 'మీరు నాయెడ నేదేని దోసమును వినియున్నను చూచియున్నను మఱి యేదేని నాయెడ సందేహమున్నను దయచేసి స్పష్టముగా నాకుఁదెలుప వలయు. నేను నా దోషములెఱిఁగి వానికిఁదగిన పరిహారము వెదకుదును" అని పలికి సభవారి యనుమతిని పొంది సభను పూర్తికావించును.

ఉపవసథ దినమున సాయంకాలమునకు పూర్వము భిక్షుకులు చేరియున్నచోటికి ఉపాసకులును స్త్రీ భిక్షువులును వచ్చి త్రిపిటకమందలి యొక భాగమగు వినయ పిటకమును భిక్షువులు చదువ భక్తితో వినుట వాడుక. ఉపవసథదినము లాదికాలమున నెలకు రెండే యుండినవి. తరువాత అష్టమితిథిని గూడ చేర్చి నాలుగుగాఁజేసిరి. ఈ యుపవసథానుష్ఠానములును వర్షకాల నియమము అను రెండే భిక్షుకు లెల్ల రొకటిగాఁగూడి చేయవలసినవి. పూర్వము చెప్పఁబడిన శీలము ధ్యానము భావన మున్నగు తమ్ము సన్మార్గవర్తులఁజేయు కార్యములను ఒక్కొకరు తమశక్తికిఁ దగిన తీరున నడపవలయును.

## యాత్రలు

బుద్ధుఁడు పుట్టిన కపిలవాస్తువునకు, అతనికి జ్ఞానోదయమైన బుద్ధగయకు, అతఁడు ధర్మచక్రప్రవర్తనము చేయఁదొడఁగిన కాశికి, పరినిర్వాణమందిన కుశీనగరమునకు బౌద్ధభిక్షుకులు స్త్రీభిక్షువులు ఉపాసకులు ఉపాసికలునగు నెల్లవారు యాత్ర చేయువాడుకగలదు. స్తూపములు, ధాతుగోపములు, *చైత్యాలయములు మున్నగు వానిని పూజించుటయు నిత్యనైమిత్తికములు నడపుటయు నుపాసకులకు తగిన పద్ధతియని బుద్ధుఁడు తన పరినిర్వాణమునకుఁ బూర్వము ఆనందునకుఁ దెలిపినట్లు తెలియుచున్నది.

---

* బుద్ధవిగ్రహము ను ప్రతిష్ఠించిన గుళ్లు.

## స్త్రీలు

స్త్రీలకు సన్న్యాసయోగ్యత కలదనుటయు వారికి సన్న్యాస మిప్పించుటయు బౌద్ధమతమందే విశేషముగాఁ గలదని చెప్పనవకాశమున్నది. ఈ దేశమందున్న యితర మతములందును స్త్రీలు వైరాగ్యమును పొందవచ్చును. దానిచే వారికి మేలిమి గలదను నభిప్రాయమున్న యట్లు తెలియుచున్నది. ఏ విధమైన నియమమునకును లోఁబడక తమ యంతఃకరణమునే తమకధి కారిగా నుంచుకొని యాశకొంచెమేనిలేక దోషముల వీడి శాంతి పొంది సర్వస్వతంత్రస్థితిగల సన్న్యాసమార్గము నవలంబించుటకు స్వభావసిద్ధమైన యర్హత స్త్రీలకు లేదనియు ఆ సన్న్యాసస్థితికిఁ దగిన స్వాతంత్ర్యమును కలంకము లేక కాపాడుచుండుట వారికి శక్యముకాని పనియనియు నీ దేశమున తొలినుండివచ్చిన యభి ప్రాయమైయున్నది. అట్లున్నను బుద్ధుఁడు తనసవతితల్లికోరిక ను త్రోసిపుచ్చఁజాలక స్త్రీలకును సన్న్యాసాధికార మొసఁగెను. సన్న్యాసినుల సమూహమునకు భిక్షుకీసంఘమనియు సన్న్యాసుల సమూహమునకు భిక్షుసంఘమనియు రెంటి సముదాయమునకు ఉభయథాసంఘమనియు పేరులు.

### బుద్ధుఁడు భిక్షుకురాండ్రకు నియమించిన విధు లెనిమిది

౧. భిక్షుకి నూఱేండ్లకుఁ బూర్వము సన్న్యాసముఁ గైకొని యున్నను ఆనాఁడు సన్న్యాసముఁగొన్న భిక్షువుఁగాంచినచో

గౌరవించి లేచి నమస్కరించి కేలుమోడ్చి మాటాడవలయును. ఈ నియమమును ప్రతిభిక్షుకి పవిత్రమైనదిగానెంచి తన జీవిత కాలమంతయును మఱవక గౌరవముతో నాచరించుచుండ వలయును.

౨. భిక్షుకు లొక్కరును లేనిచోట భిక్షుకి యొంటరియై వానకాలము కడపరాదు. ఈ నియమమును తన జీవిత...... వలయును.

3. సన్న్యాసినులు పక్షమున కొక్కపరి ప్రాధిమోక్షాను ష్ఠానము ధర్మోపదేశము పొందుట యను రెండు కార్యముల కొఱకు భిక్షువుల కడకేగవలయును. ఈ నియమమును...... ......... వలయును.

౪. వానకాలము ముగిసిన వెంటనే సంఘమండలి యుభయ (ప్రవ్రజ్య, ఉపసంపద) భాగముల వారిని పిలిచి తమ యెడ నెవ్వరేని యేదోసమునేని కనియుండినను వినియుండినను తమయెడ నెవరి కేదేని సందేహమున్నను వాని నెఱిఁగింప వల యునని వేఁడవలయును. ఈ నియమమును............... వలయును.

౫. గొప్పదోషమేదేని కావించిన సన్న్యాసిని పక్షమున కొకపరి సంఘమండలి యుభయభాగముల వారియెదుట వారు

విధించిన ప్రాయశ్చిత్తమునకు లోఁబడవలయును. ఈ నియమము
............వలయును.

౬. రెండేండ్లు పంచశీలములు. అకాలభోజన త్యాగ మను నాఱుధర్మములను చేపట్టి ప్రవర్తించిన పిమ్మటనే తమకు సన్న్యాస మిప్పింపవలయునని సంఘమందలి యుభయభాగముల వారిని వేఁడుకొనవచ్చును. ఈ నియమము................
వలయును.

౭. ఎల్లప్పుడు నెట్టిస్థితియందును భిక్షుకి భిక్షువును తిట్టుటయు కటూక్తు లాడుటయుఁగూడదు. ఈ నియమము...
.వలయును.

౮. సన్న్యాసము గొన్ననాఁటినుండి భిక్షుకులకు విరోధముగా భిక్షుకురాండ్రేదేని మాటలాడఁ గూడదు. తమకు వారికి వ్యతిరేకముగా భిక్షుకుల పలుకు లడ్డుపెట్టఁబడరాదు. ఈ నియమమును ప్రతిభిక్షుకియు పవిత్రమైనదిగా నెంచి తన జీవిత కాలమంతయు గౌరవముతో నాచరింప వలయును.

ఈ యెనిమిది నియమములను పరికించిచూడ బౌద్ధమతమందు సన్న్యాసముచే స్త్రీలకు స్వాతంత్ర్య మధికముగా లభించెనని తలంప నవకాశములేదు. భిక్షుకురాండ్రకుపవసథానుష్ఠానము తప్పని విధి. వారి కుపదేశముచేయుట భిక్షుకుల విధి. సాధారణముగా భిక్షుకురాండ్రును భిక్షుకులును వేర్వేఱుగా

నుండవలయునను నిర్బంధము కలదు. సన్న్యాసిను లున్నచోటికి వారికి ధర్మోపదేశము చేయఁదగిన భిక్షువున్నతప్ప ఏ భిక్షుకికేని శరీరాసౌఖ్యమున్నఁగాక పోవరాదు. సన్న్యాసినులతో ప్రయాణమును, ఒకచోటికేగుటయు ఎవ్వరును లేనితఱి వారితో నేకాంతముగానుండుటయు భిక్షుకులకుఁ దగనిపనులు. భిక్షుకుల దినచర్యకును భిక్షుకురాండ్ర దినచర్యకును ఎక్కువ తారతమ్యములేదు. అన్నికాలములందును భిక్షువులకంటెను వారు సంఖ్యయందు తక్కువగానే యుండిరని తెలియుచున్నది.

బుద్ధునకు తరువాత బౌద్ధమతమునకు మూలాధారము సంఘమే. నేఁటికిని బౌద్ధమతము వెలయుచున్న దేశములందు భిక్షువులే యీ మతమునురక్షించి యందఱకు ధర్మములుపదేశించి వ్యాపింపఁజేయుచున్నారు. ఉపాసకులకును ఉపాసికలకునుసాధారణముగా అన్నిమతములవారు విశ్వసించి చేపట్టియున్న పంచశీలానుష్ఠానము లేక అష్టశీలానుష్ఠానము తక్క వీరు బౌద్ధులని నిర్దేశించి చూపఁదగిన విశేషనియమ మొక్కటేని యెప్పుడునులేదు.

దీనివలననే బౌద్ధమత మధికముగా సంఘముపై నాధారపడియుండవలసినదయ్యెను. ఒక దేశమున బౌద్ధసంఘమందలి భిక్షుకులు భిక్షుకురాండ్రు వేఱుమతమునఁ జేరినచో, ఆదేశమున వారెల్లరును బౌద్ధమతమును వీడవలసినట్లు తటస్థించును.

దీనివలన బౌద్ధుల ముమ్మణులైన బుద్ధధర్మసంఘములలో సంఘమునకుఁగల గౌరవమును అగ్రస్థానమును గుర్తింప వచ్చును.

శ్రీరస్తు

# మ ణి మే ఖ ల

## ప్రస్తావన

మంజరి॥ బాలసూర్యప్రభా - భాసురంబైన
తనమేన జడయూఁగఁ - దప్తకాంచనపు
దీధితుల్గల మేరు - భూధర శిఖర
మునఁ దోఁచి దక్షిణ - మున వెలుఁగొందు
జంబూ మహాద్వీప - సంగతంబైన 5
నేరేడు పెంజెట్టు - నీడను నిలిచి
పుడమి చేడియ కగు - నిడుములు విని ని
లింపారులను చంపు - చంపువర్ణ పడఁతి
పరఁగినచోటై చం - పావతి యంద్రు
కమలాప్తకులముఁ బ్ర - కాశింపఁజేయు 10
నల జలోత్పాదక - మగు వేడ్కతోడఁ
*గాంతుఁడు వేఁడ న - గస్త్యుండు తనదు
కుండిక వంప నం - దుండి కావేరి
కడఁగి తూరుపుగ సం - గమ పురభూమి
పొంగి వెల్లువతోడఁ - బారలుచు రాఁగ 15

* పూర్వ చోళరాజు.

నాకంబు వదలు మం-దాకిని వేడ్క-
నెదురేగి కాంచి మి-న్నేఱు! పవిత్ర!
వేడ్కతో రమ్మని-పిలుచు నగస్త్య
ముని వెంటవచ్చి యీ-భూమిఁ బునీత
ముగను గావించి య-మోఘాజ్ఞ యొప్పు ౨౦
చోళ భూపతి కుల-శోభాయమాన
కేతనాగ్రంబెక్కి-భూతలమందు
మిట్టి యెండలు కడు-మోఁడైనఁ దనదు
దశను మార్చక నిల్చు-ద్రావిడ పుత్రి
కావేరి వినుతించి-గణుతించి నిలువ ౨౫
దోలి ముది ముదితమై-యలమిన వేడ్కఁ
గఱువుపై నెక్కించి-కొనియుండు నంత
తమ్మి పుట్టువు * దేవ-తా గణ పిండ
ముల ♦ దిశాముఖ పిండ-ములసృష్టిసేయు
నదనఁ జంపావతి-యను పేరఁజేయు 30

---

* లోకములు ముప్పది యొకట మహారాజిక లోకము మొదలుగ దైవలోకము లాఱింటఁగల ఆఱు తెగల దైవగణ పిండములు.

దేవలోకములు. ౧. మహారాజికము, ౨. త్రయ త్రింశల్లోకము, 3. యామము, ౪. తుషితము, ౫. నిర్మాణరతి, ౬. పరనిర్మిత వశవర్తి.

♦ బ్రహ్మలోకము లిరువదింటఁగల బ్రహ్మగణ పిండములు. ఆ లోకములు :—

నరి భీకరమగు నీ-పురవరమందు
శత మఖోత్సవవేళ-జనియించు నగడు
వలనఁ బుట్టిన చింత-ప్రబలిన కతనఁ
జిత్రావతి వసంత-చేటిక వలనఁ
దెలివ మాధవికి సం-దేశ మంపుటయు ౩౫

మణిమేఖల విరులు-గొనఁగ నుద్యాన
మున కేగుటయు యువ-భూపతి కాంచ
స్ఫటిక గేహమున కా-పడఁతి యేగుటయు
నతఁడు చలిత చిత్తుఁ-డయి మరలుటయు
మణిమేఖలాదేవి-మణిమేఖలఁగొని ౪౦

మణిపల్లవమున క-మరఁ జేరుచుటయు
సుతమతి యిచ్చట-సుదతి యచ్చటను

---

౧. బ్రహ్మకాయికము, ౨. బ్రహ్మపురోహితము, ౩. మహాబ్రహ్మము, ౪. పరీతాపము, ౫. అప్రమాణాపము, ౬. అభాస్వరము, ౭. పరీతశుభము, ౮. అప్రమాణ శుభము, ౯. శుభకృత్స్నము, ౧౦. బృహత్ఫలము, ౧౧. అసంజ్ఞా, ౧౨. అబృహత్, ౧౩. అతపము, ౧౪. సుదర్శము. ౧౫. సుదర్శి, ౧౬. అఘనిష్ఠ, ౧౭. ఆకాశానంద్యాయతనము, ౧౮. విజ్ఞానానంద్యాయతనము, ౧౯. అకించన్యాయతనము, ౨౦. నైవ సంజ్ఞాయతనము. ఇందు మొదటినుండి పదునాఱు రూపబ్రహ్మలోకములనియు తక్కిన నాలుగు నరూప బ్రహ్మలోకములనియుఁ జెప్పంబడు. పైని ఆఱు దేవలోకములు సకామ లోకములనియు, బ్రహ్మలోకము లిరువదియు నిష్కామలోకములనియుఁ జెప్పంబడును, చూ. పీఠిక.

నిద్దురలేచి చిం-తించు చుండుటయు
మణిమేఖల యచట-మణిపీఠిఁ గాంచి
పూర్వ వృత్తాంతంబు-పొల మెఱుఁగుటయు 45
మణిమేఖలాదేవి-మణిమేఖలఁగని
మఱుఁగకు మని చీరి-మంత్రములో నేర్పి
తొలఁగుటయును ద్వీప-తిలక కాన్పించి
యమృత సురభియను-నక్షయపాత్ర
మొసఁగుటయును కొన్న-యువిద తల్లులను 50
కలియుచు నలవణుఁ-గాంచి కొల్చుటయు
నతఁడు గోపుత్రకు-నతిశయ వృత్త
మెఱిఁగించుటయుఁ బాత్ర-కరమునఁదాల్చి
మేడ వీథుల మణి-మేఖల నడవఁ
బంచి కుడుచు పతి-వ్రతలు తత్పాత్ర 55
మున బిచ్చ మిడుటయు-వనజాక్షి కాయ
చండిక యాఁకలి-చల్లారఁజేసి
చిత్రకూటమునకుఁ-జెలువ చేరుటయు
నది మెఱింగి యుదయుఁ-డచటి కేగుటయు
నవ్వాని యెదుట వి-ద్యాధరు భార్య 60
రూపొంది యాపె తి-రుగుచుండుటయును
చెఱసాలఁ జేరి యఁ-చ్చోట ధర్మశాల

గాcగ మార్చుటయును - కాంచనుం డామె
డాసి యుదయుc డట - డాయc గోపించి
కాంచనుం డాతని - ఖండించుటయును     ౯౫

స్తంభప్రతిమ పూర్వ - జన్మవృత్తాంబు
తెలుపుట తెఱవ బం - ధింపంగcబడుట
చెఱ వీడుటయు రాణిc - జేరి ధర్మంపుc
ద్రోవ యెఱింగించి - శ్రావక దేశ
మున కేగుటయును గో - పుత్రకుఁ గోడ     ౧౦౦

మణి పల్లవము చేరc - జనc గోరుటయును
మణిమేఖల యవల - మాని వేషమున
వంజి చేరుటయుc ద - త్త్వంబులు వినుట
జననితో నఱవణ - ముని కాంచిc జేరు
సంగతి విని తానుc - జని తన రూప     ౧౦౫

మొంది యమ్ముని సేవ - యొనరించుటయును
ధర్మముల్ విని తప - స్సైర్యంబు నూని
భవపాశ బంధముల్ - వదల నోచుటయు
యువరాజముని విన - నొగి ధాన్యవణిజుc
డగు శాస్త్ర ద్రవిడ భా - షా ధీశ్వరుండు     ౧౧౦

పసి మణిమేఖలా - సన్న్యాస మనెడి
కావ్యంబు ముప్పది - కాండముల్గాcగ

విరచించె జగమున - విశ్రుత కీర్తి
పూతలపట్టునఁ - బొలుచు శ్రీరామ
సుకవి తెన్నున దాని - శోభిల్లఁజేసె ౭౫
రమణీయముగ రఘు - రామార్పణముగ.

## ౧. ఇంద్రోత్సవ ప్రకటనము

సన్మార్గమున గొప్ప - సన్నుతికెక్కి
పలుదేశజనులచేఁ - బ్రణుతి గన్నట్టి
సంగమ పురిమేల్మి - చదురులకెక్కి
మలయ తపస్వి తాఁ - దెలుప రక్కసుల
గగన దుర్గముల జాఁ - గఱ లాడినట్టి ౫
వీరవరుఁడు చోళ - ధారణీశ్వరుఁడు
పురుహూతు వినుతించి - ముందుగా నిలిచి
సురలు మోదింప ను - త్సుకత నుత్సవము
మొనసిన యిరువది - యెనిమిది నాళ్ళు
విచ్చేయుఁడన సుర - విభుఁడు మోదించె ౧౦
నిస్సంశయంబుగ - నేర్చిన వారు
కల్లలాడమి లోకి - కమ్ము తత్త్వమ్ము
ముక్తియనెడివాని - ముఖ్యార్థములను
నెఱిఁ దెల్పు నాగమ - నిపుణ వాగ్విదులు
తమ దారి గడిదేఱు - దైవజ్ఞవరులు ౧౫

నగరంబు వీడక - నడయాడుచుండు
సుందరరూపులౌ - సురవరేణ్యులును
కలసి మెలయుచుండు - పలునాళ్ళవారు
పలు మినుకుల వారు - పలుతీరువారు
హితులు మంత్రులు పురో - హితులు దూతలును ౨౦
సైన్యపతులు గూఢ - చారులు గణకు
లాయంబువారు ము - న్నగు పెక్కు తెగల
వార లుచ్చావచ - వైఖరిఁ గలిసి
యింద్రుపంపున ముచి - కుందున కొనరు
దిగ్భ్రమంబును పోవఁ - ద్రెంచు భూతమ్ము ౨౫
జేవుఱు పెదవులు లావైనపండ్లు
నుఱుమువంటి సొరము - మెఱుపు మొగమ్ము
తనరి తాపస వేష - మునఁ దిరుగాడు
నాతతాయులఁబట్టి - నాత సైఁచికొను
* భూతమ్ము తృప్తికై - పురుహూతు నుత్స 30
వమ్ము చేయుండని - వజ్రి కోవెలను
విజయ మంగళభేరి - గజముపై నుంచి
యముని కన్నుబవిప్పి - యానంద మార
నల్లఁ ద్రావించు వి - న్నాణంపుఁ గొడువు
తో వ్రేయ నుఱుమనఁ - దోడ్తోడ క్రాఁగె 3౫

---

* చూ. అందియశత ౫. ప్ర. ౧౭౮-౧౩౫ పంక్తులు.

సార్వభౌముండేలు - సంగమపురము
పాడి పంటలతోడ - వర్ధిల్లుఁ గాక
వదలక నెలవాన - వర్షించుఁగాక
పతియాజ్ఞ భువి నకుం - శిత మగుఁగాక
* ద్వీపశాంతి జరగు - దినములయందు ౪౦

వృత్రారితోఁ ♦ జతు - ర్వింధ దేవతలును
గరిమ నష్టాదశ - గణములవారు
సంగమ పట్టణో - త్సవముఁ దలంచి
కరికాల చోళుఁడు - త్తర దిశఁ జూర్చి
యరివీర విజయార్థ - మరిగిననాఁడు ౪౫

సంగమ పురివోలె - స్వర్గపట్టణము
నుండు బిసోరని - యురుగుణు లాడు
పలుకు సార్థకమయి - పరఁగుట కతన
ద్వారసీమలను స - భామండపములఁ
బూర్ణ కుంభంబులు - బొమ్మదివ్వియలు ౫౦

పెక్కులుంచుఁడు - గెలల్ వ్రేలుచునున్న
క్రముక కదలికేక్షు - కాండముల్ నిల్పి
టెంకాయగెలలు జో - డించి కట్టుండు

* జంబూద్వీప క్షేమము గోరిచేయుటచె నీ పేరుగలిగె.
♦ వసురుద్రాదిత్య మరుత్తులు.

పూల తీవియలచేఁ - బొలుపు చేయుండు
వరుసలై తిన్నెల - పయి జాలువారు ౫౫

పొన్న కంబములకు - ముత్యాల సరులు
వ్రేలాడఁగట్టుఁడు - వీదుల రచ్చ
లందు మండపముల - యందున్న యట్టి
ప్రాఁతయిసుక దీసి - పాఱవై వుండు
క్రొత్తయిసుక దెచ్చి - కూర్చి పఱపుఁడు ౬౦

సిడములకుం గలు - వడము లుంచుండు
వాకిండ్లు ముంగిళ్లు - పై మేడలెల్లఁ
గనుల పండువుగాఁగ - గై సేయుఁ డీరు
ధూర్జటిఁ దొట్టి చ - తుష్క-భూతముల
గుళ్ళు వెవ్వేఱగు - క్రొత్తపద్ధతుల ౬౫

నెఱుఁగు నేర్చరు లలం - కృతులు సేయుండు
ఇసుక పఱపుగల - యెడలఁ బందిళుల
మండపముల ధర్మ - మార్గము లెఱుఁగు
పావనుల్ నిలిచి యు - పన్యసింపుండు
చేరుఁడు చవికెల - సిద్ధాంత విదులు ౭౦

ప్రాఁబగల్ తగవులు - వదలుఁడు పోరు
వీడుఁడు సైకత - వీథుల విరుల
తోఁటల రేవుల - దొరువుల నరులు

సురలుఁ గలిసి యిటఁ - దిరుగుచుండుదురు
కాన నీ దినములఁ - గల మేలెఱుంగు ౭౫

వారలు కత్తుల - వారలు శూర
వరులు తేరులు కరి - తురగ సంతతులు
కను గల్గియుండ న - గారు ప్రోఁగించి
ఆఁకలి దప్పులు - వ్యాధులు పగయు
నీఁగి వాన కలిమి - నెగడెడుఁగాత ౮౦

మని యుత్సవము పుర - మ్మున నెల్ల యెడలఁ
డింగు రంగంచుఁ జా - టింపంగఁ బడియె.

౨. ఊరినింద

ఇలను జంబూద్వీప - మేలు వేలుపగు
శక్రున కగు దీవి - శాంతి యొనర్చు
నెల్లిదమున మణి - మేఖలతోడ
మాధవి రాక యు - మ్మలిక వర్ధిల్లఁ
జిత్రావతి యెడందఁ - జింతించి యపుడు ౫

చెలువ చేటిం బిల్చి - శీఘ్రమ కూఁతు
కడకేగి నగరానఁ - బొడమిన యట్టి
తెలుపుమ యన నామె - తీఱని చింతఁ
బనవి పనవి సన్న్య - సనమంది కూఁతుఁ
గూడి మాధవి యున్న - క్రొన్నన చవికఁ ౧౦

జేరి యొడలి పస - చెడ నూర్చి యూర్చి
తోడవులఁ ద్యజియించి - దుఃఖాన మఱుఁగు
చెలిఁ గని వంశ ల - క్ష్మి! నగరాన
ఘటియిల్లినది విను - కడఁక నీవలన
నీయూరి కేదేని - యొడ్డమి కలదె ? ౧౫
జైత్ర జాతీయముల్ - సంగీత సరణి
నాటలు పాటలు - నభినయ విద్య
[1] తాళ సంగతులు ము - క్తాయింపు రీతి
వీణాది సాధన - విధులు నత్తెఱఁగు
వాద్యముల్ క్రోషియు - బంతియుఁ బాక ౨౦
శాస్త్ర కార్యమ్ములు - చందనాదికము
ప్రాయంపుఁ జేష్టలు - వన జలక్రీడ
లలరు తల్పము బంధ - ముల విధములును
ఇంగితజ్ఞతయు స - మీక్షణ తోడి
సంబంధ వచనముల్ - స్వగత ప్రకాశ ౨౫
సూచ్య దృశ్యంబులు - సులభ లేఖినియు
వేసంబు వేయుట - విరుల కై నేఁత
స్వరముల కూర్పు జో - స్యంబు విద్దియల

1 తాళములేడు :— (ఒరుశీర్) శెందూక్కు (ఇరుశీర్) మదత్తై (ముచ్చీర్) తుణవు (నాల్శీర్) కోయిల్, (ఐ జీర్) నివప్పు (ఆఱుశీర్) కళ్లాల్ (ఏఴుశీర్) నెడుంమూక్కు. శీర్=మాత్రాగణము.

చాకచక్యము రీతి - శాస్త్ర పాండితియు
సాధించి యీనాటి - జరగు మాడంతి ౩౦

'నాట్యంబు నేరిచె - నాన యొందినది'
అని యీనగర వాసు - లను రోఁతనింద
విన నాకు సిగ్గయ్యె - ననిన వసంత
మాలకు నిట్లను - మాధవి ప్రియున
కొనరు ఘోరాపద - వినిన పిమ్మటను ౩౫

ప్రాణాలతో నుంటి - ననుగమింపకయ
పురము వారలు మమ్ము - పొగడు వార్తలకె
చాల సిగ్గిలి యిట్లు - సన్న్యసించితిని
పతి మరణింపఁ బా - వకు దరి కొలిపి
కొలిమి తిత్తి వలె నూ - ర్పులు పుచ్చితోడ ౪౦

నుసుఱుల విడలేని - యువతులే యగ్గిఁ
బడువార లారీతిఁ - బడలేని వారు
వ్రతములు నోచుచు - బ్రతుక నిచ్చింత్రు
కన్నగి యట్టిదా? - కాదు నాథునకు
గలుగు నాపద కోర్వ - కలిగి కేశములు ౪౫

వ్రేలి కప్పఁగ నశ్రు - వితతిచేఁ దడియు
స్తన మూడ్చి యగ్గిని - దరికొల్పి మధుర
వెలిమిడి గావించు - వీర భామినికి

దనయయా మణిమేఖ - లను తపస్వినిగఁ
జేయుట తప్పె? కొం - చియ మౌని పడుపు ౫౦
వృత్తికిఁ జొరఁ దగు - వెలఁదుక గాదు
ఏనును కన్నగి - నిలువేల్పు గాఁగ
నెంచి యిట్టులు సన్న్య - సించితి వనము
చేరితిఁ బావన - చిత్తుఁ డలవణ
ముని పాదముల వ్రాలి - యొనరిన హృదయ ౫౫
సంక్షోభము వచింప - సన్ముని యంతఁ
బుట్టిన వారు ము - ప్పలఁ బడువారు
పుట్టని వార లి - మ్ముల నొందు వారు
తగులాన నగు దుఃఖ - తతి మొదలిటిది
తరువాతి దగు దుఃఖ - తతినివారకము ౬౦
వీక్షింపు మని *పంచ - విధ శీలములను
తెలిపి విముక్తి నొం - దెడి మార్గ మిద్ది
కొనుమని యుపదేశ - మొనరించె నమ్మ!
ఇయ్యది తల్లికి - నెఱిఁగింపు మనుచుఁ
బనుపంగ నరుదైన - వర రత్న మబ్ధిఁ ౬౫
బడు తెఱఁగయ్యె దు - ర్భర మంచు మఱి వ
సంతమాల పలుకఁ - జాలక మరలె

---

* కామము, వధ, కల్లు, కల్ల, చౌర్యము అను నైదును **లేకుండుట**-పంచశీలము లనఁబడును. చూ. ౭౭౪.

## ౩. ఉపవన ప్రవేశము

మాధవి చేటికి - మదిలోని చింత
దెలిపిన తఱిఁ దోఁచి - యలరు తావివలె
మణి మేఖలకుఁ బూర్వ - మహిత కర్మములు
ఫల మొసంగ నెదురు - వచ్చు హేతువునఁ
వల్లికిఁ దండ్రికిఁ - దనరు దుఃఖములు ౫
చెవి త్రోవఁ జొచ్చి చె - చ్చెరఁ గాల్చుటయును
కలఁగిన మదితోడఁ - గాఁక యలఁదు
నందంబు తొలఁగించి - యశ్రువుల్ నించి
విరిదండఁ దడుపంగ - విరవిర వోవు
మణిమేఖలం గాంచి - మాధవి చేరి ౧౦

కమలంబు చంద్రుని - గలిసిన కరణిఁ
గన్నీరు తనచేతఁ - గడుగు చూరార్చి
సాకునఁ బరిశుద్ధ - సరము పాడయ్యెఁ
గ్రొత్త పూవులు నీవ - కోసి తెమ్మనుడుఁ
దనయతోఁ బూసరుల్ - తగఁ గట్టుచుండు ౧౫

సుతమతి విని చింత - స్రుక్కి యిట్లనియెఁ
దలిదండ్రులకుఁ గల్గు - దండడి బెడఁద
విని వంత క్రుంగింప - విహ్వల యగుచు
మొగమున నగల క్రొం - జిగితో వెలుంగు
కనుపాప బాష్పముల్ - కార్చుట కాంచు ౨౦

నేని కాముఁడు తన - సూన బాణముల
విసరి వైచి వడఁకు - వెలవెల వోయి
అట్టి సుందరి నరు - లారసిరేని
వదలి యూరకయ పో - వుదు రేమి చెపుము
తమ స్వభావంబు వ్య - త్యస్తంబు గాక 25

వలపు మదిఁ గొనక - నిలిచిర యేని
వారు నిజము పేడి - వారలే సుమ్ము
మఱి యొక మాట మీ - పురికి నే వచ్చు
కతమును వినుము ని - క్కము నెఱుంగుదువు
చంపా నగరమున - సద్విప్రవరుఁడు 30

కౌశికుండనువాఁడు - కలఁడొక్కఁ డతని
పుత్రిక నే నొంటిఁ - బోవఁ దెగించి
తోఁటలోనికిఁ బూలు - త్రుంపఁ బోయితిని
అచట మారుత వేగుఁ - డను పేరి వాఁడు
విద్యాధరుం డింద్ర - విభవోత్సవంబు 35

కను వేడ్క నేగుచుఁ - గాంచి నన్వలచి
మనుజుల కంటికి - మఱుఁగయి వచ్చి
వినువీథి నను గొని - చని వశపఱచు
కొనె నేను వాని ప్రే - మను చూఱఁగొంటి
నావల నిచట న - న్నాతఁడు వదలి 40

త్రుటిలోన నెచటికో - నుటు మాయ మయ్యె
గాన మాణిక్య ప్ర - సూన వల్లికను
పూలు చిదుమ నొంటిఁ - బోనీయ వలదు
పలు తావి పువ్వులు - పలు తావులందు
నిండారు గ్రామని పం - దిరిని * లవంతి ౪౫
ప్రక్క - వెనుక రాజ - బంధువుల్ గలరు
తిరునాళ్ళ నరులచేఁ - దిపురని తేంట్ల
రొదలేని సుకుసుమ - ద్రుమము లన్నియును
వాడని పూలచే - వఱలుచు నుంట
దలఁగక పాశి భూ - తము కాచుచుండు ౫౦
నని యెఱిఁగిన వార - లాడెందు చొరరు
తరణి వేఁడిమి తాఁకి - యెఱకలు కాలు
సంపాతియుఁ గవేరుఁ - డింపు సొంపార
వసియించు చుండిన - వనమని తాఁకి
తాపంబు గూర్చెడి - దైవ మున్నట్టి ౫౫
వనమని యెఱిఁగిన - వారందు చొరరు
కరుణతో జీవులఁ - గాచు పూనికయు
నిత్య వ్రతము గల - నియతులు బుద్ధు
పనుపున వసియించు - వన మటఁ గలదు
తన్ను చేరిన వారి - తనువు నవ్వలకుఁ ౬౦

* లవంతి = నీటిచేఁ జుట్టఁబడిన వసంత వనము.

జూపు పటికి గీము - శోభిల్లు నందు
కలదు కెంపుల జిగి - కడలకుఁ బరపు
పద్మ పీఠం బందు - పడవైచు మొగ్గ
లలరు విరిసినవి - యవియవు తేంట్లు
ముసరవు తావియుఁ - బో దొక్క యేఁడు ౬౫

మఱచితి దాని స - న్మహిమంబు వినుము
దీక్ష గలార తే - దేవుఁ దలఁచి
యచటఁ బూవుల వైతు - రద్ది యా వేల్పు
పదములఁ జేరు నే - భావంబు లేక
యట నుంతురే నవి - యచటన నిలుచుఁ ౭౦

గతము కలదు వేడ్క - కలదేని వినుము
చేసిన కర్మముల్ - చిత్తంబు నంట
కున్నను ఫల మీక - యుండవు సుమ్మీ
యనెడి వ్రతులు దుఃఖ - మందఁగ మఱియు
మనసుతోఁ జనని క - ర్మములు ఫలింప ౭౫

వను వారలకును దృ - ష్టాంతంబు గాఁగ
విరులిడి చూప న - సుర శిల్పి మయుఁడు
నిర్మించినది మహా - సీయా పీఠంబు
నవ్వనమునకుఁ గా - కెవ్వనమునకుఁ
దనయ యొంటరి యయి - చనఁ జన దామె ౮౦

తో నేను పోయెడి - దాన సం చాడి
చిక్కా నఁ గుండిక - చేఁ గల వాఁడు
పేఁప బెత్తము చంకఁ - బెట్టిన వాఁడు
జైనుల పల్లె ని - చ్చలు నుండు వాఁడు
వస్త్రంబు బిడియంబు - వదలిన వాఁడు ౮౫

కానంగ రాకుండు - ప్రాణులఁ గూర్చి
యంగద గలుగునో - యని చేష్టలుడిగి
నిరశన వ్రతముచే - వరటిన వాఁడు
రోగమ్ము నొందిన - నాగమ్ము వోలె
స్నానమ్ము చేయని - మేను గలాఁడు ౯౦

నయి వచ్చు జైన స - న్న్యాసిని గాంచి
అయ్యా మీ పదముల - కభి వందనములు
మిగుల ముఁజికిద్దైన - మీ మేని యుసుఱు
గాలి లేని గదిని - గల జీవిపోల్కిఁ
దపియించు చున్నది - తాపసవర్య ! ౯౫

ఇహాపర ముక్తుల - నిచ్చు మా యర్హ
దేవుండు వచియించు - తెరుఁగొండు వినుము
త్రాటి కల్లోకయింత - త్రావుట కంటె
మీ యోగమున యందు - మిక్కిలి సుఖము
గలదేమి ? యిది త్రావి - గమనింతురేని ౧౦౦

నా వార్త నిజమని - నమ్మఁగఁ గలరు
కానిచో నా తలఁ - గత్తిరింపుండు
అని పల్కి ప్రతిని మ - ద్యము ద్రావుమంచు
నర్థించు మధుపాయి - నలమిన జనము
గన్నేరు పూమాల - కరములఁ జుట్టి ౧౦౫

మెడను జిల్లేడు పూ - వడము ధరించి
చింపులంగోఁ జేర్చి - చెట్ల రెమ్మలను
నడుమునఁ గట్టి ప - దడు మట్టి దుమ్ము
నొడలెల్ల మెత్తించి - నోడవుల కూర్పు
నర్థమ్ము లేక మా - టాడుచు బనవు ౧౧౦

చాడుచుఁ బడుచుఁ బా - రాడుచు లేచు
చొదుఁగుచు నిలుచుచు - నూఁగుచుఁ బిలుచు
చఱచుచు వదరుచుఁ - బరుగు వాఱుచును
తాన కథం జెప్పి - తాన యూఁకొట్టి
సుడియుచు మ్రొక్కుచు - స్రుక్కుచు వెక్కి ౧౧౫

యేడ్చుచుఁ బారుచు - నేగిన చోటి
కేగుచు నీడతో - నీసడించుచును
తిరుగుచు నున్న వే - మఱుఁ గాంచి మిగులఁ
బరితాప మంది వం - దురు జనంబులును
మెలిగొన్న పెద్ద మీ - సలు నెఱి కురులు ౧౨౦

పవడమ్ముఁ బోలిన - వాయి ముత్తెముల
వంటి పల్వరుసయు - వహ్నిని చెనయు
కన్నులు వంగిన - కనుబొమల్ వెండి
కమ్మలు నెలవంకఁ - బొమ్మను నొసలు
కఁదల విరివంటి - కరముల వ్రేళ్ళు ౧౨౫

వలుఁద పిఱుందులు - బఱసిన చనులు
చేపడు నడుమును - చిన్నఁగిన వలువ
చిత్ర ప్రతిమ వంటి - చెలువంబు తోడ
ననిరుద్ధు విడిపింప - దనుజుని పురిని
వెడవిల్తుఁ డూనిన - పేడి వేసమ్ము ౧౩౦

వలె నున్న చెలిఁ గని - నిలుచు జనములు
అరుదంది క్రొత్త వా - రారయఁ దగిన
పగిది వేశ్మంబుల - భవ్యంబులైన
సొగసు జిగులతోడ - సురలను తక్కు-
జీవుల నుపమించి - చేయు నేర్పరులు ౧౩౫

దిద్ది సున్నంబుతోఁ - దీర్చి యాకర్ష
ణీయంబుగాఁ జేసి - నిలుపు చిత్రములఁ
గను తెప్ప వేయక - కాంచు వారలును,
మెఱవడుల్ నడచిన - యురువీథియందు
రత్న ఖచిత హేమ - రశనలు దాల్చి ౧౪౦



తెల్ల యావలు చలి - తిలకంబు పెట్టి
యుచ్చి నూనియ పూసి - యొప్పుగా దువ్వి
కొండె వయిచి భాను - కువలయా ప్రులను
కూరిచి తొక్కు ప - ల్కులు పల్కుతఱిని
కాఱిన యాజొల్లు - కంఠమ్ము దాఁటి ౧౪౫

పరవి పంచాయుధా - భరణమ్ముఁ దడుపు
మఱుఁగు దాఁచని వల్వ - మయినుండి వ్రేలఁ
దప్పు టడుగు లిడు - తనయులఁ జేరి
పై దంతిపై నిల్చి - పడఁతులు చుట్టి
'వెఃఱెను మెఱవడి - వడిఁ గుమారుండు ౧౫౦

కాంచుఁడీ' యని కల - కల రొదసేయు
రమణీ మణులును వి - రాటుని నగరఁ
జొచ్చిన పేడి య - ర్జునుఁ జూడఁ గ్రమ్ము
జనముల పోల్కి న - ప్పటి సముదయము
మణిమేఖలం జుట్టి - మలయుచు నిట్టి ౧౫౫

నీటులాఁడిని తపో - నియతికిఁ బూన్చు
తల్లి కొడిమెలాఁడి - తరుణి యీరీతిఁ
బూలు గోయ నడచి - పోయెన యేని
యంచలు సిగ్గిలి - యట డాఁగకున్నె ?
నెలఁత యందముఁ గన్న - నెమిలి నిలుచునె ? ౧౬౦

చిలుక లీమెచుగాంచి - పలుకున యేమి ?
మోడి లజ్జిలి పాటి - యొదుఁగును గాక
తలయెత్తి యెదుటను - నిలువంగఁ గలవె ?
యనుచు నచ్చటి యెల్ల - జనములు కుందఁ
జివురుటడ్గుల జాడ - భువిఁగనరాక ౧౬౫

మెల్లన మోఁపుచు - నల్లనేతెంచి
మందార కురవక - మరువక తిలక
వకుళ నారంగ కే - తక పారిజాత
కుంద కురంటక - కుటజ కంకేలి
చంపక సర్జక - శాల్మలీ పనస ౧౭౦
పున్నాగ మందార - భూజ సంతతులు
పొదలు తీఁగలతోడఁ - బొదలుచు విరులు
రాలిన వరపు నే - ర్పరులచేఁ చిత్ర
పటము న వ్రాయంగఁ - బడినకై నడిచి
పరఁగుచుండెడి యుప - వనమును దాసి ౧౭౫

కై మోడ్చి చెలి దారి - గాన్పించుచుండ
మణిమేఖలయు సుత - మతితోడఁ జొచ్చె

# ౪. స్ఫటిక గృహప్రవేశము

తరణి కిరణవార - మిరులను మ్రింగఁ
జాల కంకెలి పడఁ - జాలిన తోఁటఁ
గోదరి వేణువులఁ దు - మ్మెదలు మేల్కొలుపు
పాడంగ నెండల - వేఁడిమి చొరఁగ
లేకుండఁ గోకిలల్ - వే చొచ్చిపోవ ౫

తీఁగ పందిరి క్రిందఁ - దివిరి నమ్మిళుల
యాటపట్టునఁ గ్రోఁతు - లానంద మంది
ప్రతిబింబములఁ గాంచు - పావనమైన
నీలమణిప్రభల్ - నెగడిన నీటి
కొలఁకునఁ బచ్చ నా - కుల జొంపమందు ౧౦

పలుపూవుల నడుమ - నిలిచి యప్రతిమ
సుషమ నొసఁగు నబ్జ - సుందర పీఠి
జనపతిపోలె హం - సంబు కొల్వుండ
దరి నాడు నెమిలికి - దరిఁ బూలకోడి
పుంజుకూఁత మృదంగ - మున మ్రోఁతగాఁగఁ ౧౫

గొమ్మ నిలిచి కూయు - కోకిలకూఁత
యాకాశవాణిగా - నలరుల రజము
గలిపి సొంపగు నిమె - గమ్మను పోలు
విరిదమ్మి దరినిల్చి - విరిసిన మొగిలి
రేకులు రజము జా - ర్చెడి రీతి గనుము ౨౦

నీ కన్నులను ఫుల్ల - నీరేజములని
చేరిన తేంట్లఁ జె - చ్చెరఁ దోలు నీదు
కరములఁ బోలు తా - మరలందు చొచ్చి
పొరలు మీలం గాంచి - పొడిచి వ్యర్థముగ
నున్న నోటికడియు - నూడఁ జింతగొని 25

మరలు మీ ముక్కుచ్చు ల - తెఱఁగారఁ గనుము
అని వనమునఁ గొలఁ - కునఁగల సొబగు
సుతమతిచూపంగఁ - జొక్కుచుఁ జెలువ
మణిమేఖలయు వన - మహిమంబుఁ గాంచు
మనసుతో నుండంగ - మారిమి వడఁక 30

నడి తెరకంబంబు - బుడమున విఱుగఁ
బఱులూడి దారముల్ - విరవిరవీఁగఁ
దెరచాప యుబ్బి చె - చ్చెర ప్రీలి వ్రేల
వనధిని దిక్కు దోఁ - పక పోవు త్రోవఁ
బోవుచు సుడిగాలి - బ్రుంగుడు వడిన 35

కలము పోలమున నీఁ - టెలవాండ్రు చేష్ట
లుడువ మావటి వాండ్రు - పొదువ గాయమ్ము
తోడి మోము కరానఁ - దుడుచుచు రాజ
వీథులలోఁ దేరు - వీఁగులంగళ్ళ
వాడల గగ్గోలు - పడఁజేసి రెండు 40

పాయలై యున్న య - ప్పట్టణ మెల్లఁ
జుట్టుచు నిలిచిన - చోటున నిలక
పోయిన తెరువునఁ - బోవక మరలి
జనములఁ దఱుముచు - జడియక తిరిగి
పలకలవారు మా - వటివాఁడు గ్రద్ద 45

పందిరి వెంటాడఁ - బఱచి బీదలును
సుడివడి బెదరి యా - ర్పుచుఁ బాఱుచుండు
నీలమేఘుం బూడి - నేలపైఁ బడిన
కరణిని గనిపించు - కాలవేగ మను
మదకరిని తురంగ - మము మీఁద వేగ 50

చని యెద్దు దాని క్రొ - వ్వణఁగించి తేరు
సేనతో భూపతి - సూనుండు తమ్మి
మొగ్గలుగల రథ - మునఁ గూరుచుండి
యూరె పూల ధరించి - కారు పూల్దాల్చు
కార్తికేయుఁ డితఁడు - గాఁడన వెడలి 55

యాట వెలఁదు లున్న - యవ్వీథిఁ జొచ్చి
జరగుచు నొక మేడ - జాల చెంగటను
పూల పాన్పున నొక్క - పొలఁతితో నుండి
మకర వీణాదండ - మొక కేల నలమి
ప్రతిమ కరణినున్న - పల్లవుఁగాంచి 60

యీవుపొందిన కష్ట - మేదని యడుగ
వాఁడు దిగ్గన లేచి - వడఁకుచు నొదిఁగి
నిలిచి చేతులు మోడ్చి - నృపవరతనయ!
విను పాత్రలోమాయు - విరివోలె సొగసు
చెడి వాడి పూవులు - చిదుమనోయేమొ ౬౫

విరితోఁట కేవీథి - వెడలుచునున్న
మణిమేఖలంగాంచి - మనసునఁ గుంది
కోవలుఁడొందిన - ఘోరకష్టమ్ము
కన్నులఁగట్టిన - కరణిఁ గన్పట్ట
మది దిటచెడి చాల - మఱుఁగుట కతన ౭౦

శత్రుస్వరమును హ - స్తంబు తాఁకినది
ఇదియ నేపొందిన - యిడుమ యంచాడ
రాకుమారుఁడు మది - రంజిల్లి యామె
యెక్కడ? తేరిపై - నెక్కించు కొంచు
వచ్చెద క్షణమున - నిచ్చటి కంచు ౭౫

వెలువడి తోఁట వా - కిలి చేరునంత
స్యందన నేమి ని - స్స్వనంబు చెవులఁ
బడ మణిమేఖల - తడఁబడి యనియె
తొలుతఁ జిత్రావతి - తో నుదయుండు
మణిమేఖల పయిని - మనసుపోయెనని ౮౦

చనవునఁదెల్ప వ - సంతమాల విని
మాధవితోఁ జెప్ప - మఱుఁగున వింటిఁ
గావునఁ దద్రథా - రావమే వినఁగ
వచ్చెడి నెటకుఁ బో - వచ్చును నాకు
నని యమృతంబు చే - దనిపించు మధుర ౮౫

వాణి యనఁగఁ, గీర - వాణి సుతమతి
విని మేఘరవమును - వినునెమ్మివోలె
నై దాని స్ఫటిక గృ - హమ్మున నునిచి
తలుపు గడియవైచి - తలరకుండుమని
యొనిమిది వింద్ల ద - వ్వున నుండునంత ౯౦

విరులపై కిం దృష్టి - పరపుచువచ్చు
యువరాజు కని యిట - నెవరును లేర
యొకవంక నొంటిమై - నున్న నీమనసు
మెచ్చువచ్చెను మణి - మేఖలతోడ
నరుగుదెంచితివంచు - నెఱుఁగంగనయ్యె ౯౫

స్మరవేదనఁబాసె - యరసినదోకో ?
పంటమై యింపారు - పలుకులు పండ
మొలవేయ ముత్యాలు - మొలకలెత్తినవె ?
కన్నులు చెప్పఁడాఁ - కం బాఱి యీఁటెఁ
దలదన్ని విభ్రాంతిఁ - గొలిపెడి మదను ౧౦౦

నేఱు లక్కోరులై - యలరిన వేమి ?
తపసుల వనము ని - త్తఱి వీడి యిటకు
నీ చెలి రాఁగత - మేమి తెల్పుమన
ద్వారమే లేని పా - తాళ గేహమున
నగపడ్డకై వడి - నక్కిలి పడుచు ౧౦౫

సుతమతి యిట్లను - క్షోణీశతనయ !
జవ్వనమందె ము - సలి వేసమూని
యిరువుర తగవులఁ - దెఱఁగు గావించు
చోళవంశజులకు - సుశాంతి విజ్ఞ
తయు నై జనుగఁ దమం - తన వచ్చుచుండ ౧౧౦

వనితలు మీకు నే - ర్పఁగ వలసినవి
కలవె ? యట్లయ్యు నొ - క్కటి సాహసించి
చెప్పఁ దలంచితిఁ - జెవి యిచ్చి వినుము
కర్మంబె ఫలముల - కారణంబగును
వాసనవస్తువుల్ - వదలి దుర్గంధ ౧౧౫

భూయిష్ఠములు కల్లు - పొల మొదలైన
క్రుళ్ళువస్తువులచే - రుగ్జరా మరణ
నిలయమైయున్న దే - సని పెంచు టరయ
విజ్ఞానఘనుల వి - వేక లక్షణమె ?
నిఖిల బంధములకు - నెలవు కీడులకుఁ ౧౨౦

బాలము నాగములకుఁ - బుట్టకై వడిని
దీర్ఘకోపమునకు - స్థిరనివాసంబు
చింత యోచనము మూ - ర్ఛిల్లుట యేడ్పు
మనసునఁ బుట్టి దా - నినె వశపఱచు
కొనునవి మనుజుల - తను విట్టి దనుచు ౧౨౫
నెఱిఁగి యవ్వలిస్థితి - పరికింతు గాక
యని యామె పలుకు నిం - పారు పలుకులు
ములుకులై చెవులలో - పలఁ జొరుమున్నె
పటికగీమున నున్న - పగడంపుఁ బ్రతిమ
యువరాజు కన్నులఁ - జవులూరఁ బడియె ౧౩౦

## ౫. మణిమేఖలా ప్రత్యక్షము

ఉదయుఁడు కన్నలే - యుదిరి పూఁగొమ్మ
కళుకు దిక్కులకేగు - కాయముల్ గలుగు
విను బ్రిమ్మరులు మది - విభ్రమ మంద
పటికంపు జవనిక - పై నుండి తీసి
ప్రతిమ యాటాడిన - భార్గవివోలె ౫
నైదు బాణములు న - నంగుఁ డేయంగఁ
జిత్తంబునం గాఁడ - జిత్రకారుండు
తలఁచిన యదివోలెఁ - దనరిన తన్వి

మణిమేఖల యగుట - మదిలోనఁ దెలిసి
స్ఫటిక గేహమ్మున - ద్వారమ్ముకొఱకుఁ ౧౦
జుట్టి తడవివచ్చి - సుతమతితోడఁ
దెలియఁజిత్రకు నేర్పు - దెసలకుఁ బరవెఁ
ప్రకృతి యెట్టిదగు నీ - ప్రతిమకుఁ జెప్పుమ
యనఁ గ్రౌంచగిరిఁ దొలఁ - చినవానిఁబోలు
నీ గోము టందంబు - నేత్రాలఁ ద్రావు ౧౫

నదికాదు విధివశ - తం దపస్వినిగ
శాపశరగ మార - జయినిగ నయ్యె
నని సుతమతి తెల్ప - నయ్యాదనందు
పొంగిన వెల్లువఁ - బోవ నీకాఁచు
కట్టయొక్కటి భువిఁ - గలదేమి ? యరయ ౨౦

వలపు మీఱిన మది - నిలుకడ గలదె ?
యోగ్యయయిన నాక - యోగ్య తకన్య
యోగ్య కారాదని - యుదయుఁ డీరపను
మరలుచు జైనుల - వర నిలయమున
విద్యాధరుఁ డొకండు - వీడె నిన్నుచుచు ౨౫

పలువురు పలికెడి - వార లచ్చోటు
వదలి యీ చెలువతో - వచ్చు కారణము
తెలుపుమ యనఁగ నా - తెఱవ యిట్లనియె

ధరణి వర కుమార ! - చిరజీవి వగుము
చెడుత్రోవ లెదలోనఁ - జేరకుండుతచు 30

మది నిలకడగల - యూ తల్లి నీఁగు
కొన్నవాఁడు మఁదిమి - గొన్నాఁడు వ్రతము
లొనరించు వాఁడగ్ని - హోత్రి మాతండ్రి
తొలిబాము ఫలముచే - దూఱు పెండ్లియగు
నన్నుగానక చింత - నవయుచు రోసి 35

కులసతుల దోసఁగు - దొలఁగింపఁ దలఁచి
కన్యాకుమారి ము - న్గఁగఁగోరి యేగు
విప్రులతోఁగూడి - వెదకుచు వచ్చి
సంగమస్థలియందు - స్నానంబు సేయు
నొత్తరాహాఌల కడ - నారసి నన్ను 40

కౌఁగిలిఁగొని తలఁ - గన్నీటఁ దడిపి
యిచటఁ గల ద్విజాతు - లీసడించినను
నాపైని ప్రేమచే - నాతండ్రి నన్ను
విడఁజాల కీయూర - బిచ్చమెత్తుచును
వసరుచునుండి యీా - నిన యావ్రుకమ్మఁ 45

గడుపున గాయమై - గన్నీరు మాల
కరణిఁ బ్రేవుల కుప్పఁ - గై కొని నడచి
తన కూఁతు రుండిన - తలమని యెంచి

శ్రమణులారా ! మిమ్ము - శరణ మొందితిని
తగని వాఁడని నన్ను - వెగటుఁబడఁ గనక ౫౦

కాపాడుఁడని వేఁడఁ - గై సైఁగఁ జేసి
పొమ్మని వారలఁ - బొక్కుచుఁ బడుచు
ధర్మహృదయులార ! - దయఁ జూడరారె
దెసచెడ్డ దీనుని - తిరిరి కావుండు
అని యగపడువారిఁ - గని బతిమాలి ౫౫

వాడవాడకు మేడ - మేడకుఁ బోయి
యలయుచు నుండంగ - నఱచేతఁ గోర
గలవాఁడు చలువ మొ - గము గలవాఁడు
కావి చీవరమును - గట్టిన వాఁడు
సంఘ ధర్మండను - సన్న్యాసి పట్ట ౬౦
పగట మాఁగతిఁగాంచి - బ్రాఁతితోఁ బిలిచి
మధుర వాక్కులతోడ - మామదిఁ దనిపి
తన పాత్ర నాదు హ - స్తమ్మునఁ బెట్టి
నాతండ్రి యిడుమ మా - నఁగఁజేసి తడవి
తన తల నెక్కించు - కొని బోడలున్న ౬౫

చోటునుంచిన ధర్మ - శూరుఁడు చావు
కష్టమ్ము దీర్చిన - ఘన నాయకుండు
సంఘ ధర్మండు ప్ర - సాదించు స్వామి

సహజ సద్గుణగణ - సంపద్యుతుండు
పలు గతు లరసిన - స్వార్థపహితుఁడు 20
పరులకొఱకె మను - పారమార్థికుఁడు
వివిధ జన్మములందు - ప్రేమ గుణమ్ము
వెలయఁజాటిన జాలి - వేల్పు మేలి
సమ్మతిచే ధర్మ - చక్రము జగతిఁ
బరిపరి తెఱఁగుల - దొరలించు కామ 20
జితుని లోకజితుని - శివ చరణముల
వినుతించుటకుఁ గాక - వేఱొండుపనికి
నా నాల్క యొప్పదు - నరనాథ తనయ !
యనుటయు నప్రియ - మాడిన నీదు
చరిత మేనెఱిఁగితిఁ - జనుము నీత్రోవఁ ౬౦
జిత్రావతి వలనఁ - జెందెద దాని
నని యాతఁ డటనుండి - యరిగిన పిదపఁ
బటికగీము తెఱవఁ - బద్మారియందు
వాలుగల్ చరియించు - వగగల దగుచు
వ్రత నియతయుఁ బతి - వ్రతయును కాదు ౬౫
వర్ణరక్షణ లేని - వారకాంత యని
రాకుమారుఁడు కావ - రంబున గేలి
చేసిన యని క్షమ - ర్హింపక వలచి

వెంబడించినది నా - నేటేఁడి యెడఁద
కామస్వభావ మిూ - కరణి యానేమి ? ౯౦

యిట్టులేనియు దాని - యే త్తెఱ చెదుత
మని మణిమేఖల - తన చెలితోడ
ననుచుండఁ బండువు - నాసఁగాంచుతమి
మీఱ వచ్చిన మణి - మేఖలాదేవి
యాయూరి యందలి - యతివ యొకరు ౯౫

వేసంబుగొని మణి - పీఠికఁ జుట్టి
నిలిచి పుణ్యుఁడు నేత - నిఖిల కోవిదుఁడు
లోకవ్రతుం డాది - లోక సేవితుఁడు
తీర్థరూపుఁడు పురా - దివ్యపూరుషుఁడు
ప్రభుఁ డుత్తముఁడు భవ - పాశమోచనుఁడు ౧౦౦

దోసంబు రోసంబు - దొలఁగించు విభుఁడు
కామ విజయుఁడు ర - క్షకుఁడు విజ్ఞాని
చెడునెఱి చెడుపగ - కడచినవాఁడు
అల సహస్రార చ - క్రాంకిత పదుఁడు
అట్టి మహామహు - నట్టి లోకేశు ౧౦౫
వేయి నాల్కలు లేని - వెంగలి నేను
ప్రణుతించు టెట్లని - మణిపుష్పలతిక
యుర్విఁ గానఁగ వచ్చి - యొంటరి యగుచుఁ

దిరుగుచున్న దసంగిఁ - దేవ గాన్పించె
నెఱికచే నొడిఁగి యి - య్యాల మేరదాఁటి ౧౧౦

ముడిచిన నాలుక - మొనకొని చాఁచి
యతిశయ పిఞ్ఛ పు - గారను నతివ
పలు పూలపావడ - యలరు నగత్త
నండజధ్వని గును - నందియ మ్రోఁత
యగు పదములు కోట - యను మణి రశన ౧౧౫

వెదుళ్ళులన్ భుజములు - నెదురెదురైన
కల్పక వజ్రముల్ - గలగుడు లనెడి
స్తనములు చోళుని - పెను మందిరమును
మొగమును తూర్పునఁ - బొడము చందురుఁడు
పడమటఁ గ్రుంకు సూ - ర్యుఁడు నను కుండ ౧౨౦

లములు ప్రసన్న ము - ఖము నొప్పమీఱ
హంసము తనతోడ - నాడి యలసిన
హంసితోఁ దామర - యలరు పూఁబాన్పు
చెదర దాఁపునవంగి - చెలఁగు టెంకాయ
చెట్టెక్కు జక్కవ - చేటి నాధునకు ౧౨౫

సంజ దేలుపఁ గాన - కంజముల్ మేసి
పొదుఁగులు చేఁపఁ దూ - పురు లిలజాతి
త్రోవమున్మ్మ నడంప దూడలఁ దలఁచి

పరుగున వచ్చెడి - ఇసులను క్రేపు
లఱచు చెదరొక్కిన - నగ్నిహోత్రంబు ౧౩౦
విప్రులు పూజించి - వినుతులు సేయ
పలుదివ్వియల నుంచి - పడఁతు లింపులను
క్రొత్తయలంకృతుల్ - గూర్ప వైణికులు
షడ్జస్వనంబును - సంతృప్తిఁ దడవ
గొల్లలు పాంచమిఁ - బిల్లనఁ గ్రోవి ౧౩౫
వాయింప బవరానఁ - బతులఁ గోల్వొప్పు
చెలువలు బంధులఁ - జేరు కై నడిచి
ప్రొద్దును పంపిన - క్రొత్తసంజయును
కొమ్మ పసుపు పూసి - కొన్నవిధాన
జిగజిగి నెగడె నా - నగరమ్మునందు ౧౪౦

## ౬. చక్రవాళము

ఉత్తముల్ దమయెడ - నొనరు దోసమ్మ
బయలగు తెరున - వర్ధిల్లు విధిని
కడు శుభ్రమైన యా - కాశమ్మునందు
సంజ దాటఁగఁ దోఁచు - చంద్రమండలము
కలఁక దోఁపఁ జెదుగు - తోలఁగ వెలుఁగ ౫
వెన్నెలయును వెండి - గిన్నియ పాలు
చిందిన వడువునఁ - జెంగల్వతోఁట

నటనటఁ జేనియు - జోటజోటఁ గాఱు
రూపొందు మెఱుపు తీ - రున నింద్రధనువు
మాడ్కిఁ బ్రకాశించు - మైగలదగుచు ౧౦
భగవాను బుద్ధుని - పాద-పీఠకను
వలగొని వినుతించి - యలయూరనున్న
యొక చేడెరూపమ్ము - నొగి ధరియించి
వాడిన సుతమతి - వదన మీక్షించి
యిట నిలిచితి రేమి - ఘటియించె ననుడు ౧౫
సుతమతి యుదయుని - చొప్పు విన్పింప
యువరాజు చెలువపై - నుంచిన వలపు
మొనసి త్రిప్పఁగ లేక - ముని వన మనుచు
విడిచిన వాఁడింక - వీదిలోనైనఁ
బట్టి పల్లార్పక - వదలఁడు కానఁ ౨౦
బెను వీదిమాని యీ - పెను వని కంచె
పడమటఁ గల చిన్న - వాకిలి త్రోవఁ
బోయి తపస్విలు - పూని వసించు
చక్రవాళము చేరఁ - జనుఁ డట నున్నఁ
గష్టమ్ము లెవ్వియుఁ - గలుగవు పొదఁడి ౨౫
యనియామె వచియింప - నచ్చెరువంది
మారుత వేగుఁడఁగ - మాయలమారి

విద్యాధరుఁడు నీవు - వింతగాఁ జక్ర
వాళమందురు తక్క - వారలు కాటి
కొట్టమందురు దానఁ - గొమరారు నర్థ 30
మేనెఱుంగ నెఱిఁగి . తేని తెల్పుమని
సుదతి వేఁడంగ నా - జోటి యిట్లనియె
నిరులు క్రమ్మెడినైన - నెఱిఁగింతు వినుము
ఈ పురి పుట్టిన - యెడఁ బుట్టు కాదు
దీని ప్రక్కనయుండుఁ - దెఱఁగొప్ప వినుము 3౫
తమ విమానములఁ జి - త్రమ్ముల కరణి
నిలిపి వేల్పులు చొర - నిశ్చల వాంఛ
గొలిపి వారల దించు - కోట వాకిలియు
వరియుఁ జెఱకు సీరు - వనములు మంచి
తీరున నేర్పరుల్ - తీర్చు వాకిలియు ౪౦
వెల్లవేసియు లోన - వెల్పలఁ జిత్ర
ములను తీర్చక యుంచు - వెలుపు వాకిలియు
మడిచిన వా బొమ - ముడి చూపు చూపు
కేల పాశమ్మును - శూలమ్ము మెఱయ
గొప్ప రూపముతోడఁ గొమరారఁదోఁచు ౪౫
భూతమ్ము నిలిచిన - పోడవు వాకిలియు
నను నాల్గు పెద్దనై - తనరు వాకిండ్లు

వెవ్వేలు రక్షణ - విధులతో నొప్పి
తాపస శ్రేష్ఠులు - తపియించు వనము
స్థిర చిత్తులగు వారు - జీవ బలి యిడ ౫౦

వారి తలలు వ్రేల - వంగిన చెట్లు
చుట్టిన బలిపీఠి - సొంపార నెమర
దుర్గాలయంబున - దొరలకు మఱియుఁ
బతులతో సతిసేయు - పతులకు నాల్గు
జాతుల వారికి - సత్తపస్వులకు ౫౫

వెవ్వేల శవములు - వేసిన చోట్ల
గుఱుతింపఁదగు ఱాలు - కుఱు మంటపములు
కంబముల్ కొండల - కరణిఁ బెరిఁగిన
బూడిద కుప్పలు - పొలుచు శ్మశాన
వాటికయును గొప్ప - బలి పీఠములును ౬౦

రాల తిన్నియలు వ - క్రపుఁ జిన్నదార్లు
తోరణ పంక్తులు - ధూమ పుంజములు
చలి పందిరులును కా - వలి వారు తినెడి
మూకుళ్లు కూరుకు - వోవు గుడిసెలు
చలి పందిరులు నెల్లె - డలఁ బర్వి కాల్చు ౬౫

వారలు పూడుచు - వారలు నుంచు
వారు కసవు కప్పు - వారలు నగుచు

పగలు రేయి తెలుపి-పడనీక వచ్చు
వారు కలియువారు-వదలెడి వారు
నొనరించు నెడపడ-కుండు సందడియు ౭౦

పలకలు మున్నగు-వాద్య రావములు
నగ్గి వెట్టుచు గుండె-లదరంగ నేడ్చు
రావంబు మైవీడు-కావి తాల్పులకుఁ
జలుపు పూజలు స్తుతి-సలుపు సందడులు
నింటి వారలు చావ-నేడ్చు బంధుగుల ౭౫

గోడు నక్కల యూళ-గూబల యఱపు
గ్రద్దల యఱపు మ-రణ మందువారిఁ
బిలుచు రాబందుల-పిల్చిన రవము
శవములఁ దినెడి కో-ర్నవ గండ్ల యులివు
నాఁడేళ్లు మెదడుకై-యారవించుటయుఁ ౮౦

గడలి ఘోషమ్మును-కడు క్రిందు పఱుప
బూరుగు కానుగు-మోదుగు తాండ్ర
తుమ్మజెముడు వెలి-తుమ్మవే మిప్ప
ప్రాఁకులు దట్టమై-యాఁకలి గొన్న
ప్రేత భూత పిశాచ-వితతులు మొగులు ౮౫

క్రమ్మ కొమ్మల బాగి-ప్రాకుల గములు
క్రొవ్వు మాంసముదిని-ఘోషమొనర్చు

గ్రద్దలః గూబలు - కాకంబు లాది
విహగంబులు వసించు - వెలగ బ్రాఁకులును
కాపాలికులు కలం - కము లేక వంట      ౯౦

సలుపుకొనుచు నుండు - జమ్మి బ్రాఁకులును
కృశులైన వ్రతులు ప - గిలియున్న తలల
పునుకలఁగొని హార - ములు గ్రుచ్చుకొనుచు
గూర్చున్న రావి గ్రాఁ - కల రచ్చగములు
పీనుఁగు దిండులు - పిశితంబు క్రొవ్వు      ౯౫

కడవల నించి యొ - క్కట విందుసేయు
వెలి మంటపమ్ములు - విఱుగు పాడెలును
చినిఁగిన పేలికల్ - చెదరిన పూలు
వహ్ని ఘటంబులు - వడ్లు పేలాలు
పాడెలు పునుకలు - వాతి బియ్యంబు      ౧౦౦

మురిసిన కడవలు - మూకుళ్లు నెమ్మ
లలరులు వెంద్రుక - లన్ని చోటులను
పరవి తపస్వులు - బాలెంతరాండ్రు
ధనికు లశక్తులై - మనెడి బాలకులు
యువకులు ముసలు - లొనఁగు వారనుచు      ౧౦౫

యముఁడు చూపక చం పె - ననుచుండు కాటఁ
గాకులు కన్నులఁ - గవి పెకల్చుటయు

నక్కలు తినుటయుఁ - గుక్క లీడ్చుటయు
గ్రద్దలు పీఁకుట - గనియు మదించి
సంపద యను కల్లు - మంపున నాని ౧౧౦

పాడి తలంపక - పరుగాడు వారి
కంటె మూఢాగ్రణుల్ - కలరె లోకమున
నచటికి శౌర్జలుఁ - డనువాఁడు నగర
మని యెంచి యొంటరి - యై పోయి మాంస
మెమ్ములు నెత్తురు - గ్రమ్మిన మేను ౧౧౫

లివి యని కనికర - మెనయు వారలకుఁ
జూటి లత్తుక గల - చరణమ్మునోటఁ
గఱచి నమలి రోఁత - గనక సమ్మోద
మున గ్రమింగి చేయు జం - బుక రావములును
వలుఁద పిఱుందుల - నలరుచుఁబొడిచి ౧౨౦

తిని చేయు గ్రద్దల - పెను నినాదములు
కటకంబు పూనిన - కయి యొక్క కుక్క
కవ్వి కొఱికి తిని - కడు మోదమంది
ప్రబలంగఁజేయు తో - రపు మొఱుఁగులును
చందన మలఁదిన . జనపతి పత్ని ౧౨౫

గబ్బి గుబ్బలఁ గప్వి - కఱచి పిసాసి
నములు చప్పుడు బూది - యమరు రంగమున

సార్థకమైన దే-హము మృదంగముగ
నతివ యొక్కత తల-నఱచేతఁబట్టి
యాఁడు భూతమొకటి-యాడు చిట్లనియె ౧౩౦

కెరలు మేఘమొ? యిది-కేశపాశమ్మొ
మెఱసెడి వాలుగ-మీలో? నేత్రములో?
ఇది నవ్వుఁ బువ్వొ? సొ-రెనయు నాసికయొ?
మోదుగు పూవొ? కె-మ్మోవియో? యివ్వి
మొల్లలో? ముత్యాలో?-మురువైన పండ్లో? ౧౩౫
యని తలంపక సుంత-కనికరింపకయు
లోఁడి యూడఁగఁదీసి-లొటుకున మ్రింగి
కుప్పించి దుమికె య-కుంఠితామోద
మున మేను మఱచి యు-బ్బుచు నాడు నాట
గని శార్దులుఁడు వెఱ-గొని దానిచేత ౧౪౦
మీఁటి పట్టఁగఁబడి-మిణుకరించుచును
దిక్కులు చూచి య-దరి బొబ్బలిడుచు
మాతల్లి కొనదీ-మసనంబు నంద
యీ పిశాచంబున-కెర యైతి నేఁటి
కని యేడ్చి పరువిడి-తన తల్లిమెదుటఁ ౧౪౫
బడి చావఁ గని యేడ్చి-పాఱునితోడ
గౌతమి యిట్లనుఁ-గన్నులు లేక

తనయుఁడే కనులుఁగాఁ - గను ముదుసళ్ళల
మహిమ్మనఁ గాన కి - మ్మాడికి నొనర్చె
నది పిశాచమ్మొ? భ - యద భూతమొక్కొ? ౧౫౦

మండపములు గొప్ప - ప్రాఁకులు రచ్చ
కూటమ్ము లొప్పారు - కోటను గాచు
చుండు చంపావతీ! యురవు వీడితివొ?
చేతఁగాదో? యని - చింతించి పొక్కి
తనయుని మేను ఱొ - మ్మున నదిమికొని ౧౫౫

కాటి వాకిట నిల్చి - క్రందుగ నేడ్వఁ
గావలి వాకిటఁ - గడు దుఃఖమంది
నడిమి చీఁకటి రేయి - నను పిల్చువెవరు?
కతమేమి? యేమి కొ - ఱంత ఘటియిల్లె
నని చండ భాను కాం - తిని విలసిల్లి ౧౬౦

చంపావతి యడుగఁ - జామయుఁ గాంచి
యేమియుఁ దెలియని - యీ బాలకుండు
మసనమ్ము చేరఁగా - మరులు భూతమ్మొ?
శాకినియో? పిశా - చమొ? పిన్నవాని
ప్రాణమ్ములను నోట - వైచికొన్న యది ౧౬౫

చూడుము నిదురించు - చొప్పు గాన్పించె
వీనిఁ గావుము యని - వేఁడు నాసతికిఁ

జంపావతి యనియెఁ - జానరో! వినుము
మరులు భూతమ్ములు - మఱి పిశాచములు
నెవరి ప్రాణమ్ముల - నేఁ గొనలేవు ౧౭౦

నీ తనయుం డేమి - నేరక రాఁగఁ
బ్రాక్కర్మమే వాని - ప్రాణమ్ముఁ దీసె
దుఃఖంబు మానుమా - తొయ్యలీ! యనుడుఁ
దల్లి జీవము గొని - తనయు జీవముల
నిమ్మంధుఁడగు తండ్రి - నతఁడు కాపఁగలఁ ౧౭౫

డనఁగఁ జంపావతి - యనుకంప తోఁపఁ
గర్మ వశత జీవి - కాయంబుఁ దొఱఁగి
వేఱు తనువు నొందు - విశయమ్ము లేదు
తనయు ప్రాణము లిచ్చి - తల్లి దుఃఖమ్ము
దీర్చుట నాచేతఁ - దీరెడి పనియె? ౧౮౦

చింతింపకమ్మ! చే - సిన కర్మఫలము
లనుభవింపక తీఱ - వని వినలేదె?
నరపతి కొఱకుఁ బ్రా - ణము లిచ్చువారు
వేల కొలఁది లేరె - పృథ్వీ తలమున?

రాజ సమాధు లీ - ప్రక్క వేవేలు ౧౮౫
కలవు చూడుము వగ - నలఁగుట విడుము
పాదమున గౌతమి - పోవ కెల్లనియె

సురలు నరులు కోరు - వరము లిత్తురని
ఘోషించుచున్న వి - గురు పురాణములు
ఘనదేవతవు నీవ - కరుణింప కున్నఁ ౧౯౦
బ్రాణమ్ము లిచటనేఁ - బాయుదు ననఁగ
నలువయుఁ బోవు ప్రా - ణము లీయలేఁడు
చక్రవాళమున వా - సము చేయు వేల్పు
లీఁ గలరేని యే - నీయంగఁగలను
[1] అంగమ్ములేని బ్ర - హ్మలు నాల్గు తెగలు ౧౯౫
రూపున్న పదియు నా - ఱుగురు బ్రహ్మలును
దేవ గణము లాఱు - తెగలును చంద్ర
సూర్యులాఱు తెగల - సురగణములును
పలు తెగలై యున్న - ప్రావేలుపులును
నెవ్వగల్ కుడుచు [2] నె - న్మిది తెగలైన ౨౦౦
నరకవాసులు గగ - నమున రిక్కలును
గ్రహసమూహమ్ము న - క్షత్రంబు లెల్లఁ
దనలోన నడఁగించు - కొనియున్న చక్ర
వాళంబు నందున్న - వరదాతృవరుల
నెదుట నిలిపి చూపి - యామె దుఃఖమ్ము ౨౦౫

1. చూ. ప్రస్తావన.

2. నరకములు 8 తెగలు :— మహానిరయము, రౌరవము, కాలసూత్రము, సంజీవనము, మహావీచి, తపనము, సంప్రతాపనము, సంహతము.

వదలుఁ గాక యని చం - పావతి పలుకు
పగిదిని సర్వ దే - వతలును పలుక
వినియామె తనచింత - వీడి సుతునకుఁ
జరమ క్రియలు చేసి - చన్నయాపిదపఁ
జంపావతి పిలువఁ - జను దెంచినట్టి ౨౦౦

వేలుపు గమి చక్ర - వాళ మందున్న
మేరువు కడ సప్త - మేదినీధ్రములు
వానిలో నొక్కొక్క - దానిని చుట్టి
యున్న సప్తాంభోధు - లొగి వానిఁజుట్టి
యలరు నాలుగు దీవు - లందు నొంచారఁ ౨౦౫

జతురబ్ధి వేష్టిత - జగతియై వేయి
దీవులు చుట్టి సం - దీపించుచుండు
నేరెటి దీవిని - నెలకొన్న జీవ
వితతులఁ దెగలుగ - విభజించి ని
కాయముల్ మట్టి చేఁ - గావించి మయుఁడు ౨౧౦

విభజించి బొమ్మల - వెవ్వేఱునుంచు
చక్రవాళ మిది ని - శ్చల చిత్తలార!
ఇది కాటి ప్రక్కనే - యొసఁగిన కతన
నోలికి మెట్టని జనుల్ - పలికెడువారు
దీని వృత్తమ్మిది - తెలిపితి ననుచుఁ ౨౧౫

జలచిత్తమై యగ - చాట్లొంది పుట్టు
వారి జీవిత మిట్లు - వఱలెడిదంచు
మణిమేఖల తలఁచె - మణిమొలనూలి
పేరి వేలుపు వచ్చి - కారు చీఁకటిని
యొడలు మఱచి నిద్రఁ - బడు సుతమతిని
వదలి యవ్వలి దాని - మది చొక్కఁ జేసి
యలమి యెత్తికొని వి - యద్వీథి నేగి
ముప్పది యోజన - ములు దాఁటి యవల
వలదెసఁ జని మణి - పల్లవ మందు
మణిమేఖలను డించి - మణిమేఖలాంబ ౨౩౫
దీవి యందే తాను - దిచ్చమోముయ్యె.

## ౮. మేలుకొలుపుట

మణిమేఖలాదేవి - మణిపల్లవమున
మణిమేఖలను వీడి - మఱేఁగిన పిదపఁ
బడఁతుక నుద్యాన - వనమునఁ గన్న
యుదయుఁడు మిక్కిలి - యుడికి చింతిల్లి
యీ రేయి కడవ నా - యింతి నాచేతి
లోనిదే యని యెద - లోని తాపమునఁ
బడక పొందక కుందు - వాని యెట్టెదుటఁ

దోఁచి రాజకుమార ! - దొర ధర్మవిధులఁ
బొరపడునేని యీ - ధరణి పాలనము
కుంఠితమై చెడుఁ - గురియదు వాన ౧౦
వాన కురియదేని - ప్రాణులు చచ్చు
జీవు లన్నియుఁ దన - జీవంబు లనెడి
న్యాయంబు రాజ పుం - గవులకుఁ గలమి
తపసి వృత్తి వరించు - తరుణిపై నుంచు
వలపు వదలుమని - వనమునఁ జొచ్చి ౧౫
చొక్కి నిద్రించు నా - సుతమతి లేపి
యీ నగరమ్మున - నేఁటేఁట జరుగు
నింద్రోత్సవము గాన - నేగుదెంచితిని
చెలువ నీ చెలిపేరఁ - జెలఁగు వేలుపను
బుద్ధధర్మప్రధానఁ - బోవు హేతువులు ౨౦
కలిగెఁ గావున నీదు - చెలిమిక త్తియను
మఱపించి కొనిపోయి - మణిపల్లవమున
నుంచితి నయ్యమ - యొగిఁ బూర్వ జన్మ
మెఱిఁగి యిటకు నేఁటి - కేడవనాఁడు
వచ్చి చేరును శంక - వలదు నీ కామె ౨౫
వేఱు రూపమ్మునఁ - జేరినఁ గాని
జన్మనై జమ్మ దాఁ - చఁగఁ గాదుగానఁ

దెలియంగ వచ్చు నీ - దేశంబు చేరు
తతి సిటఁదోఁచు చి - త్రంబులు పెక్కు-
కలవు మాధవి కిట్లు - కలిగిన తీరు 30

నుత్తమయగు పుత్రి - యొందిన విధము
నాదు వృత్తాంతంబు - నయమునఁ జెపుమ
జలధిలో నున్న మా - యిలువేల్పుపేరు
బాలకుఁ బెట్టంగ - వలయున యంచుఁ
గోవలుఁ డాపేరు - కూఁతున కుంచు 3౫

నిసి మారుఁ డమ్ముల - వెసఁ బొఱవైచి
వేసర, బమ్మెర - నాసలఁ గోసి
తపసి వృత్తింబూను - తనయను గంటి
వని స్వప్నమున వలె - నంటిఁ దెల్లముగ
నిదియు నామెకు జ్ఞప్తి - పొదలఁ దెల్పుమని ౪౦

మణిమేఖలాదేవి - మఱుఁగైన యంత
మదిఁ గుమారిలి సుత - మతి లేచి యచట
నాటకాచార్య గ - ణంబుల తోడఁ
బద్ధతు లెఱిఁగిన - వారికిఁ గమల
వర్తనముం జూపి - నర్తన చలుపు ౪౫
రంగ మండలి నటీ - రమణుల తోడ
వాని కంగములగు - వీణాదికములఁ

దోడుగాఁగొని పెక్కు - తోయంబులైన
పాటల నభ్యాస - పఱచు వారలకు
ననువుగా శ్రుతిగూర్చి - యనుగమించుచును ౫౦
పాడి యనుభవించి - పదపడి తొలఁగఁ
ద్రోచిన కతన వే - దుఱు గొన్న కరణి
విరహా వేదనచేత - వేఁగుచుఁ గూర్కు
లేక తన్మయతతో - లేమలు దిరుగ
ఫలము లేని విటుని - పసిఁడి వెలంది ౫౫
యిచ్ఛగింపక కన్ను - లెఱ్ఱగాఁ జేసి
తెలిపిన యాసైఁగ - తెలియక యల్కఁ
గల్ల నిదురవోవు - కలుకులఁ బూల
పాన్పునందు విటులు - బతిమాలి తడవఁ,
బిల్లలతోఁ జేరి - వెసఁ బరువిడుచు ౬౦
నాడుచుఁ బిన్నతే - రీడిచి యలసి
పడకల నిదురించు - పంచాయుధ ధరు
లగు ముద్దుపిల్లల - కొగి ధాత్రిజనము
బడిసి ధూపమువైచి - వడి నిద్రపుచ్చ,
నీటి పులుంగులు - తోఁటపిట్టలును ౬౫
పారువములును జి - హ్వాల నడంచుకొని
కౌతుకానందముల్ - కడవట్టి యుండఁ

జెలఁగు వాద్యములు క - న్నులు మూసియుండ
నూరి వారెల్లరుఁ - గూరుకనొందు
నడురేయి రాడ్భవ - నంబునఁ గంచు 20

పలకపైఁ గొట్టు గం - టల చప్పుడులును
వ్రతయుత నియతోప - వాస శ్రమమున
వినుతించి భగవానుఁ - బిలుచు పిల్పులును
పెద్దవీదుల సందు - వీదుల నగర
రక్షకుల తుడుము - రవమును మఱియు 25

కడలి తీరమున నౌ - కా వణిగ్వరులు
కలిపిన పలు రక - ముల యాసవములు
త్రావి మైమఱచి గీ - తమ్ములు పాడి
యార్పు కేకలును, వేఁ - పాకు తెల్లావ
లిడిన ధూపము కేలఁ - బడఁతులు పట్టి 30

పురుటింటి బాలెంత - పూవుఁ బోణులకు
* జలకంబు సేయించు - కలకలములును,
ధీరత్వమున్నట్టి - వైరులు లేమి
వీర వరేణ్యులు - చేరి యానగర
భూత చతుష్కము - బూజలు సేసి 35

* బిడఁగన్న బాలెంతలు పదియవ నాఁటిరేయి కొలఁకున స్నానము చేయుట విధి. ఆప-గృహ్య-౧౫ ఖం ౮ సూ.

యవనీశునకు జయ - మగుఁ గాక యనుచు
బలులిచ్చి సేయు కే - కల చప్పుడులును
యువకులు బాలెంత - లువిద లశక్త
బాలురు శూలార్తి - పడువారు పెద్ద
కుటుంబులు గలవారు - గురు మాంత్రికులును ౯౦

మండప భూత మి - మ్మడి దయతోడ
నేతెంచి బలి గ్రహి - యించుఁ గాతమని
చేయు సందడులును - చెలఁగి యొండగుచు
ధ్వనియింప విని మదిఁ - దటమట పడుచుఁ
గటికి చీఁకటి నొంటి - గాఁ దోఁటనుండి ౯౫

పడమటఁ గల చిన్న - వాకిలి త్రోవ
వెలలి దైవము ప్రేమఁ - దెలిపిన చక్ర
వాళంబు వాకిలి - పలువురు చొరఁగఁ
దీసి యుండఁగఁజొచ్చి - తెఱవ యచ్చోటఁ
గ్రాలెడి లోకోప - కారికా మండ ౧౦౦

పము చేరి తానొక్క - ప్రక్కనున్నంత
నట గొప్ప కంబంబు - నందు హేతువులు
చూప మయుఁడు చెక్కు - సుందర ప్రతిమ
సుతమతి భ్రమియించి - చోద్యంబునంద
దివ్యవాక్కుల తోడఁ - దెఱవ కిట్లనియె ౧౦౫

రవివర్మపుత్రి ! తు - రగసేన యొప్పు
దుర్జయుదేవి ! నీ - తోడి దా తార
చావ దుఃఖించి దం - తావళ మెదుటఁ
బడి ప్రాణములు బడి - వదలిన దాన!
చంపానగరమందు - సద్ద్విజుఁడైన ౧౧౦

కౌశికు కూఁతురా ! - కడఁక నీపురము
మారుత వేగుతోఁ - జేరి యక్కయగు
తారతోఁ గూడిన - వీరవైనట్టి
సుతమతీ! విను పిన్న - సోదరి లక్ష్మి
నేఁటికి నేడవ - నాటి నిశీథ ౧౧౫

మునఁ దన పూర్వప - ర్తనముతో నీదు
జన్మ వృత్తాంతంబు - చకచన యెఱిఁగి
వచ్చు నంజకు మన - వనజాత నేత్ర
సుతమతి హృదయమ్ము - స్రుక్కుచు వడఁకఁ
గావలి వారలు - కను మూసి ~~కూర్క~~ ౧౨౦

మృదు తల్పముల కనుల్ - మిడియుచు నార్చ
సంకు లర్థము లేని - చప్పుడుసేయ
విజ్ఞు లర్థముతోడ - వేదముల్ చదువ
వారణ ఘటలు ఘీం - కారముల్ సేయఁ
గొక్కురు కోయంచుఁ - గోళ్ళు కూపెట్ట ౧౨౫

గుజ్జముల్ సకిలించి - కుదులుచు నాడఁ
బులుఁగు లుచ్చావచ - ముగ రొదసేయఁ
గాంతల గాజుల - గలగలల్ లేవ
దేవతా బలులు సం - తృప్తిగ నడవఁ
గలప మమ్మొడివారి - యలరుల పూజ ౧౩౦
లలరారఁ జర్మ వా - ద్యమ్ముల శ్రుతులు
సొంపుగఁ గూరిచి - యింపుగ లేవ
దాతల మొగసాలఁ - దగు ధాన్యరాసు
లతిశయింపఁగఁ బ్రాణి - తతి నిద్రలేవఁ
గారు చీఁకటి గుంపు - కడలకుఁ దోలఁ ౧౩౫
గడలిలో నుండి య - ర్కుఁడు మొలతేర
నమ్మ్రేటుంగొన్న - యాఁడు నెమ్మివలెఁ
బరితాపమందుచుఁ - బురమునఁ జొచ్చి
వీధి ప్రక్కనపోయి - వెలఁది మాధవికి
జరిగిన సంగతి - సరవిఁ జెల్పుటయు ౧౪౦
మణిఁ గోలుపడిన జి - హ్మగమును పోలెఁ
దన కూఁతు లేమికిఁ - దపియించి కుంది
మాధవి యటమట - మఱుఁగుచు నుండె
నుసుఱుల నీఁగిన - యొడలి కై వడిని
సుదతిని వీడిన - సుతమతియుండె. ౧౪౫

## ౮. మణిపల్లవము

ఇచ్చట సుతమతి - యిట్లుండ నచట
మణిపల్లవమ్మున - వనధి తీరమున
నలలు మోఁదుచు నున్న - పొలమున యందు
సంకు పుర్వ్వాలు కెల - సంబున దున్న
ముత్తెముల్ పండిన - పొలమున యందు ౫
పగడాలతో మంచి - యగురు గందంపుఁ
దరువుల దొరలించు - తరఁగలు పరవు
ధారణిఁ బులిగోరు - లారె పూఁవులును
విరిసి మొగలిపొదల్ - వికసిల్లి యుడును
నందల్లి కలువ పూ - లందంద యెండి ౧౦
తుమ్మెదల్ ఝుమ్మని - క్రమ్ముచునుండు
మడుఁగు దరిని మెల్ల - మల్లెలు పొన్న
పొగడలు పొలుచు గు - బురు జొంపములను
ఎండ చొరక పూవు - లెలరు పందిరిని
అలల మోఁదులఁజేరు - తెలి సైకతమున ౧౫
పూల పడక యందు - పొసఁగ నిద్రించి
లేచి నెలఁత చెలు - ల్లేక చుట్టములు
లేని క్రొత్తగు చోట - మేను దాల్చిన
పాణివలెను చెలిం - బరిచయ స్థలము
కానక కని యెఱుఁ - గని వానిఁగాంచి ౨౦

జలధిలో నొక ప్రదే-శమ్మని తలఁచి
తపనుండు పొడముచుఁ-దపియించి కాంచి
యుపవనంబున నిది-యొక భాగమేమొ?
సుతమతీ! యెందు డాఁ-గితివో యెఱుంగ
కలయొ? విభ్రాంతియో?-మెలఁకువ యొక్కొ? ౨౫

ఎడ నడుంకుచు నుండె-నెడరు గూర్చితిని
ఇదె యుంటినని ధైర్య-మీయవు వచ్చి
యూఱట గొను పలు-కొకటేని యనవు
తమము తొలంగె మా-ధవి యడలొందు
విడిచి యేగితివేమి?-వెత మాన్ప రమ్మ ౩౦

విద్దెలు నేర్చిన-విన్నాణివీవు
వంచన చేసితో?-భయమందుచుంటి
నొంటిమైనని చెలి-యుమ్మలికింప
నలలలో నూఁగెడి-పులుఁగులు పరపు
అెక్కల వక్కలు-రేఁగు తుమ్మెదలు ౩౫

వ్రాలి ముడిచితేనె-గ్రోలు తేఁటులును
అంచపుం జొడయుఁడై-యట నలరారఁ
బలు రంగు లడరు ప-క్షులగమి యొకటఁ
బగతేంద్రు విడిసిన-పాళెంబుఁబోల
నలలతోడి జలంబు-కలయిక వలన ౪౦

నెమరెమ్మరై యొప్పు - నిసుక తిప్పలును
శేవు శేవుగ నెల్ల - రేవులు చుట్టి
తనవారిఁగానక - తపియించి కుంది
విరులు తుఱుము నెఱి - కురుళ్ళముల్ చెదరి
వెనుక వ్రేలఁగ నట - విసువక తిరిగి ౪౫

ఎలుఁగెత్తి పెద్దగాఁ - బిలిచి వేసరుచు
నెన్నవ లెన్ని పె - ల్లేడ్చుచుఁ దండ్రిఁ
దలఁచి మహిమ్మావిధిఁ - దలరింపఁజేయు
దుష్ట కర్మము మిమ్ము - దూపిల్లఁజేయఁ
దల్లికన్నగి తోడఁ - దరలి కష్టించి ౫౦

వేఱుదేశము చేరి - పెనుకత్తి చేతఁ
దెగి విహ్వాలించిన - దివ్యతేజస్వి !
ఓ యని పలవించు - చున్న యయ్యోదుః
దెసలకుఁ గాంతులు - దీపిల్లఁజేసి
భూస్థలిపయి మూఁడు - మూరలులేచి ౫౫

దశహస్త పరిమితి - దశదిశలందు
శాస్త్రోక్తమైన సు - స్ఫాటిక వలయ
మేర్పడి మేల్పడ్డ - యెడఁ దమ్మిచదర
మలరి సర్వజ్ఞున - కమరిన యచటఁ
దరులు వాసన లేని - విరుల నీయవుచు ౬౦

పులుఁగులు పఱచుచు - నలివు సేయఁవును
అమరేంద్రుఁ డుంచిన - యమ్మణి పీఠిఁ
గాంచు వారల పూర్వ - కర్మవృత్తముల
వారికిఁ దెలుపు ప్ర - భావంబు గలది
నాగలోకం బేలు - నాథ ద్వయంబు  ౭౫

ఒక చోటఁ బుట్టుట - యొకట వర్ధిలుట
చూడక తమపట్టు - వీడక వైర
వహ్ని యెదల రాఁజి - బలుపోగ లెగయఁ
గనులు జేగుఱు గాఁగ - ఘనసేనఁ గొనుచు
ననిసేయఁ బూనిన - యానాఁడు మీరు  ౭౦

కినుకలు వీడుండు - కీడు వల్దనుచు
బుద్ధుండు బోధించు - పూత ధర్మముల
నుపదేశ మొనరుచు - నురు గుణనిధులు
పూజించు చుండిన - పుణ్యపీఠంబు
మణిమేఖలకుఁ గనం - బడియె నయ్యెడను.



౯. పూర్వజన్మ వృత్తాంతము

అటఁ బీఠముం గని - యంత నాచెలికిఁ
దెలియకయే కేలు - తలమీఁది కేగ
నానంద బాష్పంబు - లలర వెల్వడియె

ముమ్మాఱు వలగొని - మ్రొక్కి నుతించె
మొగులు తోడ మెఱుపు - పుడమికి దిగిన ౫

పగిదిని సాష్టాంగ - పడి లేచి పూర్వ
జన్మవృత్తమెఱింగి - శయములు మొగిచి
* శుద్ధ తపస్వీ! వి - శుద్ధ విజ్ఞాని!
♦ కాయగట్టను కొండ - కాలువ దరిని
నీవు పల్కిన దెల్ల - నిజమని యిపుడు ౧౦

తమ మీఁగ నెఱిఁగితిఁ - దత్త్వవిత్తముఁడ!
గాంధార భూమి భా - గమ్మునఁ బూర్వ
భారమ్ము నీఁగఁగాఁ - బాలించు హస్తి
పతి బావమఱఁదియౌ - బ్రహ్మధర్ముండ!
రాజున కీవు పె - న్రాగంబుతోడ ౧౫

ధర్మంబు బోధింపఁ - దగనేగి నేఁటి
కేడవ నాఁడు నీ - యిలయందు గొప్ప
భూకంప మొకసద్దు - పొలువేది నీదు
నగరంబు చెడి పడు - నాగలోకమునఁ
గాన నీ నగరంబుఁ - గడువడి వదలి ౨౦

* బ్రహ్మధర్ముఁడను తపస్వి తనకుఁ బూర్వము వినిపించినవియెల్ల నిపుడు ౘచుటచే నవని సంబోధించి చెప్పుచున్నది.

♦ కాయంగర - అనుదానికి తెనుఁగుచాయ.

వేఱు-చోటికిఁ బొమ్ము - పృథ్వీశ ! యనుడు
నరపతి వెంటనే - నగరంబు వీడి
పసులతో నందఱు - బయలు దేఱుఁడని
యెఱిఁగించి సేనతో - ఋషభపురంబు
వదలి యవంతికిఁ - గదలుచు నడుమఁ ౨౫

గాయగట్టు దరిని - గల విరిదోఁట
విడిసియుండ నచట - వీడు కూలుటను
విని విస్మయం బంది - మనుజ వరుండు
ప్రజలును వచ్చి నిక్ - బ్రణుతించి మ్రొక్కి
కరుణా ధర్మము నూని - కడఁ బ్రేమలోక ౩౦

నాశము తొలఁచు ది - నమ్మునఁ గడలి
మ్రోఁత వంటి రవళి - పొనుపడకుండఁ
బగటు యశోధర - నగరమ్ము నేలు
రవివర్మ పట్టపు - రాణి పారాణి
యడుగులు శోభిల్లు - నమృత వతికిని ౩౫

తనయనై శ్రీలక్ష్మి - యనఁగఁ బుట్టితిని
సిద్ధ పురేంద్రుండు - శ్రీధరు పుత్రి
హస్తిపతికి భార్య - యగు సీలవతికిఁ
దనయుఁడై యుదయభా - నుని కిరణంబు
వలెఁబుట్టు రాహులు - వలచి పెండ్లాడి ౪౦

యతనితో నుద్యాన - మందుండి నీదు
పదముల సేవింపఁ - బదునాలు నాళ్ళ
* దృష్టి విషంబను - దుష్టసర్పంబు
హరియించు రాహులు - ప్రాణమ్ము లప్పు
డతనితో విడ కీవు - నగ్నిఁ గూలుదువు ౭౫

ఆవలఁ గతము ల - ట్లై యుంట వలనఁ
బుట్టెదు కావేరి - పూపట్టనమున
నీకొక గొప్ప యం - కిలి గల్గువాఁడు
మణిమేఖలాదేవి - మహితానుకంపఁ
గనఁబడి కటికి చీఁ - కటివేళ నిన్ను ౮౦

గొనిపోయి యొకదీవిఁ - గనియందు షెడుఁ
బాఁపరాజుల కామ - కోపముల్ ద్రోలఁచి
ధర్మ శ్రవమ్ము నిచ్చి - కర్మశ్రవంబు
మూయించి భవపాశ - ములఁద్రెంచు ధర్మ
ముపదేశ మొనరించు - నారుపీఠి కడకుఁ ౮౫

బోయి కేల్మోడ్చి నీ - పూర్వ వృత్తాంత
మెఱిఁగి నేనిట నేఁడు - కఱపు సర్థంబు
జ్ఞప్తి గొందువనఁగఁ - జావు దుఃఖంబు
విని తలరిన మది - విభుని జన్మంబు

---

* దీని దృష్టించవిలిన వాళ్లు మరణింతురు.

వినిపింపుమన నిన్ను - గొని తెచ్చువేల్పు ౭౦
పదపడి తోఁచి నీ - వల్లభుఁ డీతఁ
డని తెల్పి తట్టి వే - ల్పరయ రాదయ్యె
నని యేడ్చుచుండె న - మ్మణి మేఖలయును.

## ౧౦. మంత్రదానము

బుద్ధ పీఠిక యందు - ప్రాక్స్మృతంబు
మణిమేఖల యెఱింగె - మంచిదే యయ్యో
తాఁ బొందిన వరంబు - తగినదే యయ్యో
నని క్రొన్ననం గేలఁ - గొని మింటనుండి
పూలత దిగి భువి - బొలిచె ననంగ ౫
మణిమేఖలాదేవి - మహిఁ గాన వచ్చి
పూర్వజన్మజ్ఞాన - ముం బొంది నిలుచు
మణి మేఖల వినెడి - మాడ్కి నిట్లనియె
జీవులన్నియుఁ జెల్వొ - చెడి ధర్మవిధులు
చెవిఁ జొరనీయక - క్షీణించు తఱిని ౧౦
తగవు నెప్పటి నిల్పఁ - దలపోసి యంత
నర్కుండు తాఁబు మా - అగు కాలమందు
బాలార్కుఁ డొక్కండు - ప్రభవించె ననఁగ
నీవు జనించితి - నీ పాదములకు
సేవలు చేసితి - నీవయి యున్న ౧౫

యీ పీఠమందు నా - హృదయ ముంచితిని
శిరమునఁ దాల్చితి - విరులు చల్లితిని
తోడిఁబడు దుఃఖంబు - చెడుఁగాక యంటి
నని వలగొని పీఠ - మునకుఁ గేల్మోడ్చి
బంగరు లత యొండు - రంగార నిలకు ౨౦

దిగి నిల్చెననఁ బొల్చు - దేవికి నెదుర
నిలిచి కై మోడ్చి నీ - నిండారు దయను
నాజన్మవృత్తంబు - నోజ నారసితి
నా భర్త యెచట ను - న్నాఁడో తెల్పుదువె?
అనుటయు నద్దేవి - వినవమ్మ లక్ష్మి! ౨౫

రాహులుతో నీవు - రాగంబు మీఱఁ
బూఁదోటలో నుండి - పొలయుల్కఁ గొంటి
వలపు వెల్లివిరియఁ - బతి సైఁప లేక
నీ పదములఁ బడి - నిను వేఁడు నంత
[1] సాధుచక్రుం [2] డభవి - సంచారి యాన ౩౦

1. "ఓం మణి పద్మేహుం" అను మంత్రము వ్రాయఁబడిన లోహచక్రము కలవాఁడు. ఆ మంత్రమును జపించుచు దానిం ద్రిప్పుచుండుట బౌద్ధుల యాచారము. ఇయ్యది యిప్పుడు టిబెటునఁ గలదందురు. మంత్రజపఫలము నరకలోకముల దాఁటి నిర్వాణము చెందుట.

2. బౌద్ధులలో బుద్ధిపొందిన వా రాకాశసంచారులై యటనటఁగల బౌద్ధపీఠముల దర్శించి పక్వమనస్కుల కుపదేశముచేయుచుఁ గోరిన వారి కోరికలఁ దీర్చుట వారి యాచారము. అట్టి వారిని చారణులందురు.

లడుగంటఁ గోసిన - యితఁడు రత్నంపు
దీవిని ధర్మంబు - దీపింప నిలిచి
నాతఁడు మధ్యాహ్న - మందావనమున
దిగి కానఁబడ నీవు - దిగులొంది తబల !
మెత్త వడితి పుట్టె - మేన వడంకు ౩౫
సిగ్గు వడితి నమ - స్కృతు లొనర్చితివి
అది గని రాహులుఁ - డా వచ్చువార
లెవరని కోపింప - నెఱుఁగంగ నీక
యతని నోటిని మూసి - యరుదుగా వచ్చు
పావనాత్ముల పాద - పంకజాతముల ౪౦
మ్రొక్కి నుతింపక - మూఁగవై తేల ?
యని భర్తతోడ న - మ్మని పాదములకు
వినతిమైఁ గేల్మోడ్చి - వినుతించి దేవ !
మేము మీమది కెక్కు - మేటి శిష్యులము
కాక పోయిన నిటు - కై మోడ్చి వేఁడు ౪౫
దాసుల కోర్కుల - దయసేయఁ దగరె ?
నీరు నన్నంబు నిం - పారంగఁ దెత్తు
భుజియించి మాసేవ - పూరింపుఁ డనుడు
నతఁడు సమ్మతిచూప - నర్మిలిఁ దెచ్చి
యిడితి వాతఁడు భుజి - యించి యనుగ్ర ౫౦

హించిన పుణ్యము - దెట్లు నిన్విడు ?
నీజన్మములఁ ద్రెంచి - నెగడును గాక
ఉపవనమున ఛాయ - నుదయుండె పూర్వ
భవమున రాహుల - ప్రభుఁ డిది నిజము
అతనిపైఁ బ్రేమ నీ - కగుట నై జంబ ౫౫

యైనను తాపి వ - డ్లపి యుప్పుడమునఁ
బడిన పోలిక యయ్యె - వనిత ! యిమ్మెడల
ధర్మమూలమగు చి - త్తము నీకు దిట్ట
పడుటకై నేన యీ - పగిదిఁ జేసితిని
నీ యక్కలై మున్ను - నెగడిన తార ౬౦

వీర యన్వారలు - పృథ్వీతలమున
కచ్చయ మెలు భూ - కాంతు దుర్గమున
కనుఁగు దేవేరులై - యలరిరి వారి
గూడి యాతఁడు కొండ - గుహలు వనములు
చుట్టి గంగాతీర - శోభన స్థలుల ౬౫

వయ్యాళిరా నజ - వణ మునీశ్వరుఁడు
పరిశుద్ధ విజ్ఞాని - వచ్చి కన్పడుడు
సంభ్రమమున లేచి - చరణాబ్జములకు
నభివాదనము సేయ - నాది జినేంద్రు
ధర్మమనుసరించు - తాత్పర్యయుతుఁడు ౭౦

జన్మదుఃఖము నుండి - జనులఁ దప్పించి
వైరంబు గలవారి - వాదంబు మాన్చి
మైత్రితో జీవులు - మనఁగాక మనసు
కరుణచే నీరయి - కరఁగును గాక
యని దీవనలు చేసి - మును పెల్లవారు ౭౫
కని విన ధర్మంబు - కలుపంగ నెక్కి
*కొండపై దోసంబు - క్రుంగించు నట్టి
పాద చిహ్నము లుంటఁ - బద పంకజగిరి
యను పేర నొప్పుకొం - డను వలగొనుచు
సేవింప నచ్చితిఁ - జిత్త శుద్ధిగొని ౮౦
సేవింపుఁ డని వచిం - చిన యట్లువారు
తప్పక యేగి యు - త్సవము చేయించి
సేవించు భాగ్యానఁ - జెలి వారలిపుడు
మాధవియై సుత - మతి యయి నిన్ను
చేరిరి నీవు నీ - చిత్త కలంక ౮౫
మీఁగితి తొలిబాము - నెఱిఁగితి ధర్మ
తత్త్వ మెఱిఁగి జ్ఞాన - తరణి చేకొంటి
తక్కిన మత ధర్మ - తత్త్వముల్ దెలుపు
వారలు తెల్పు నొ - ప్పఁగ వినంగలవు
పలుధర్మ తత్త్వముల్ - పరికించి వినఁగ ౯౦

* ఆ కొండగృధ్రకూటము. అది మగధలో రాజగృహ సమీపమునఁగలదు.

లే వయసుది మఱి - లేమ యంచెవరుఁ
జేర్చరు తత్త్వముల్ - చెప్పరు గాన
వలయు రూపము ధరిం - పం గగనమునఁ
జరియింప ననువయి - చను రెండు మంత్ర
ములఁ గొనుమని నేర్చి - పూర్ణిమయైన ౯౫

* మంగళ దినము సా - మాన్య విజ్ఞాన
మున వెగటొంది యి - మ్మల జతుస్సత్యా
ముల నరిసిన జ్ఞాని - బుద్ధుండు తపసి
చెప్పిన విధు లను - ష్ఠించుట సిద్ధ
మని నిశ్చయించిన - వనితవు నీవు ౧౦౦

పీఠికిఁ గేల్మోడ్చి - వినుతించి యుంటి
వింక నీ పురమున - కేగెదు గాక
యని లేచి మఱియొండు - విను మది చెప్ప
మఱచితి మనుజుల - మయి కూటిలిప్ప
యీ మంత్ర మాఁకలి - యొసఁగ నీ కణఁచుఁ ౧౦౫

గొనుమని యొసఁగి య - క్కొమరైన వేల్పు
తరుణి దీవించి యం - తర్ధానమందె.

* వైశాఖపూర్ణిమనాఁడు బుద్ధుఁడు జ్ఞానియయ్యెను కావున నా దినము మంగళదినము.

## ౧౧. పాత్రగ్రహణము

మణిమేఖలాదేవి - మఱుఁగైన పిదప
మణి పల్లవంబున - మణిమేఖలయును
తెల్లనైన యిసుక - తిప్పలు పూల
తోఁటలు చల్లని - తోయజాకరము
లానందముగఁ గాంచు - చాముఁద నడవ ౫
ద్వీప తిలక యను - దేవతా కన్య
కానంగ వచ్చి యో - కలికి! యెవ్వతవు ?
కలము పగులు నంతఁ - గడలిలోనుండి
యీఁది గట్టెక్కిన - యింతి నా నుంటి
వనుచు నయ్యమ యిట్టు - లను ధైర్యమొంది ౧౦
యే జన్మమును గూర్చి - యీ వడిగితివో ?
పూర్వ జన్మంబున - భూపతి తనయ
రాహులు భార్యనై - రాజిల్లి లక్ష్మి
యను పేర ధారణి - నొప్పారు చుంటి
నీ జన్మమున వెల - యింతి మాధవికి ౧౫
మణిమేఖలయను ।పే - మంపుఁ గూఁతురను
దైవమిచట నన్ను - తగ డించి పోవ
నీ పీఠికడఁ బూర్వ - వృత్త మారసితి
నిచటికి నారాక - కిది కారణంబు
పొందిన ఫలమిది - పూఁబోఁడి యెవత ౨౦

వీ వసుటయు నా మె - యీరీతి ననియె
నీ పూర్వజన్మంపు - నియతి నారసితి
నంతసమయ్యో నో - చాన ! యిచ్చటికి
దాఁపునఁ గలదు ర - త్నద్వీప మనఁగ
నందు శమంత శై - లాగ్రంబు నందు 29

జినదేవు పదపద్మ - చిహ్నముల్ గలవు
తత భవజలధి సం - తరణమ్ము లతని
చరణముల్ వలగొని - సద్భక్తిమ్రొక్కి
ప్రణుతించి యిచటికి - వచ్చితిఁ బూత
దర్శనీయమగు ర - త్నపుఁ బీఠి నిం దు 30

నాజ్ఞఁ గాచెడిదాన - నతివ నాపేరు
ద్వీప తిలక యింద్రు - తిఖిరి ధర్మేశు
నధ్యక్షత వచించి - నట్టి ధర్మములఁ
దప్పకొనర్చు వ్ర - తస్థులు కాంచి
వినుతించి తమపూర్వ - వృత్తమారయుదు 31

రట్టిరె విన ధర్మ - మర్మ మై యుండుఁ
బావన హృదయ ! యీ - బౌద్ధపీఠంబు
ముందరఁ గలువలు - నిందీవరములు
పద్మముల్ నిండిన - పరిశుద్ధ సరసి
గోముఖి యను పేరఁ - గొమరారునందు 40

సరవి వసంత వై - శాఖమాసమున
*నడిమి నక్షత్రమై - యడరు విశాఖ
తోడఁ జంద్రుఁడు కూడి - తోఁచు పున్నమను
బోధిసత్త్వని జన్మ - పూత దినమున
మానుగ నేఁటేఁట - మీన లగ్నమున 2౫

మీన నిలయ మందు - కానంగ వచ్చు
గోపుత్రకుని చేతఁ - గొమరార నున్న
యమృత సురభియను - నరుదైన పాత్ర
మావేళ యీవేళ - యానాఁడె నేడు
రమ్మ నీ చేతికి - రావచ్చు నద్ది ౩౦

---

* ఇప్పటి యిరువదేడింట నడిమిదిక్క చిత్రకాఁగా విశాఖ యెట్లగు నన, సంవత్సరమందలి రెండు విషువద్దినములలో మేషాయనమందు సూర్యున కెందు ప్రవేశము కలగో యది మొదటిదిక్కగా నెన్నుట జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతమగుట వలనను పూర్వ మొకతటి సూర్యుని కృత్తికా ప్రవేశవేళ మేషాయనము కలిగెననియు దానింబట్టి కృత్తికను మొదటి నక్షత్రముగా నెన్నుచు వచ్చిరనియుఁ బూర్వ జ్యోతిశ్శాస్త్ర గ్రంథములందు తెలియవచ్చుటచే విశాఖ మధ్యనక్షత్రమనుట దోస గుకాదు

కృష్ణయజుర్వేద సంహితవలనను కృష్ణయజుర్వేద బ్రాహ్మణము వలనను కృత్తికయే మొదటిదని తెలియుచున్నది. విక్రమాదిత్యుని సభానవరత్నములలో ప్రసిద్ధజ్యోతిర్విదుఁడగు వరాహమిహిరుఁడు తన కాలమున మేషాయనమం దశ్విని నక్షత్రముండుట యెఱింగి తత్పూర్వపద్ధతికి మాఱుగా అశ్వినినుండి యెంచు పద్ధతి నేర్పఱచుటచే నిప్పుడిట్లున్నది.

అందుండి కరియు జీ - వౌషధ మరయ
నఱచేతి నొప్పించి - తఱుఁగక వచ్చు
నమ్మాయి! మీయూర - నలరు నఱవణ
ఋషియొద్ద దీని మ - హిమ వింధుగాక
యని యామె పలుక న - మ్మణి మేఖలయును 55

వలపున మణిపీఠి - వలగొని మ్రొక్కి
ద్వీప తిలక తోడఁ - దెరువున నరిగి
గోముఖి వలగొని - గుడికొని నిలువఁ
బాత్రంబు లేచి య - వ్వనిత యంజలిని
నిలుచుటయును - చెలి నెమ్మనమందు 60

మితిలేని ముదమున - మీఱి పెల్లుబ్బి
మారుని గెల్చిన - వీర పదములు
చెడు త్రోవ చెడుపగ - చెఱుచు పాదములు
తగ వుపదేశించు - తలిరు పాదములు
స్వర్గంబు గోరని - ప్రణుత పాదములు 65

తలఁపులు వెనుబడ - నిలుచు పాదములు
కన్నులొసంగు స - త్కారుణ్య పదములు
చెడుపల్కులు వినని - చెవుల పాదములు
నయము సత్యము నిల్పు - నాల్క పాదములు
నరకులు వగచెడ - నడచు పాదములు 70

అరుహాల చింతల - నడఁచు పాదములు
అట్టి నీ పదముల - కడఁగుట దక్క
దీవింప నానాల్క - తివురదు సత్య
మని వినుతించు న - మ్మణిమేఖలకును
బోధి నీడను దోఁచు - నాథుపాదములు ౭౫

తనివితీఱ నుతించి తద్ద్వీప తిలక
యిట్లను నాఁకలి - యిలునడఁ జెఱుచు
గౌరవమును చంపుఁ - గైకొన్న విద్య
యను నావను పగుల్చు - నరుదైన తోడవు
సిగ్గును వదలించుఁ - జెఱుచుఁ గీరితిని ౮౦

సుందరులై యొప్పు - సుదతుల వెనుక
నిలుపు నాఁకలియను - బలు పిశాచమ్ముఁ
దఱిమిన వారిఁ గీ - ర్తనము సేయంగ
నానాల్క కంత వి - న్నాణంబు లేదు
ధరణి వేఁడిమి నిండఁ - దరువు లెండంగఁ ౮౫

బాగ లెగయ రగులు - నగివి పైకొనఁగఁ
బ్రాణులు మడియ వ - ర్షము పడకున్న
విశ్వపాలన చెడ - వేద విదుండు
స్వర్గమర్త్యంబులఁ - జనఁ జాలువాఁడు
గాటంపు టాఁకలి కాల్చి పీడింప ౯౦

నార్చు వైరవులేక - యలయుచు సోలసి
తిరుగు విశ్వామిత్ర - దివ్యతపస్వి
కుక్క మాంసము గాంచి - కూర్మి వేల్పులకు
నొప్పించి తినఁగ నా - హుతి సేయువాని
యెదుటఁ బర్జన్యుండు - పటుకునఁ దోఁచి ౯౫

వర్షంబు కురియఁగఁ - బంటలు పండె
జీవులు సుఖియించెఁ - జెలఁగె లోకములు
కలవు నోరుచు శక్తి - గల [illegible]
బెట్టువారు తగవు - వెల కట్టువారు
ఓరువలేకుండు - నరు దరిద్రులకుఁ ౧౦౦

గలుగు పేరాఁకలిఁ - దొలఁగించు వారు
ధర్మమార్గమ్మునఁ - దనరారు సౌఖ్య
మయు జీవితము సురా - లయ మందు కడపు
వారలు బీదల - నారసి యన్న
మిడువార లన్నంబు - నిడువారకారు ౧౦౫

ప్రాణంబుల నొసంగు - వారలు చుమ్మ
అట్టి జీవిత దాన - మను దృఢవ్రతము
పూని సన్మార్గంబు - బుద్ధి నారసితి
వనుటయుఁ దొలిపుట్టు - వున నేను వలచు
చెలువుండు పాముచే - జీవముల్ వీడ ౧౧౦

నేనగ్గిఁ జొచ్చు ము - న్నెండలో నలసి
వచ్చిన సాధున-కిచ్చి కుడ్చినది
యరసితిఁ గలలోని - యర్థంబువోలె
నాఫలమ్ముగ జీవ - నౌషధమైన
పాత్రమ్ము చేతికి - వచ్చి నిల్చినది ౧౧౫

తగ విత్తి ఫలియించు - ధర్మఫలమ్ము
కుడుచు ధనికు లిండ్ల - కడనిల్చువారు
కడుపును జఠరాగ్ని - కాల్పఁ బేలికలు
కట్టి మానముదాఁచి - కండలు కరఁగ
నెండఁగాంచక వాన - నెంచక యేగి ౧౨౦

తల వాకిటను నిల్చి - తలరుచుఁ బూర్వ
పాపమ్ముచేఁ దాప - పడువారు వారిఁ
గన్నఁగొడుకు మోముఁ - గాంచి తపించి
పాలు కురియు తల్లి - వక్షోజ మట్లు
కోరిన యప్పుడు - కోరిన యంత ౧౨౫

జీవామృతము దయ - చేయు పాత్రమునఁ
దపియించు మోములఁ - దనివి నిండంగ
నలరారు చోఁ గాంచ - నాస గల్గెడిని
అన, దాని వృత్తాంత - మరసితి వీవు
ధర్మమ్ముసాక్షిగా - దయను వర్షించి ౧౩౦

కుడుపు పుణ్యులకై తాఁ - గోరియుఁ బాత్రమ్ము
మఱవకు మీటనుండి - మరలుచు యనఁగఁ
దెలివి మిన్నయు ద్వీప - తిలక పాదముల
కెఱఁగి యాపాత్రము - మృదుల హస్తమునఁ
దాలిచి మణిపీఠి - దర్శించి మ్రొక్కి ౧౩౫
మింటి కెగసె మణి - మేఖల యంత
దైవము పల్కు స - త్యము దినమిద్ది
తనయ యింకను రాదు - తప్పునో యనుచు
వనరుచు నుండిన - వారల యెదుర
దిగి వారి కలఁతలఁ - దీర్చి వారలకు ౧౪౦
నద్భుత మగు లీల - నదియె నాబాల
రవివర్మపుత్రి ! దు - ర్జయుదేవి ! యమృత
వతి గర్భమునఁ బుట్టి - హిత లక్షణగుచుఁ
దారమై వీరయె - చెనరిన మీకు
మ్రొక్కెద మీఁగలి - బొంది యుండఁగనె ౧౪౫
తాపముల్ తలఁగించు - తపమునేయంగ
నఱవణమహేంద్రు - నంఘ్రిపద్మముల
కడ నుపదేశ మం - దుఁడు మార్గమదియు
పసిపట్టికై యమృ - త సురభి యిద్ది
దీనికి మీర స - ర్పించి మ్రొక్కుండు ౧౫౦
అన వారు మ్రొక్కిరి - ముని పదములను
శరణొంద లెంచనఁ - జనిరి ముగ్వురును.

## ౧౨. అఱవణముని సేవనము

ఆట వారు చనుచు మ - హాశుని యెచట
వఱలు నంచరయుచు - నఱముది నేను
తలగని నాలుక - గలుగు నఱవణ
ముని వసియించు ని - మ్మును చేరి ముగురు
మున్మఱు వలగొని - ముని పాదములకు ౫

వందన మొనరించి - భక్తిం గేల్మోడ్చి
సుకుమారి యువవనిం - జొచ్చుట యుదయుం
డచటికి వచ్చి త - న్నాడిన పలుకు
మణిమేఖలాదేవి - మణిపల్లవమున
వదలుట యాటంబిర - వలనం దొల్బాము ౧౦

పొలుపు నెఱు గంగాం - బూర్వ నాధుండై
యుదయ కుమారుండై - యుదయించుట యును
అక్కలై యుండిన - యల తార వీర
దుష్కర్మమున మృతి - దొరసి మాధవిగ
సుతమతిగాం జనిం - చుటయును డెలిపి ౧౫

నియమముల్ మానిని స - న్నిధి వినుమనుచు
మూండు మంత్రమ్ములు - ముదమున నేర్పి
మణిమేఖలాదేవి - మఱుంగగు నంత

ద్వీప తిలక కాని - పించి చేరుటయు
గోపుత్రకుని బిచ్చు - కోర నిప్పించు 20

టయు దానికత ముని - దాపున వినుము
యనుచుఁ బొమ్మనఁ దాను - చను దెంచుటయును
నియతుని పాద స - న్నిధి విన్నవింప
విని మహాముని యిట్లు - వివరింపఁ దొడఁగె
తనివి సననీ ప్రేము - తల భూజీ సన్న 25

వనితల నడవడి - వలనొప్ప వినుము
నీకు దైవ మెఱుఁగ - నిగదించు నాళ్లు
చనిన పిదప మఱు - జన్మంబుఁ దోలఁచు
జిత మూరు చరణాబ్జ - చిహ్నంబు లున్న
పాద పంకజగిరిఁ - బరికింపఁ జనుచుఁ 30

గచ్చయనేలు భూ - కాంతు దుర్జయుని
విరితోటలోఁ గాంచి - ధరణీశ చంద్ర!
నీవు నీదేవులు - నెమ్మి నున్నారె?
యన రాజు కళవళ - మంది చింతించి
మైరేయ పాన వి - మత్తత పీర 35

మే నెఱుంగక క్రొత్త - యేనుఁగు నెదురఁ
జని చచ్చుటను విని - వనరుచుఁ దార
మేడ యెక్కి దుమికి - మృతిఁజెందె ననుచు

వినిపింప విధికృత - మున కిట్లు వగవ
వలదని యూఱట - పలికి లేచితిని ౮౦

ఆట వెలందుల - యాభరణముల
మాఱుపువలె వేఱు - వేఱు భూషణము
లితవుగఁ దాల్చి వ - చ్చితిరో యటంచు
మణిమేఖల యెదుట - మాధవి సుతను
తుల చరిత్ర మతఁడు - తెలిపియుఁ దృప్తి ౮౫

సనక యిట్లను జన్మ - సంగతుల్ ధర్మ
పద్ధతుల్ క్రమముగఁ - బరికించి తెలియు
కన్యకా! వేడ్క తోఁ - గడఁకతో వినుము
ధర్మప్రభుని మహా - ధ్యూతఁ దెలుపు
సద్ధర్మములు వృద్ధిఁ - జనక నిర్వాణ ౯౦

పథము గతికయును - పల్లేరు పెరిఁగి
మూయంగఁబడి దోష - ములనుండి కలుగు
దుర్గతి వాకిలి - దోఁచె విస్తృతిగ
జీవులు చనుదారి - చిర శుద్ధ మయ్యు
గొడ్డుమంచు కనిసి - కత్తుక నుంచు ౯౫
మిహిర మండలముండు - వహిని దోఁచినది
కాని యింపు వెలుంగు - కాన రాదయ్యొ
నినుప సలాక చొ - చ్చిన మణి త్రోవ

నబ్ధి పోవద య్యెఁ - నాత్రోవఁజొచ్చు
సన్నని జలధార - సరణి సన్మార్గ ౬౦

మనుసరించుచు నుండె - జనముఁ గొంత
నాయుపదేశమ్ము - నర్మిలి వినర
యియ్యది మర్త్యుల - యెఱుఁగమి గానఁ
జక్రవాళంబునఁ - జను వేల్పులెల్ల
దుఃఖించి గుమిగూడి - తుషితలోకమున ౬౫

* మహాదేవు పదముల - మన్నించి యెఱఁగి
గాఢాంధకారమ్ము - క్రమ్మ జగమున
బాలసూర్యుఁడు తోఁచు - పగిదిని ♦ వేయి
నాఱు నూఱుల పది - యాఱవయేఁట
బుద్ధదేవుఁడు భూమిఁ - బొడము నాపిదప ౭౦

గురు సరస్సునఁ బిన్న - పరివాహమందు
గొప్ప వెల్లువచొచ్చు - కొమరునఁ జిన్న
చెవి త్రోవ సద్ధర్మ - సిద్ధాంత విషయ
ముల్లాస కరమగు - నుత్సుకత్వమున
జీవింపఁగాఁజొచ్చుఁ - జిత్ర భానుండు ౭౫

* ఇతనిపేరు ప్రభాపాలుడు.

♦ ఇది యేశకమో తెలియరాదు.

కలిగిన తఱిఁ దన - కాంతులఁ జూపు
మణిపోలెఁ గటికి త - మంబు నిండారు
హృదయ మాలిన్యంబు - చెదరి పర్విడఁగ
బుద్ధరవి పొడమిఁ - బొడము ప్రభాత
వేళ రవీందులు - వెసఁ బ్రసన్నులయి ౮౦

విలసిల్లు నురు ఋక్ష - వితతి క్రమమ్మొ
ననుసరింపఁగ మొగు - లనువుగఁ గురియ
భూమి సుభిక్షమై - పొలు పొందుచుండఁ
గార్శ్య దేహములు దుః - ఖము లొందకుండఁ
గిరువలి వలగొని - తిరుగుచు నుండఁ ౮౫

గొండలు ఫలముల - నిండారుచుండు
నుదధి పెక్కనయమ్మొ - లొసంగుచు నుండు
గోవులు క్రేపుల - కుం ద్రావనిచ్చి
పాత్రముల్ నిండఁగాఁ - బాఁడి యొసంగుఁ
బులుఁగులు తృప్తిమై - నెలవుల నుండు ౯౦

మృగములు మనుజులు - పగమానియుండ్రు
నరక పిశాచ గ - ణములు సుఖించుఁ
గుంటి మూఁగ చెవిటి - గూనియు గ్రుడ్డి
మృగరూపములు నవి - మృగ్యాకారితయు
నవివేకమును బ్రాణు - లంద వానాఁటఁ ౯౫

బ్రభవించు వారు ధ - ర్మము విన్నవారు
కటు దుఃఖ జీవిక - కడచినవారు
బోధిమూలముగ చేరు - నాథుని పాద
జలజముల్ దొసఁగులు - తొలఁగఁ గీర్తనము
మఱవంగఁ జాల జ - న్మము జన్మమందు ౧౦౦

ఇట నీవలనఁ గల్గు - హేతు సంఘటన
లున్నవి పెక్కుల - వ్వానరిన పిదపఁ
గాక నీ బోధముల్ - కలుకులు పెరు
ముప్పు లడఁచు నాది - మూలుని పాద
పంకజగిరిఁ గా చి - ప్రణుతించినట్టి ౧౦౫

వార లగుటచేత - వీరు నీతోడ
మహిమచే నున్నతి - మాన్యంబు నైన
మా రజితుని పాద - వారిజములకు
వలగొని కేలో్మోడ్చి - ప్రణుతించి కర్మ
పాశమ్ములం ద్రుంగి - పరిపూతమైన ౧౧౦

సద్గతి పడయఁగఁ - జాలినవారు
సమయని జీవనౌ - షధము నొసంగు
నమృత సురభిఁ గేల - నందితి వీవు
మర్త్యుల కేని య - మర్త్యుల కేని
గొదవ తీర్చుటయె కడు - గొప్ప ధర్మమని ౧౧౫

యురుతర సిద్ధాంత - మొక్కఁటే కెలదు
కార్చిచ్చువంటి యాఁ-కలి బాధ తీర్చ
శక్తవు నీవని-సత్తపస్వి యన
మణిమేఖల కొసఁగె - మహితపాత్రమును.

## ౧౩. గోపుత్రకవృత్తాంతము

అమృత సురభి యను-నక్షయపాత్ర
గొని మీకు దయసేయు-గోపుత్రు చరిత
వినుఁడు వారాణసి - విప్రుఁ డధ్యాప
కుం డభంజను వాని-కొమ్మ శాలియను
నాఱుత ధర్మంబు - మీఱి పాఱునకు ౫
గూర్చిన యపనింద - కుం దగు దండ
నమునకు భీతిల్లి - కుమరి తీర్థమున
నీరాడఁబోవుచు - నిండు చూలాలు
కావునఁ గూరుకు - కటికి చీఁకటిని
కనిన బిడ్డను గాంచి-కరుణ వోనాడి ౧౦
విడిచిన యొకతోఁట - విడిచిపోయినది
బిడ్డ పాలకు నేడ్వ - విని యొక్కయావు
బాలకు కడకేగి - పాలు ప్రేమమునఁ
గుడిపి మై నాల్కతోఁ-దడవి దుఃఖంబు
దొలఁగించి యేడు నా-ళ్లెలమి రక్షింప ౧౫

వయనగోడను గ్రాషః - వాసి పాఱుంపు
* యువభూతి పసిపాప - యుమ్మలంబు విని
కలఁగు మదిన్వచ్చి - కన్నీరు నించి
యితఁడు గోపుత్రకుఁ - డెట్లగు నాదు
తనయుఁడే యని మది - తమకంబు మీఱ ౨౦

దనకు ననుగ్రహిం - చిన వేలుపునకుఁ
జేమొత్తి మ్రొక్కి యా - చిఱుత నెత్తికొని
మనకు బిడ్డగాఁగె - మన వంశ మింక
వర్ధిల్లఁగలదని - పాఱుండు పిదప
జాతకర్మములుఁ - జరపి పోషించి ౨౫

వడుగు చేయించి ప్రాఁ - బలుకు లంగమ్ము
లధిగమింపఁగఁజేసి - యవనీ సురులకు
వలసిన యవినేర్పి - వఱలుచున్నంత
నొక్కనాఁ డయ్యార - నొక విప్రునింట
మాంస మాహుతిసేయు - మఖమునయందు ౩౦

కొమ్ములఁ బూవుల - కొమరొందు పశువు
తన కబ్బు దురవస్థఁ - దలఁచి దుఃఖించి
యంబాయనుచు రోద - నం బొనరించి

* ఇఱ్ఱంబాడి యనుటకు సంస్కృతీకరణము

హింస్రకులై యొక్క - మృగయుల వలను
తగులువడిన జింక - వగిదిఁ దపించి        ౩౫

పిలుచు పిల్చున, గుండె - యలు నీరుగాఁగఁ
బలవించి నే దొంగ - పనిచేసియైన
దీని మరణబాధ - దీర్తుగాకనుచు
గోపుత్రకుఁడు రేయి - గోవును గొనుచు
గ్రామమ్ము దాఁటి మా - ర్గము దప్పి యొకట        ౪౦

పలుకు బొబ్బరవిన - పథమందు నిలిచి
యున్న తఱిని దయ - యొక యింతలేని
కటికి డెందముగల - ఘనులతోఁ గూడి
విప్రుండు వెదకుచు - వెసఁ జనుదెంచి
గోపుత్రకుని పట్టు - కొని వానిఁ గాంచి        ౪౫

గోవును క్రొంద్రోవఁ - గొనిపోవఁజూచు
నీవు చోరుండవు - కావేని యేల
చావఁదెచ్చితి విట్లు - చండాల పుత్ర!
కుల సంఘమున నిన్ను - వెలి వేసెదమని
కశలతో మోఁది య - గ్గలిక బాధించు        ౫౦

నవనీ సురుల నుపా - ధ్యాయు నాయావు
కొమ్ములఁబొడిచి ప్రే - గులు వెలికీడ్చి
యడవిత్రోవను గంతు - లిడుచుఁ బాఱుడును

గోపుత్రకుఁడు వారిఁ - గూర్చి యిట్లనియె
బాధించు టేల నా - పలుకులు వినుఁడు ౫౫

గోవులు తమ యంతఁ - గుంభిని మొలచు
కసవు మేయుచు జీవ - గణములకెల్ల
మేలైన తమతియ్య - పాలను ధర్మ
బుద్ధితోఁ గరుణతో - బూనికఁ గురిసి
త్రాగించు వీఁ చేఁ - దనరిన చేదుగు ౬౦

కలదేని వృద్ధ వి - ప్రులు తెల్పుఁడనఁగఁ
గాంచన నేమి చ - క్రము కుడిచేతఁ
దాల్చిన వెన్నని - తనయుండు మనకు
దయచేయు గొప్ప వే - దగుల యర్థంబు
నెఱుఁగక యిటు తిర - స్కృతిచేసి నగితి ౬౫

పదటంపు బెద పిన్న - వాఁడవు నిక్క
మాఁబసి కిట్టుఁడె - వనఁ దగియుంటి
విప్రసుతుండనై - విగ్రధమునఁ గావ
యని గేలి చేయుంగ - నాతఁ డిట్లనియె
నచలుండు శశిపుత్రుఁ - డగుఁ గాఁడ యేమి ౭౦

జింక కొడుకు కాఁడె - శృంగి ధారణిని
పులికొడుకై దా - పుట్టె ఖరించి

కీర్తి పాత్రుండైన-కేశ కంబళుఁడు*
గొప్ప వినుతిగనె-గోమాయు కొమరు
అల వసిష్ఠుఁడు వేశ్య-యందుద్భవించె ౬౫

బెస్త పిల్లకుఁబుట్టి-పెరిఁగె వ్యాసుండు
వీరు మీకుల పూర్వ-వీరులు కారె?
వినుతి మీచే నేఁడు-కొనుచుండలేదె?
అగుచో శ్రుతులయందు-నాగమంబులను
సద్గ్రంథములఁ బళు-సంతతి యగుచు ౭౦

వచ్చిన యొకచెడు-వంశమ్ము గలదె?
యనఁగ నందొక విప్రుఁ-డనియె నీరీతి
వీని జన్మంబు నే-వివరింతు వినుఁడు
త్రోవ నడచు శ్రమ-తో నొక్క విప్ర
వనిత మున్నుకుమారి-పదములఁ గొలువ ౭౫

నొంటిమైవచ్చిన-యువతిని గాంచి
యెవ్వరి దానవీ-వేల వచ్చితివి
యూరేది యన నామె-యుమ్మలికించి
వారాణసిని ఘన-పాఠి యన్ కీర్తి
నలరు నభంజనుఁ-డను పాఱు సతిని ౮౦

* అసిత కేశ కంబళుఁడని యొక పేరు బౌద్ధగ్రంథములందు గానంబడుచున్నది.

శాలిని యనుదానఁ - జపల చిత్తమున
విప్రులకుం గాని - పెడ త్రోవ నేగి
పతి వీడి దండన - భయమున నూరు
వీడి కుమరి తీర్థ - మాడంగఁ బోవు
జనములతోఁగూడి - చనుచుండి పాండ్య ౯౫

రాజధానియగు కో - ఱ్ఱను దాఁటి గొల్ల
పల్లియ కడ బిడ్డఁ - బ్రసవించి కరుణ
తోడ నిసుఁగు నొక్క - తోఁటలో విడిచి
వచ్చితి నిట్టి దు - ర్భగ నైన నాకు
సుగతి యనఁగ నొక్క - చొప్పును గలదె ? ౧౦౦

యని ప్రలాపించిన - దాయప కొడుకు
వీఁడు వీనిని గూర్చి - వివరించి ఫలము
గలదె యంచింతకుఁ - దెలుపకుండితిని
కూళ వ్రాత్యుండు చం - డాల పుత్రుండు
కుండుం డితనిఁ దాఁ క - కుండన్న యంతఁ ౧౦౫

జిఱునవ్వు నవ్వి యాఁ - జిఱుతఁ డిట్లనియె
పాఱులు వచ్చిన - వంశక్రమమ్ము
వినుఁడు మొట్టమొదటి - వేలుపు మొదటఁ
గన్న తిలోత్తమా - గణికకుఁ బుట్టు
నిరువురు బాలకు - లీ విప్రకులము ౧౧౦

మొదటి వారలు వారె - మొకట జందెమ్ము
దాల్చినవారు స - త్యమ్ము వచించు
*శాలి ద్రోసిణి యన - సాహసి చికెరి
అనినవ విప్రులా - తనికి నుత్తరము
నొసంగలేక కినిసి - యువభూతితోడఁ ౧౧౫
దెలుప నాతఁడు నెఱి - దెలిసి యు నూరి
పగభరింపఁగలేక - పట్టెఁబో ద్రోచె
యువభూతి విడువంగ - నూరి వారలుచు
పసిఁగ్రుచ్చునుచు వానిఁ, బాదుచుఁదఱుము
నూహూరు తిరియుచు - నుండఁ బౌఱుతలు ౧౨౦
పాత్రలోపల రాలు - పడనైన విసిగి
ధనికులు వసియించు - దక్షిణ మధుర
కరిగి సరస్వతి - యాలయమునకు
ముందరి మండప - మున వసియించి
యూర భిక్షాపాత్ర - మూని నిర్దుష్ట ౧౨౫
పద్ధతిఁ దిరిసి యా - వచ్చినదాని
గ్రుడ్డివారు చెవిటి - కుంటి వారలును
వ్యాధి బాధలనొందు - వా రగతికులు
నందఱు రండు రం - డని పిల్చి పెట్టి
శేషమ్ము తాను భు - జించి పాత్రమ్ము ౧౩౦
దిండుగాఁ గొనుచుఁ బ - రుండి నిద్రించుఁ
బ్రాణి కోటికి నార్త - రక్షకుఁడతఁడు.

* శాలియన నక్షంతతికి పేరు.

## ౧౪. పాత్ర మహిమము

ఆతని కొక్క నాఁ-డమ్మండపమున
సంఘటించిన చిత్ర-చరితమ్ము వినుఁడు
నడురేయి కొండలు-తడిసి వర్షమునఁ
జీఁకటిఁబడి త్రోవ-చెడి తూలిపడుచు
మండపమున నిద్ర-నుండు నాభిక్షుఁ
బొగ శిపుణ్యాత్మ! క-డ్పులఁ గాల్చుచున్న
యాఁకలిచేఁ జావ-నయ్యె విప్రుఁడు
భిక్షాన్నమే తక్క-వేఱొండు లేని
గోపుత్రకుఁడు వారి-గోడ తీర్చు వెరవు
గానక తపియింపఁ-గాంచి పవిత్ర ౧౦

సర్వమతస్థ స-జ్జననుతపాత్ర
సత్కళాలయ సర-స్వతిదేవి సుప్ర
సన్నయై నిలిచి యో-సద్భక్త తిలక!
చింతింపకుము లేచి-చేకొను మిద్ది
దేశంబు క్షామ బా-ధితమైన వట్టి ౧౫

పోవదిం దక్షయ-జీవనౌషధము
కొనువారి చేయి నొ-చ్చును గాని లోఁటు
వడని దియ్యది యని-వడిఁ జేతి పాత్ర
మాతనిచేఁబెట్ట-నతఁడు కేల్మోగిచి
ఆఁటని దీపమా-అమరాధినేత్రి ౨౦

ప్రాణి కోటికిఁ దెల్వి - పరఁగించు తల్లి!
ఆపద లరసి మ - మ్మాదుకోవమ్మ
యని మ్రొక్కి - వారల - యాపద దీర్చి
యా దినమ్మున నుండి - యాఁకలి నొచ్చి
వచ్చి యన్నను గొను - వారి కే ల్లొసఁగ్ర ౨౫
జీవులఁ గాచుచుఁ - జెలఁగుచునుండ
మనుజులు మృగములు - మఱి పక్షి వితతి
తమ జాతివైరముల్ - తలఁగంగఁ ద్రోచి
పండిన మ్రాఁకునఁ - బక్షుల మాడ్కి
నొద్దికతోఁ జేరి - యోరెమ్మ గొనుచు ౩౦
వచ్చువారలు పోవు - వారలు నగుచు
నెడవడకుండ సం - దడి సేయుచుండ
నిచట నీజగమున - నీతని చర్య
క్రతు భుగింద్రుని * పాండు - కంబళాసనము
జలియింపఁ జేయఁ జం - చలమైన నడక ౩౫
తోడ మూఁడవ కాలి - తో నేలనూని
వంగిన మైగల - పాఱుఁడై యింద్రుఁ
డీ లోక జీవుల - నింపారఁ గాచు

---

* భూలోకమున బౌద్ధులకేదేని యాపదసంభవించిన నింద్రుని పాండుకంబళాసనము చలించును. ఆ సంజ్ఞ యెఱిఁగి వచ్చి వరములిచ్చి వారి కొఱఁతలఁ దీర్చుట యింద్రుని విధి (చూ ౨౯-వ ప్రక.)

గోపుత్రు నెదుట సం-కోచించి నిలిచి
యింద్రుఁడ వచ్చితి-నిటకు నీయుద్దేశ ౪౦
మేమి? దానఫలమ్ము-నిత్తుఁ గైకొనుము
నాకమ్మునకు రమ్మ-నంగ నా బోడ
పక పక మని వెన్న-ముక విఱుగంగ
నవ్వి కేరడము నో-నర్చెఁ బొమ్మనియె
నిచ్చటి పున్నెంబు-నచ్చటఁ గుడుపు ౪౫
వేలుపుల్ ధర్మమ్ము-విధిఁ జనువారు
నాపద వేళల-నాదుకొన్వారు
తపము శ్రమలకోర్చి-తగఁ జేయువారు
భవ బంధములను త్రెం-పఁగఁ బూనువారు
వెదకిన లేని యా-విబుధ లోకమున ౫౦
కధిపతివైన సు-రాధ్యక్ష! వినుము
కష్టించి యలసి యాఁ-కలిగొని వచ్చు
వారి యాఁకలి దీర్పఁ-దేఱిన నవ్వు
మోములఁ జూపు నా-ముద్దు పాత్రమ్ము
కుడుపు నిచ్చును గద-యుడుపు నిచ్చుఁగద ౫౫
పెండ్లము కద మఱి-విభుఁడు రక్షకుఁడు
సర్వమ్ము నీయంగఁ-జాలియు యుండ
నింక నీవేమి నా-కిత్తువో చెపుము

యనుటయు జీవుల - నరసి రక్షించు
వాని పాత్రము కోరు - వారలు లేక ౬౦

వ్యర్థమా కరణిని - వాసవుం డపుడు
వాన దండిగం బడి - పంటలు పండి
తిరిపగాండ్రకు భూమిం - గఱవగు నట్లు
గోపుత్రకుని మీంది - కోపంబు వలన
మేదిని జనులకు - మేలుసేయంగ ౬౫

వరుసం బండ్రెండేండ్లు - పాండ్యుని భూమి
వానలు కురియక పంటలు లేక
జీవుల మరణింపం - జేసిన కఱవు
భూమి చల్లంబడంగ - భూజనములకుం
బనులు గలుగ దండి - పంటలు పండి ౭౦

యాంకలి దప్పులే - యరయని రీతి
యేర్పడ నన్నంబు - నిడు మండపమునం
బలు విధముల రస - ములు గుడుగుప్పు
మని నిల్వ విటులు ధూ - ర్తావలి నటులు
పరిహాసకులు తెరు - వరులు మున్నైన ౭౫

వారలు ముదమునం - జేరి నెత్తముల
వ్యర్థ భాషణముల - వర్థిల్లు నంత
మండపమున గోసు - తుం డుండ లేక

వదలి యూరూరును - పల్లె పల్లెయును
తిరిగి తిరిగి గాంద్రిక - నరయుచు నడిగి ౮౧
యెవ్వఁ డీతండని - యెల్లరు నవ్వఁ
బరులానఁ గనునాస - పడిన యాతండు
నీవుంటివా యని - నిలిచి ప్రశ్నించు
వారు లేని కతాన - వఱలు సంపదలు
నుదధి కొల్లగొనఁగ - నొంటిమై నచ్చు ౮౫
మహిపతివలె నొంటి - మైవచ్చు నతని
యెదురఁ గడలి నావ - నింపుమై దిగిన
వారలు మ్రొక్కి * శ్రా - వక దేశమందు
వాన లేమిని చచ్చెఁ - బ్రాణి పితాన
మధికమ్ముగా నన - నమరేంద్రు కరుణ ౯౦
చే భుజించెడి వారు - చిక్కని కతన
కన్యక ముదిసిన - కరణి వ్యర్థముగ
నున్న పాత్రము కేల - నూని యేసచటి
కరుగుటయే మంచి - దని నిశ్చయించి
కడలి యాత్రికులతోఁ - గలమున నెక్కి ౯౪
చనుచుండ నొకట ను - ప్పెనలేచి జలధి
నల్ల కల్లోలమ్ము - నడరింపఁ గాంచి
పడవను మణిపల్ల - వము తీరమందు

* జావా.

నిలిపి నేఁడిట నిల్చి - వెలలుద మనుచు
మాలిమి యన, గోకు - మారుండు దిగియె ౧౦౦

సగము రేయిసి గాలి - ప్రగ్గిన యంత
నందఱు రండని - యట నుండి పడవఁ
గదలించుకొని యార - కాటి చన్నంత
దీవిఁ గాంచెడి వేడ్క - తివుర గోపుత్రుఁ
డరిగి యావలి నాఁడు - మరలి వీక్షించి ౧౦౫

పడవ లేమికిఁ జాలఁ - బరితాప మొంది
మణి పల్లవంబున - మను జీవి యొండు
లేమిఁ బ్రాణులఁ గావ - లేమికి వగచి
పాత్రమ్ము ననుగాచు - మాత్రానకోర్వ
లేను తపః ఫల - మైన యీపాత్ర ౧౧౦

వ్యర్థమగుట కోర్చి - బ్రతుకంగఁజాల
బ్రతికి మోచుచునుండ - ఫలమేమి యనుచు
క్రొమ్కి నిసుగున గో - ముఖిఁ బాఱవైచి
యేఁడాది కొక్కనాఁ - డిందు కన్పడుచు
కరుణతో జీవులఁ - గాచు వ్రతమ్ము ౧౧౫

కలవారు నా వారి - కడఁజేరు మనుచు
నిరశన వ్రతమూని - నియతిమై నుండి
ప్రాణమ్ము వీడు నాఁ - డాతని కడకు

నే నేగి యెట్లయ్యె - నెట్టి వారలకు
నని ప్రశ్న సేయంగఁ - దనకు ఘటిల్లు ౧౨౦
పలు దుఃఖముల నాకుఁ - దెలిపి మైవిడిచెఁ
దొలు దెసఁ బుట్టి యు - రులఁ బోవఁ దఱిమి
పడుదెసఁ గ్రుంకిన - మార్తాండుఁ బోలె
మణి పల్లవమ్మున - మట్టి ఘటమ్ము
వదలి తనివి లేమిఁ - బ్రాణులఁ గాచు ౧ ౫
తలఁపుతో శ్రావక - ధారణి నేలు
భూమి చంద్రునినాటఁ - బొలుపారు నొక్క
గోగర్భమునఁ బుట్టె - గోపుత్రకుండు.

## ౧౫. బిచ్చమున కేగుట

కన్నకా! యానాళ్ళఁ - గసుగందుఁ గాచు
నావు తత్పుణ్యాన - శ్రావక దేశ
మందు ధవళగిరి - ప్రాంత ధారణిని
పూన్కిఁ దపించు మృ - ణ్మఖుని యాత్ర
మమ్మున బంగరు - కొమ్ములు గిట్ట
లొప్పు నాదూడయై - యుదయించి యెల్ల
వారు ప్రేమింపఁగ - వర్ధిలి చూలు
గొను మున్నె చనఁ బాలు - గురిసి జీవులకుఁ

ద్రావించుచుండ నా - తపస్వి త్రికాల
వేది తత్త్వజ్ఞుండు - వీత మోహుండు ౧౦
కాంచి యీ యాఁబసి - గర్భంబునందు
వర్షంబు కురియించి - ప్రాణులఁగాచు
రక్షకుఁ డుదితుఁడై - రాజిల్లు నతఁడు
ఆంత్రమాలలు దాల్చు - నట్టిఁడు కాఁడు
బంగరు గ్రుడ్డునఁ - బ్రభవిల్లు వాఁడు ౧౫
అనియె నవ్వేల వ్యాధు - లాధులు లేక
జనియించి పాడిమైఁ - జరియించి తుదిని
మణిపల్లవమ్మున - మనుజదేహమ్ము
వదలినాతఁడు దయా - వంతుండు పశువు
నే యెల్ల వేళల - నెదనెంచు కతన ౨౦
ఔ జనులు 'యాంతేమతిః - సాగతి' యనెడి
పలుకు ఫలింపంగఁ - బశు గర్భమందు
దేవతా గణము మో - దింప లోకంబు
సన్నుతింప జగతికి - వెల తెల్పరాని
తొడవుగఁ బుట్టె బు - ద్ధుఁడు తోఁచినట్టి ౨౫
విరి మాధవమ్మున - వృషభమాసమున
పదుమూఁడు దినము ల - వధి చన్నపిదప
మీన నక్షత్రాన - మీన లగ్నమునఁ

బోధిసత్త్వుఁడు భూమిఁ - బుట్టిన నాఁడు
కలిగిన శుభ సూచ - కములతోఁ బుట్టె ౩౦

ధరణి మబ్బులు లేక - విరివాన గురిసె
బుద్ధుండు పొడమిన - పుణ్యదినమ్మ
కాకున్న నట్టి మం - గళ నిమిత్తములఁ
గనుచుంటి మనుచు న - క్కజమంది చక్ర
వాళంబునం గల - పరమతాపసులు ౩౫

కంబ పతిమఁగాంచి - కనుఁగొందమంచు
నారేయి చీకఁటి - యదనఁ జేరంగ
మణిపల్లవమ్మున - మైవీడి నతఁడు
జీవరక్షణ తృప్తి - చెలఁగిన కతన
శ్రావక దేశాన - జనియించె నతని ౪౦

కత యలవణముని - కనిన వాఁడనుచు
నానాలుకకు నొప్పి - పూనిచె నవల
భూతలేశ్వరుఁడగు - భూమి చంద్రుండు
మృణ్మఖపాద నీ - రేజ ధ్యానమున
కెరఁగి సద్భక్తిమై - నే నపుత్రకుఁడఁ ౪౫
దమదయచే నపు - త్రకుఁడ నైతి నని
గోపుత్రకుని ప్రేమఁ - గొని పోయి పెంచె
రాజ్యంబు సత్య వర్ధక మయ్యె నతఁడు

శ్రావక ప్రభుఁడయ్యె - జనము మోదింప
నింద్రునకుం దృష్టి - యొసఁగమి నేమొ ౫౦

ధర్మప్రభుఁడు నీతి - దప్పెనొ యేమొ
కావేరినది దండి - గాఁ బాఱుచున్న
పంటలు పండక - ప్రాణివర్గమ్ము
తగు తిండి లేక యె - ద్దడిని తపించె
మణిమేఖలా! క్షీర - వనధి యొసంగు ౫౫

నమృతంబు వేలుపు - లాని శేషంబు
వాఁడని వడువున - వఱపైన-చోటఁ
గష్టముల్ దొలఁచు న-క్షయ పాత్రమొదవ
కుండుట తగదని - యోగీశుఁ డనుడుఁ
దల్లులంగోడఁ ద - త్తనయ యవ్వాని ౬౦

పదముల కెరఁగి యా - పాత్ర చేపట్టి
బిచ్చగ త్తియ పోల్కి - వేసంబునూని
చనఁ దేరఁగా గొల్లు - మను సద్దుతోడ
విటులు ధూర్తులు పిన్న - పెద్దలు కాంచి
మున్ను వత్సేశుఁడు - మోసంబువలనఁ ౬౫

జెఱవడ విడిపింప - స్థిర చిత్తుఁడగుచుఁ
జలచిత్తుమాడ్కి - నుజ్జయినిని దిరుగు
బ్రహ్మసుందరయోగి - పట్టి యాగంధ

రాయణుఁడూను వి - భ్రాంతవేషమ్ముఁ
గని యోర్వక తపించు - జనముల కరణి ౨౦
సదయ కుమారకుఁ - డెద దాఁచినట్టి
మణిమేఖల సమస్త - మనుజులు కాంచఁ
దిరిపబోఁకిని కేల - ధరియించి రాఁగఁ
జూచి యచ్చెరువని - స్రుక్కి-చింతించి
మాపిల్లి నొవ్వ నా - త్రోవ వెంబడిని ౨౫

జాగమ సుమలత - బంగరుబొమ్మ
మాధవి పుత్రి స - మ్మతి దిటవేడ్క-
మహిఁ బతివ్రతలు ప్రే - మమ్మున నిచ్చు
బిచ్చంబు తొలుదొల్త - మచ్చికఁ గొనుట
తగునని గొలఁకు తో - డుగు తమ్ములందు ౩౦

కమల వసించు మే - ల్కమలమ్ము భంగి
నిల్లాండ్ర మేటియై - యెసఁగిన యార్ద్రి
యిల్లిది చొరఁదగు - దిచ్చటి కతివ!
తగ నుత్తరమున వి - ద్యాధర నగర
మునఁబుట్టి దక్షిణ - మున మలయమున ౩౫
నొకయేటి గట్టున - నొక మహాతపసి
కొక నొవ్వి గలిగించి - యొక శాపమంది
కట్టోర్వరాని యాఁ - కలి నొవ్వినొంది

పరితాపమందుచుఁ - దిరుగుచునున్న
కాయ చండికయను - కాంతను నేను ౯౦

## ౧౬. ఆర్ద్రి బిచ్చమిడుట

*ఆదిర చరిత వ్యా - ఖ్యానింతు వినుము
సాధ్వి యాయమ భర్త - సాధువర్ణ వాఁడు
తగవును విడనాడి - తరుణిని వీడి
ధననారి వలఁబడి - దాని కూఁడఁదిని
నెఱదంట యనుపేర - నెగడి జూదమున ౫
ద్రవ్యమ్ము వెచ్చించి - తద్వ్యయమ్మునను
వండలు గెలుగుచు - వలచిన వేశ్య
తక్కిన వారును - తఱుముట వలనఁ
జే విదుర్చుకొని ము - చ్చిరుచు యోచించి
వంగదేశమ్మును - వణిజులఁగూడి ౧౦
కడలిఁ జనుచునుండ - సుడిగాలివలన
సుడివడి పడవయుఁ - జెడి వడి మునుఁగ
నొక విఱిగిన కఱ్ఱ - నూఁతగఁ గొనుచు
నీఁదుచుఁ దరఁగలు - మోఁదఁగ నేగి
నగ్నచారు లయిన - నాగు లున్నట్టి ౧౫

* ఆర్ద్రాశబ్దభవము

కొండ ప్రక్కంజేరి - యుండె నాతండు
పడవ పగులc దన - వలె గట్టుచేరు
వారూరు చేరి యా - పడవ మునుంగc
జచ్చినవారితోc - జచ్చె సాధువన
విని యార్ద్రిదుఃఖించి - విలపించి యంతc — ౨౦
గాటc జల్లముత్రవ్వి - కట్టెలు పేర్చి
యనలంబు దరికొల్పి - తన పతి కర్మ
వశమునc కేరిన - పదము చేర్చుమని
యనలుని ప్రార్థించి - యగ్గిలో దుముక
వేసిన పడకయు - మూసిన కనవు — ౨౫

కాలక పూసిన - గందమ్ము చెడక
పూసరముల పొల్పు - పొలివోకయుండ
నిందీవరస్థ యా - నిందిరవోలెc
బాగయ కుండంగ ని - వ్వాను కాల్పలేని
దుర్భగ నేనెట్లు - దోరుదు ననుచుc — ౩౦
గొంతెత్తియేడ్వ నో - కోమలీ! వినుము
నీ భర్త కెరటముల్ - నెట్టంగ నేగి
నగ్నచారణులగు - నాగులున్నట్టి
కొండను చేరి నాc - డుండc డచ్చోటc
జాలకాలము దాcకc - జంద్రదత్తుcడను — ౩౫

వణిజునితోఁగూడి - వచ్చి నిన్జేరు
నీ దుఃఖమును వీడు - నీరజాక్షియని
యొక వాక్కు - వినఁగఁ గా - టుక కంటి నీరు
కాఱనేడ్చుట మాని - కలికి నీరాడి
చింతవిడిచి యిల్లు - సేరి నా భర్త ౪౦

వడివచ్చుఁ గాకని - వ్రతము లొనర్చి
శరదమ్మ కరియు నా - శ్చర్య చర్యగల
పతి రతలును మ్రొక్క - భవ్యాత్మయమ్మ
నచట నాయమ భర్త - యంభోధి దరిని
గిరి క్రింద నొక తరు - వరమూలమందు ౪౫

కడలి నీఁదిన పను - బడలికవలన
నొడలు మఱచి కూర్కు - నొందిన యంత
నాగిరి వసియించు - నాగులు నియమ
మరయని మోఱకు - లందు నిద్రించు
నాతనిఁ గని చూసి - యాతండు మిగుల ౫౦

నలసి నాఁడొంటరి - యై వచ్చినాఁడు
వీని క్రొవ్విన మేను - విందు నేఁడనుచు
వాని నిద్దుర లేప - వారల నొడులు
నెరసులు లేకాడ - చేర్చినవాఁడు
కావున నాక్రూర - కర్మలు దాల ౫౫

నిలిచి గౌరవమారఁ - బలికిరి మాకు
గురుఁ డొకండు గలండు - జరగుద మటకు
నన వారితోఁ జని - యట మద్యఘటము
లధిక దుర్గంధమ్ము - లగు కఱకుట్ల
సరముల కడఁ బెను - కరములతోడఁ ౬౦

దన పెంటితోఁ గూడి - తనరు నెలుంగు
కరణి నుండిన నాగ - గురు సౌరు గాంచి
వాఙ్మధురిమ వాని - వశపఱచుకొని
చెలిమి చేసి ని పె - జెట్టు క్రీనీడఁ
గూర్చున్న పిదప నా - గురుఁడు నీవిటకు ౬౫

వచ్చు కారణమేమి - వాక్రువ్వ మనఁగ
నీతఁ డంబుధిఁబడ్డ - యుగచాట్లఁ దెలుప
నీరు తిండియు లేక - వారిధి నీఁది
యలసి నాతఁడు గాన - నన్నంబు నీరు
కల్లు మాంసము తోడఁ - గలికి నొక్కర్తు ౭౦

నిండన నదివిని - యెదవడి నిలిచి
సాదువు దోష వ - చస్సులు వింటి
వలదన నాతండు - పడఁతిని తిండి
వదలిన ధరణిపై - ఫలవంత మేది
కలదు? కలిగనేని - తెలుపుమ యనుచుఁ ౭౫

గినిసి పలుక సాదు - వనియె నిరితిఁ
జెడుకల్లు నానుట - జీవ పథమును
నిష్కల్మషులు బుధుల్ - నిందించినారు
పుట్టినవారలు - గిట్టు చుండుటయు
గిట్టినవారలు - పుట్టు చుండుటయు ౧౦

నిమర మెలంకువ - పదురగు నిజము
సద్ధర్మమొనరించు - జనములు పుణ్య
జగము లొందుటయు దు - ష్కర్మముల్ నేయు
వారలు నరకానఁ - బడుటయు నిక్క
మని యెఱింగిన విజ్ఞు - లవి వలదనిరి ౧౫

అన వికటంబుగా - హాసంబు చేసి
మరణించు జీవులు - మైగొని మరల
జనియించు నని వచిం - చినది నిక్కంబ
యేని యాజీవ మే - వైనానఁ బోయి
వేఱుదేహంబొందు - నారహి విశద ౨౦

రీతి మాకిట విన - రింపుమ యనుడు
సాదు విట్లను నీర - సము లేక వినుము
జరుగుచున్నది కాంచి - యరయంగఁదగుదు
వొడలిలో నీజీవుఁ - డుండ వేఱొక్క
మేను జీవుఁడు వీడ - దానిని వఱకి ౨౫

యగ్గివెట్టిన నది - యరయుదు కాన
నొడలిని వీడిన - దొండున్న దనుచుఁ
దెలిసిన నీవు త - ద్దేహి చరించి
విడియ నొండొక చోటు - పడయుట నేన
కాదెల్ల వారలు - కని యెఱుంగుదురు ౧౦౦

దేహ మిచ్చుట నుండ - దేహి పెందవ్వ
చేరుట కలయంను - నారయుచుండు
వెటకేని యీ జీవుఁ - డేగి చేయుటయుఁ
దన దేహమునఁ జొచ్చి - తాఱుచుండుటయు
నరయుము యని సాదు - కరుణతోఁ దెలుపఁ ౧౦౫

గ్రూరదృష్టుల నాగ - గురుఁ డాలకించి
బాగు నెఱిఁగి పెట్టి - పదగుల వ్రాలి
కల్లు మాంసము వీడి - కాయంబులోని
జీవుఁ గావఁగఁజాల - జీవితావధియుఁ
దమ యనుభవమైన - దారియుఁ దెలిపి ౧౧౦

సద్ధర్మములు మాకు - సరవిఁ జెప్పుమన
నతఁడు బాగుగఁ బలి - కితి విది వినుము
సన్మార్గమున నెప్డు - జరుగుము నీకుఁ
దెలియు మార్గం బుప - దేశింతు వినుము
పగులు కలముఁబోలు - పాప మైకొఱకు ౧౧౫

పలుప్రాణులను హింస - పఱుచుట మాను
వారు సాయపడి కా - పాడుచుండుదురు
ముదిసి నైజంబుగ - ముగియు జీవులను
నడుమనే చంపుట - న్యాయ్యంబు కాదు
ఏ ప్రాణి యెడనేని - హింస వీడుమన                    ౧౨౦

మావల్ల నైనంత - మట్టు ధర్మంబు
సలుపువారము నీకు - వలయు వస్తువులు
వలసినంత కొనుము - కలముల ముంచి
నరులఁ దింటిమి వారి - నగలు ధనమ్ము
లట రాసులై యుండె - నగురు చందనము                    ౧౨౫

కుప్పలు తిప్పలై - కోఱలుఁ గై కొనుమ
యని యొప్పగించెఁ జే - కొని యతఁడుండి
చంద్రదత్తుం డనఁ - జను వణిజుండు
వంగ దేశమునకు - రంగార నేగు
తరణిలో నెక్కి యీ - పురమునఁ జేరి                    ౧౩౦

యీాయమతోఁ గూడి - యిష్టభోగములఁ
బొందుచు బహుదాన - ములు సేయుచున్న
వాఁడట్టి యార్ద్రి చే - వదలు బిచ్చంబు
కొనఁ మన లోనికి - మణిమేఖల చని
మాటలాడని ప్రతి - మంబోలె నిలువ                    ౧౩౫

నాదిక కని వచ్చి - యంజలిచేసి
వలగొని వింతల - వలఁ దెగఁగోసి
యున్న యయ్యాను పాత్ర - మొగి నిండి మితను
ముట్ట నాఁకలి నొవి - పొనుఁగుఁ గాకనుచు
నార్ద్రి గారవమున - నన్నంబు నిడియె. ౧౪౦

## ౧౩. మండపము చేరుట

పతి భక్త చేతి యా - పంచిన భిక్ష
గొన్న పాత్రంబున - యన్నంపుటుండ
ధర్మ సంపాదిత - ధనరాశి ధగ్మి
తన త్రోవ వాడిన - యనువున నామె
చేకొను వారల - చేతులు నొవ్వ ౫

జీవులు సంతృప్తి - చెందుచుండుటయుఁ
బాత్రాన్న మక్షికేడి - పగిదిని గాంచి
యేనుఁగు తీపుచే - నెదఁ గుందుచున్న
కాయ చండిక నమ - స్కారమ్ముచేసి
పర్వత నారదుల్ - పదరి తామిడిన ౧౦

శాపంబుచే హరి - స్వస్థత చెడఁగఁ
బుడమిని జనియించి - కడలి బంధించు
పట్టునఁ గ్రోఁతులు - పడవైచు గొప్ప

యద్రులు జలధిలో - నడఁగిన రీతి
నిడిన యన్నంబుచే - నడఁగని వట్టు ౧౫
టాఁకలి పూర్వ కృ - తాపరాధమునఁ
బొందితినో యన్న - పూర్ణ ! నాబాధ
నడఁగింపుమా యని - యర్థించి మ్రొక్క
చేతి పాత్రము నిండి - చేకొన్న యన్న
మామె చేతం బెట్టు - నంత భుజించి ౨౦

యెన్నండు నాఱని - యెసరు నాఁకలియుఁ
బొనుపడ మణిమేఖ - లను వింతించి
యనియె విద్యాధర - జనలోకమందు
కాంచన పురమొండు - గలదందు వెలయు
దానను దుర్విధి - తలఁబెట్టి త్రోవ ౨౫
భర్తతో మలయంబు - పరికించు నాస
నరుదెంచి సెలయేటి - దరినున్న యిసుక
తిప్పపై నొకచోటఁ - దిరుగుచునుండ
జండెంబు తిరులైన - జడలు వల్కలము
చెలఁగిన వాఁడు వృ - శ్చికుఁడను తపసి 30
తాటి పండంత నే - రేటి పండొండు
కొను నందుంచి యే - టికి నాఁడఁబోయె
దుర్విధి ప్రేరేప - గర్వంబుతోడ

నీల్గుచుఁ బోయి దా - నిని కాలఁదన్ని
చిదచిదఁ జిదియంగఁ - జేసితిఁ దపసి ౩౫

తిను వేడ్క - వచ్చి నా - తీరును గాంచె
నలఁగిన పండును - నన్నును గాంచె
నఱకాలి మంట చె - చ్చెఱ నెత్తికెక్కె
నీ పండు దివ్యమై - యొసఁగుఁ బండ్రెండు
వత్సరమ్ముల కొక్క - పరి యొండు పండు ౪౦

దీనిని దినువారు - తిరుగఁ బండ్రెండు
వత్సరముల దాఁకఁ - బసి నొందఁబోరు
మూన్నాలుగేండ్లకు - మొగి నొక్కమాఱు
భుజియించు వ్రతమును - బూనిన వాఁడ
నా భుజించెడి పండు - నలఁచితి విట్లు ౪౫

మగువ! గగన చర - మంత్రంబు చెడఁగ
నేనుఁగు తీపుచే - నిడుమల నొంది
పదియు రెండేండ్లకుఁ - బండిన పండు
నేఁ దిన్న మీఁదట - నీ గొద యుడుగుఁ
బొమ్మని యమ్మని - గ్రమ్మన నొసఁగు ౫౦

శాప మిన్నాళ్లకు - సమసె నీ వలన
గొదఁగుంది యమ్ముని - కుంజరుఁ డేగ
మలయంబు గను వేడ్క - మాని వీడితిమి

ఆత్రంపుఁ జెయిదికి - సంకిలి నొంది
మద్భర్త చింతించి - మఱి దైవగతికి ౫౫
వగచి ఫలంబేమి ? - వగవంగఁ దెచ్చి
కొంటి వియ్యాది లెమ్మ - యింటికి ననిన
మంత్రంబు మఱచితి - నాంత్రముం గలఁచు
బాధ మిక్కుటమయ్యెఁ - బసి పెల్లురేఁగె
భరియింపఁ జాల దు - ర్భరమయ్యె నంటిఁ ౬౦

గాయ లాకులు పండ్లు - కందముల్ దెచ్చి
యిచ్చిన నాఁకలి - యీఁగద బాధ
దుస్సహ మగుడు నా - తోడ నాభర్త
ద్రవిడ దేశమున స్థి - రంబైన లక్ష్మి
కలవార లనుకంప - గల వార లబల ౬౫

బీదల పాలిటి - పెన్నిధానములు
అనదల పాలిటి - యమర ద్రుమములు
పొలుపారు కావేరి - పూంపట్టనమునఁ
గలరు పెక్కు దినాలు - కడచననిమ్ము
నడచి యే చనియందు - కడపుము గడువు ౭౦

పతి యిట్లు పల్క నే - వసియింతు నిచట
నిద్రోత్సవ దినాల - నేతెంచి భర్త
నను విచారించుచు - నా బాధ కడచు

గడువు లెక్కిడుచు రాఁ - గల యోఁట దీఱు
నని చెప్పె నిరుడు నేఁ - డట్టులే యయ్యె ౭౫
నాఁగొద దీర్చితి - నతు లివే సీకు
నింకఁ గాంచన పురి - కేగెడు దాన
భవ దుఃఖములఁ బాపు - పావన మాని
వరులు పల్వురు చక్ర - వాళానఁ గలరు
ఎల్లవారలు వచ్చి - యేగుట కొంఱకు ౮౦
వాకిలి తెఱవంగఁ - బడియుండు సతను
ధర్మమండప మొుడు - తనరారు చుండు
నట నెంద ఱెందఱో - యూఁకటఁ గుందు
వారు తీఱని నొవ్వి - పడువార లిడెడి
వారుంటచేఁ జేరు - వా రటకేగు ౮౫
మని కాయ చండిక - యరిగిన యంత
నేఁడ వీధిని మణి - మేఖల యొుక్క
ప్రక్కనొదిఁగి పోయి - వలగొని మ్రొక్కి
యమ్మండపం బెక్కి - యందొక్క యోర
నిలిచి యందలి వారు - పలువురు మ్రొక్కి ౯౦
పొగడు చంపావతి - పొలుచు కోవెలకుఁ
ద్రికరణశుద్ధిగఁ - దెలచి యెల్లరకుఁ
బూర్వకారణము తె - ల్పుచు నుండు కంబ

పతిమను వినుతించి - భాను తాపమునఁ
బొనుపడు నడవికి - ముంగారు వాన ౯౫

కొమరున నాఁకటఁ - గుందుచున్నట్టి
జనులకుఁ జేతి య - క్షయ పాత్రఁజూపి
గోపుత్రకుని చేతఁ - గొఱలు పాత్రమిది
ఆఁకలి గొన్న వా - రందఱు రండు
రండనఁ జని యోగి - రము గొనువారు ౧౦౦

తిను వార లిదనది - విని వచ్చువారు
చేయు కల కలమ్ము - చెలరేఁగె నచట.

## ౧౮. ఉదయుఁడు మండపము చేరుట

అది విని పుంటిలో - నగ్గి నెఱ్ఱనగు
బల్లెమ్ము చొనిపిన - పగిదిఁ దపించు
నుల్లంబు నందలి - యెల్లను మీఱు
నెంజిలితో లోన - నిలుకడ చెడిన
యలమట తోడ నూ - ర్పులు పుచ్చిలేచి ౫
యీ వ్రత ధర్మమ్ము - నీటు గావింతు
ననుచుఁ జిత్రావతి - యాట వెలఁదుల
కిట్లనుఁ గోపలుఁ - డీల్గిన పిదపఁ

దత దుఃఖమంది మా - ధవి మునిపల్లె
చేరుట నవ్వుల - చేటయ్యె మనకు ౧౦

నీ గొప్పపురమున - నిది తగువాడి
విజ్ఞానులకు నాట - వెలఁది పతివ్ర
తాత్వమనంగ ను - దాహరణమ్ము
పరిహాస పాత్రమై - పరిభవిల్లినది
ప్రియుఁ డాపదం బొంద - వీడని యసుఱు ౧౫

తో నేడ్చి చల్లని - తోయంబునందు
మునుఁగు వారికి రణిఁ - బాగ లేక ముందు
చితిలో దునుకు కుల - స్త్రీల కై వడిని
పతిరతలము కాము - పైఁడి కాంతలము
పలువుర చేతి కూ - డెలమి భుజించి ౨౦

వైణి కుం డిలుగఁ న - వ్వానితోఁ బోక
నిలుచు వీణియవంటి - నెలఁతలము కద!
మధువున్న వేళ న - మ్మతి నాని ఫల ౹౹
వఱలని యెడఁ బూల - వదలు తుమ్మెదల
వంటి వారము కర్మ - ఫలము తీఱు తఱిఁ ౨౫

బద్మాలయను పోలు - వారము మనము
పురుషులు చేపిడఁ - బొగులుచు ననద
వేస మూనుట లోక - విదురులు నవ్వ

మొయివడిగద మణి - మేఖల యనెడి
లతిక పుష్పించు కా - లముఁ బ్రతీక్షించు ౩౦
న దయ కుమారుఁడర్క - కొదమ భృంగమ్ము
విమలమా హృదయమ్ము - వేడ్క వహింప
వికసించి నట్టి క్రొ - వ్విరి చేతఁగొన్న
పాత్ర తిరిప గాంద్ర - పాలు గావించి
యుదయుని తేరిపై - యువతి నెక్కింప ౩౫
నేని * యింటిక రాల - నేడింటి నెత్తి
నెత్తించుకొని రంగ - మిమ్ముగఁ జుట్టి
నిందనొంద బ్రదుకు - నీచంపు లంజ
నై యాట వెలఁదుల - హాసు మేడలకుఁ
బోనని శపథంబు - పూనితి ననుచు ౪౦
నెదనుండి పెనుపొగ - లెగయంగ నూర్చి
బూమె పల్కుల నొక - పోల్కి నూఱడిలి
వెలఁదులు కొందఱు - వెంబడి రాఁగఁ
జెమట బొట్టులు మేనఁ - బొటమరింపంగ
నగరి వీదిని కాలి - నడకతో నరిగి ౪౫
యుదయుఁ డుండిన యెడ - కొదుఁగుచు డాసి
రొదసే యుచున్న తు - మ్మెదలును తేంట్లు

---

* వ్యభిచరించిన వారి నెత్తిపై ఏడు కాలిన యిటుక రాలుంచి ఊరు చుట్టించి వదలుట పూర్వకాలపు దండనము.

ముసరుచుండెడి పోఁత - యిసుకపై నొక్క
ప్రక్క బంగరుగోడ - పగడంపుఁ గంబ
ములతోడ నొప్పిన - ముత్యాల చవికెఁ ౫౦

జిత్ర వితానమ్ము - జిగు లీనుచుండ
స్ఫటిక కాంతుల యలల్ - పరవు మంచమునఁ
బరిశుద్ధ పుష్ప త - ల్పమ్మునఁనుండి
యలల పోలి విరిసి - యొలయు చామరలఁ
దరుణులుగొని యిరు - దరి నిల్చి వీవ ౫౫

నుదుటున నొప్పారు - నుదయుని పాద
ములకడ నిల్చి కే - ల్మోడ్చి జయమ్ము
పలుక నాఁడు రద - మ్ములు కొంత తెలియ
మందహాసముచేసి - మాధవితోడ
మణిమేఖలయు నొందు - వహాని వేషములు ౬౦

దోసము లేనివై - తోతెంచు నవియె ?
యన నది యిట్లను - నరుదైన పరువు
మాలతి లతక్రింద - మాణి కాంచి పూచె
నిల భరతమ్మునఁ - గలకంఠరవము
నెమ్మి నృత్యము గని - నెమ్మది చెందె ౬౫

భ్రమర ముదయవేళఁ - బరికింపదేల ?
యని వేగ వచ్చితి - నయ్యా దీయూర

మననంబు కడనుండె - మండపమందు
'విజయీభవ' యటంచు - వెలఁది పల్కంగఁ
గలను చెడినతఱిఁ - గడలిలో మంచి ౨౦
పడవ దొరకు రీతి - పరిఢవిల్లంగ
నుదయుండు ముదమంది - ముదిత కిట్లనియె
స్ఫటిక మండపమున - జానైన క్రొత్త
ప్రతిమ చిత్రమనఁగ - వదలితి మున్ను
కైకట్టు కడు నొత్తఁ - గఠిన స్తనములఁ ౨౫
బగడంపు బిగిమీఱి - జగడాలు గొలుపు
ముత్యాల కోవలో - మొలచిన యమృత
కాంతుల నానంగఁ - గాంక్ష దలిర్ప
నలుపుఱేకుల కలు - వల వెక్కసెట్టి
బల్లెముం గెలిచిన - నల్లని మీలు ౩౦
లేవఁ దెలివి వేఱు - త్రోవయ్యెఁ దనకు
నని చెక్కిలోఁ జెప్పు - నట్టి యందంబు
స్ఫటిక గీమునఁ గానఁ - బడినట్టి ప్రతిమ
నాయుల్లమున దాఁగి - నన్ను రక్షించె
నడురేయి యటనుండ - నా యెట్టయెదుట ౩౫
బంగరు కళుకుల - పసమీఱు మేను
గలయోర్తు నిలిచి చ - క్కటి దెల్పి తపము

వలచిన కన్యక - పైఁగల వలపు
మఱతు గాక నె నామె - మరులు దయ్యెమ్మొ!
వేలుపో? యెఱుఁగను - విభ్రమపడితి ౯౦

నని యుదయుఁడు పల్క - నమ్మది ముదిత
చిఱు నగవూని యో - చిన్ని మారాజ!
ఆ చింత విడుము కా - మాసవ మాని
మత్తుచేఁ జేయు ను - న్మాద చేష్టితము
లెన్నియో వేల్పుల - యెడను పెక్కయ్యె ౯౫

గౌతము భార్యపైఁ - గామంబు గొన్న
యమరాధిపతి సహ - స్రాక్షుఁడై నదియుఁ
బ్రాలేయగిరి శర - వణ మందు సప్త
ఋషుల భార్యలను మో - హించిన యగ్ని
కాతని దార స్వా - హాదేవి తత్త ౧౦౦

దుచిత రూపమ్ముల - నొంది స్వభర్త
మక్కువ దీర్చుట - మఱచితి వేమి?
ప్రభువుల కన్నెకా - వలి పెండ్లి పిదపఁ
గావలి పతిచావఁ - గావలి నెఱిసి
గాంచి పరులు వరుల్ - గానంగ నీక ౧౦౫

యుంచు నాతఁడుగాక - యొగి వేలుపులును
సమ్మతింపని కుల - సతుల వంశమునఁ

బుట్టిన యదికాదు - భూజనుల్ కాంచ
రంగమెక్కి తనదు - రంగంగు చూపి
ఆటల పాటల - హాసు గాన్పించి ౧౧౦

చెఱకు తుంటల విల్లు - చిఱుదేటి యల్లె
పువ్వుటమ్ముల లొక్కైదు - మొగ్గ కటారి
నంగజుండెత్త వా - లుం గన్నులనెడి
యీడుపు వలవైచి - యీడ్చి యెడ్డలను
హరియించి యుడుగక - యందు తాఁజొచ్చి ౧౧౫

తియ్యని పలుకుల - తీపులెత్తించి
పలువిధ ధనధాన్య - ఫలము లంబొంది
తేనె వట్టిన విరిఁ - దేఁటి చందమునఁ
దొలఁచెడి వెల వెలం - దుకలఁ గ్రమమున
నిలిపి యక్రమ పద్ధ - తుల నడఁగించు ౧౨౦

కులధర్మ రక్షణ - కువలయేశ్వరుల
కారయ ముఖ్య కా - ర్యంబుఁ గాదె?
యనుడు నుదయు నుల్ల - మల్ల చలింప
వాజులఁ బూన్చిన - పసిఁడి తేరెక్కి
మణిమేఖల వసించు - మండపమునకుఁ ౧౨౫

జని, దుర్గ యాంకలి - చనఁగేలఁ బాత్ర
గొని నిల్చి తినిపించు - కొమరున నొప్పి

యాఁకొన్న జీవుల - కన్నంబు నొసఁగు
పాత్రంబు చేఁగొన్న - పడఁతిని గాంచి
నెఱి మీఱు వలపుచే - నిలుకడ చెడిన ౧౩౦

తనువుతో నాయుల్ల - మునఁ జొచ్చి, దాని
నాక్రమించిన దొంఁగ - వధిక వ్రతములు
చేసి భుజించు నీ - జీవిక గాథ
తపమూని తిరిపంబ - తమి నారగింపఁ
గోరు కారణమేమి? - కోమలీ! యనుచు ౧౩౫

నొంటరియై తాన - యోగి డాసి యడుగు
టుత్తమ మని యెంచి - యుదయుండు చేరి
తాపసి వగుటేల - తరుణి! తెల్పుమని
సాహసించి యడుగ - సారసనేత్ర
మును నన్ను వలచిన - భూపుత్రుఁ డితని ౧౪౦

పదముల కెరఁగుట - పరమ ధర్మంబ
యని మ్రొక్కి హృదయంబు - నతనిపై కేగ
నితఁడు మున్నేయొక - నృప కుమారితను
చేపట్టినను పూర్వ - చిర పరిచితుని
కడ వాదులాడుట - గాదంచుఁ దలఁచి ౧౪౫

ప్రశ్న కుత్తరమిత్తుఁ - బ్రాజ్ఞుల వలన
విన్న పీఠులగుమన - వినఁదగు నిదియుఁ

బుట్టుట పెరుఁగుట - ముప్పులనొంది
కార్శ్యమందుట చావు - గలయది మేను
పల్లిదుమల కాట - పట్టు మానవుల ౧౫౦

తనువని పరికించి - ధర్మమాసించి
యిట్టులై తిఁ బెనుపోరు - లెసఁగ నడంచు
మత్తకరీంద్రంబు - జూడ్కి వారలకు
నాఁడు వారలు తెల్ప - నష్టహా గొప్ప
యర్థంబు లేదిల - నైన నీ విషయ ౧౫౫

మాలించి యవ్వలఁ - బోలిన తెఱఁగు
గావింపు మని యట - భూవర తనయు
వదలి యక్కన్నె చం - పావతి యున్న
* గుజ్జరి కోవెలఁ - గుదురుగఁ జొచ్చి
మగవారి చెయిది నె - ఱుఁగు వారలెవ్వ ౧౬౦

రనుచుఁ జంపావతి - యడుగుల కెరఁగి
మంత్రమ్ము మదిని ము - మ్మాఱు జపించి
కాయచండిక రూపు - గైకొని వచ్చి
వెలుపలఁ గనఁబడఁ - దెలియక యుదయుఁ
డా గుడిలోనికి - నరిగి పాత్రమును ౧౬౫

* ఘూర్జరులు శిల్పమునఁ బ్రసిద్ధులు. వారు నిర్మించిన కోవెల

కాయ చంద్రిక కిచ్చి - మాయచే డాఁగు
నా మనోహారిని సు - న్నపు బొమ్మలందు
తెలియుకెట్లిది యని - తెలియంగఁ జూప
వేని యెన్నాళ్లైన - నిటఁబడి యుందు
దేవి! ప్రవాళంపుఁ - దీరగు నోరు ౧౭౦

కాటుక వెట్టని - కన్నులు తేట
చిఱు నగవును వింటేఁ - జెవయు కనొ్బొమలు
అంకుశమై దోఁటి - యై బరిగోల
యగుచు లోఁగొన విద్య - యనెడి మావంతు
చేఁగాఁపు వలవై చి - చిన్నారిపలుకు ౧౭౫

లను వీణతోఁ జెల్వ - నమరించు వేద
వాక్కు-లఁ జూపించి - వరదంతి నొంఁడు
వేఁటాడికొని పలుకు - వేల్పు! నీ గుడిని
చేరు దానిని వీడి - యూరక పోవఁ
జాల నొట్టిడితి నీ - చరణంబు లంటి ౧౮౦

యీ కోర్కి దయచేయు - మో కలాదేవి!
యని యచ్చటన యుద - య కుమారుఁడుండె.

## ౧౯. చెఱసాల ధర్మశాల గావించుట

చంపావతీదేవి - చరణంబు లంటి
ముమ్మాఱు వలగొని - మ్రొక్కి రాకొమరుఁ
డొట్టిడి కూర్చుండ - నురు దయామతిని
రాఁగల దెఱుఁగక - రాజకుమార !
శపథంబు చేసితి - చనునె నీ కిద్ది ?          ౫

యని నేరుపున శిల్ప - లోనరించియున్న
యొక్క చిత్రంబున - నుండిన వేల్పు
పలుకంగ విని యెద - కలఁగ నాతండు
చెఱవడ్డ తెఱఁగునఁ - జింతించి కుంది
యామెను మఱవుమ - యని యదలించి          ౧౦

యాజ్ఞ గావించు ద - య్యాను పల్కు మహిమ
మొందఱ యాఁశలి - నేని తొలంపఁ
గరమునఁ దాల్చు భి - క్షాపాత్ర మహిమ
ము గురు తల్లులఁ దొలి - దగు సరస్వతికిఁ
దప్పుజేసితి వని - దైవాఱఁ బ్రతిమ          ౧౫

పలికిన పలుకులఁ - గల మహిమమ్ము
నేర మెట్టిదొ? మణి - మేఖల చెయిది
యందు పదంపడి - యరయుద మనుచు

లేచునంతఁ దుఱంగ - లించు విశాల
ముఖము గలుగు భూమి - మొగిఁ దమి మ్రింగ ౨౦

సంజ యన్నొసలుపు - చంద్రవంక యను
కోర గలుగు నీల - వారణ మోడు
హస్తిపకుఁడు లేక - హస్తంబు చాఁచి
బంభరమ్ములు క్రమ్మ - వాసన గలుగు
మద మగ్గలింప భ్ర - మమునఁ గాల్ద్రివ్వ ౨౫

క్రమము తప్పిన రీతి - గాఁ దొడరుటయు
నగర విటులు వెల - మగువల తోడ
మకర వీణియ యందు - మైత్రస్వరముల
మీఁటి స్వరైక్యంబు - మీఱ సౌరైన
తాళ క్రమంబునఁ - దగు వాఁడి భల్ల 30

ముల్లంబుఁ జీల్పంగ - నోర్వని యెడఁద
యందలి పొగతోడి - యగ్గిరాజంగఁ
గాలిమి తిత్తింబోలెఁ - జెలఁగ నిట్టూర్చు
చుదయ కుమారుఁడు - కదలిన పిదప
నున్న దేవళమున - నురువు వేఱుగను 3౫

గల మణిమేఖల - తలపోసి తుదకు
మాధవి తనయగా - మండప మందు
తిరుగు చుండిన రాకొ - మరుఁ డూరకుండఁ

డనుచుఁ జేరెఁ గలి - నట నుండి నట్టి
కాయచండిక నూరఁ - గల జన మెఱుఁగు ౪౦

నని యామె రూపము - కొని గొదగొన్న
వారలకుం దోడు - పడుట చేయిచ్చి
యెదుట తిరియు వారి - కడకేగి యెదుట
ఘనుల యుత్తమ మార్గ - మనిరి సద్విదులు
కావున శారద - కోవెలలోన ౪౫

నుంచిన పాత్రముం - గొంచఱచేతఁ
గొని వీథులం దేగి - గొద గొన్నవారి
కొసఁగుచు దండితు - లున్న కారాగృ
హమునఁ బ్రవేశించి - యటనున్న వారిఁ
గాంచి నిట్టూరిచి - కరఁగి చింతిల్లి ౫౦

యేడిచి యట బువ్వ - కేఁకరుచున్న
జనుల చేతులు నిండ - సాదంబు వెట్టి
కుడుపంగ వారికిఁ - గుడిపిన పాత్ర
మొక్కటేయని చాల - నక్కజ మంది
కావలి వారలు - భూవరు కడకుఁ ౫౫

జని పాత్రదానము - చాన చెద్దియును
గొప్ప మహిమ తోడఁ - గూడిన దనుచు
మనవి చేయుద మని - మదిఁ దలపోసి

చని విష్ణుమూర్తి వా - మనుఁడయి చూడఁ
జూడఁ బెరిఁగి పెను - పోఁడిమి నొక్క- ౧౦

యడుగునఁ బుడమిఁ దా - నడఁచిన నాఁడు
జలధార వీడిన - బలి వంశమందు
జనియించిన నరేంద్రు - తనయ శీర్తియను
దేవితో మొగ్గలు - తావితో నలరు
నలరుల తోఁటలోఁ - ఁలఁ బ్రవేశించి ౧౫

యెల దేంట్లు వేణువు - నెలసాన నొత్తఁ
దుమ్మెదల్ వీణా ర - వమ్మొనరింప
జాతీయ గీతికా - సమితి కోకిలలు
పాడంగ నెమ్మలి - యాడుచు నుండు
విరుల పందిరిఁ గాంచి - వేడుక నంది ౨౦

హంసిని వీడిన - హంసమ్ముతోడ
నమ్మల జత ఱెక్క - లిమ్ముగా విప్పి
వలయమ్ముగాఁ జుట్టు - వానిని గాంచి
యలరి వెన్నుండును - బలియును నీల
యాడిన జైత్ర మి - య్యది యగు నంచు ౨౫

కని గోఁగు పూవు చే - రిన మావి పిందె
తో నున్న నెమిలిని - జానగు పైఁడి
గిన్నెలో పాలచు - కీర పోతమున

కితవునఁ గుడుపు మే - ల్ప్రతిమ యాననుచుఁ
బ్రణయ కోపమ్మునఁ - బఱచు చున్నట్టి ౧౦
వానరి నూరార్చి - వనచరం బొందు
చెలుల యుయ్యాలలోఁ - జేర్చి యాడించు
చుండుట గని యొయ్య - నొయ్యన నవ్వి
పచ్చని వెదురుతో - నచ్చంపుఁ బూవు
లమరిన తెల్ల క - డిమిఁ గాంచి శౌరి ౧౫
బలరాముఁడును నిల్చు - వలనయ్యె ననుచు
నంజలి ఘటియించి - యలరి నుతించి
యాటతో నభినయ - మరసిన వారు
కావ్యనాటకములఁ - గడు విమర్శించి
తెలియు వారలు వీణఁ - బలికించు వారు ౨౦
పసగ మృదంగమ్ము - వాయించువారు
గమకముల్ క్రొవిని - గలిగించువారు
పాటలు సొంపుగాఁ - బాడెడి వారు
విని తల లాడించి - వివశులౌ వారు
తెగిన హారమ్ముల - మొగిఁ గ్రుచ్చువారు ౨౫
చందనమ్ము మెయి న - లందెడు వారు
కుంకుమ స్తనముల - కు మ్మెత్తువారు
కలువ రేకుల హార - ములు గట్టువారు

కురులఁ దావి విరులు - చెరివెడి వారు
మఱువుగ నద్దమె - దుర నిల్చువారు ౧౦౦
నై యింద్రునివలెఁ జని - యాటాడి యలసి
వన్నెల మల్లెలు - పొన్నలు జాజి
మాలతి పొగడ చే - మంతి మున్నైన
తరువుల కడ నిల్చి - తిరుగుచు నవ్విఁ
ముంగిస కుందేలు - మురిపంపు జింక ౧౦౫
రండని కోయని - రాణికిఁ జూపి
మరుఁడు వసంతుండు - మలయ మారుతము
యంత్రపు బావి క్రీ - డాద్రి ఝురంబు
విరుల పందిరియును - సరసు దీర్ఘికయుఁ
గూప మంతర్జల - కూపంబు దాఁగి ౧౧౦
వజలు చోటులు సౌరు - స్ఫటిక గృహములు
గల యెల్ల యెడలను - కాంతతోఁ దిరిగి
మగధదేశస్థులౌ - మణి కారకులు న
వంతి నాటను గల - స్వర్ణ కారకులఁ
యవన వర్ధకులను - ద్రవిడ కార్మికులఁ ౧౧౫
గూడి యొప్పిదముగఁ - గూర్చి వన్నియలఁ
గనుల పండువుసేయఁ - గల పగడంపుఁ
గోళ్లు మానికములు - గూర్చు బోదియలు

ముత్యాల సరములు - మురువుగ వంగు
కోణసంధులు శిల్ప - గురుత యొప్పారు ౧౨

మేల్కట్టు గలుగు చా - మీకర మంట
పమ్మున నింద్ర భో - గమ్మున మీఱు
రాజు మోదమునఁ జే - రఁగ ద్వారపాల
కులతోడఁ దెలిపి రా - సెలవంది లోని
కేగి చాఁగిలఁబడి - యొఱఁగి భూపాల! ౧౨౫

యీభూమి నాసించి - యెద విరోధించి
చతురంగ సేనతోఁ - జనుదేరఁ గాంచి
వారి యుత్సాహ ము - వారించు వీర!
ఘనకీర్తితోఁ గల్ప - కల్పంబు మనుదు
గాక! యియ్యది విను - కరుణామయాత్మ ౧౩౦

ఏనుఁగు తిపుచే - నెడలి కృశించి
యూరఁ దిరుగు చేష్ప - చుండిన క్రొత్త
చేడె యొక్కతె మన - చెఱసాలఁ జొచ్చి
తమ పేరు వినుతించి - తన చేతి పాత్ర
మున నుండి యట మూఁగు - జనములు తనియ ౧౩౫

నన్నంబు పెట్టిన - దవనీశ తిలక!
యనవుడు పార్థివుఁ - డయ్యామ యిటకు
వచ్చుఁగాక యనఁ గా - వలివారితోడ

నా చెలి యేతెంచి - యవనీశ తిలక
కరుణ వర్ధిల్లను - గాకని నిలువ ౧౪౦
నో తపస్విని! పేరు - నూరేది నీకు
నీపాత్ర మెక్కడి - దెఱిఁగింపు మనుడు
నయ్యమ యిట్లను - నయ్యా! భూపాల!
ఏను విద్యాధర - మానిని నొక్క
కతన నజ్ఞాతనై - కాఱియ పడుచుఁ ౧౪౫
దిరుగుచు నుండు నీ - పురమున నధిప!
ఈ చేతి పాత్ర మీ - యిచ్చటి మండ
పమ్మునఁ గలవేల్పు - నెమ్మి నొసంగె
నియ్యది దివ్య మ - హిమ గల పాత్ర
మేనుఁగు తీపును - హృదయానలంబు ౧౫౦
చల్లార్చినది జీవ . సంతతి కిద్ది
యాస దీఱంగ ది - వ్యాన్న మొసంగు
నన రాజు నానుండి - యవసర మున్న
నడుగుము యన నామె - యల్ల నిట్లనియె
చెఱసాల పడఁగొట్టి - కరుణామయు లగు ౧౫౫
ధర్మాత్ములకు శాంతి - ధామమ్ము గాఁగఁ
జేయుము చాలు హా - ర్దింతు ననంగ
చెఱసాలఁ జెఱిచి యా - వరసాధ్వి తెలుపు
పగిది ధర్మాత్ములు - పరము గొనంగ
ధర్మముల్ బోధింపఁ - దగు ధర్మశాల ౧౬౦
గాఁగ మార్పించె నా - త్మా రమణుండు.

## ౨౦. ఉదయ సంహారణము

మేటి రావని మణి - మేఖల కరుణ
నిరయ సమంబగు - చెఱ గదులందు
జన్మ దుఃఖము లొందు - జనములు కర్మ
ఫలముచే మంచి భ - వము గలవార
లైనట్లు నాల్గు స - త్యములఁ బ్రేమించు ౫

గుణము గలుగు బుద్ధ - కోవెల నెనరు
ఔదగల ధార్మికు - లెనయు పల్లెయును
బావన సాలయు - బోన సాలయును
దృఢ రక్షణము కల - దిగ నగునట్లు
మణిమేఖల యటకుఁ - జనుటయుఁ దనకు ౧౦

స్థిర కీర్తి నరపతి - చేసిన యదియు
నుదయుఁడు తలప్రీల - నూహాలు సేసి
ప్రజ్ఞగలారలు - పరిహాసించినను
రాజు కోపించినఁ - బ్రజలు నవ్వినను
వికృత వేషిణిని నే - పీడక పట్టె ౧౫

హేమరథంబుపై - నెక్కించుకొనుచు
వెలఁది నేర్చిన విద్య - వీనులు నిండ
వినుచు నీతుల మాట - వినిమెదఁగాక

యని లేచి పెక్కండ్ర - యాఁకలి దీఱ
మహఁతుక యొదిఁగిన - మండపమునకు ౨౦

నల్ల నల్లనఁ జని - యామెఁ గాంచుటయు
మొగులు క్రమ్మ్మ సిగర - ములు గల మలయ
గిరియందు వెదురులు - పెరుఁగు చిట్టట
ముని యొసంగిన శాప - మునకైన గహ్వర
కడచనె రాదేమి - కారణ మనుచు ౨౫

కాంచనుఁ డనువాఁడు - కాయ చ్ఛండికను
వేఱొక త్రోవను - వెదకుచు వచ్చి
సంగమపురిఁ జేరి - చదుకంబు పూల
తోఁటయుఁ దపసుల - వాటియు రచ్చ
కొట్టముల్ చవికలు - గుళ్లు రోయుచును 30
వచ్చి జనుల గొద - వనట దీర్చుటను
గని యట నిలిచి నీ - కరమున పాత్ర
మొక్కటే యయ్యును - పెక్కండ్రు కలరు
తినువార లేచఁగు - తీపెల్లు వోయె
నగ్గలంబై నొంచు - నాఁకలి తొలఁగ 35
వేలుపుల్ కరుణ చూ - పిర యేమి యనుచుఁ
బ్రామంతనములు జ్ఞా - పకముగఁ దెలుపఁ
దనుకని యెడఁద నా - తని కడనుండి

తొలఁగి యుదయుఁడున్న - తలమున కేగి
నరగలిగిన వృద్ధ - నారి నొక్క-తను ౪౧

కనిపించి తెన్మయుఁ - గట్టియున్నైన
యిసుక వన్నియ మాఱి - యిప్పుడు తెల్ల
యిసుక వంటి వయిన - యీ యమ కురులఁ
గాంచితే! చంద్ర రే - ఖను పోలు నొసలు
ముడుతలు పడియుండు - మురువు కాంచితివె? ౪౨

నరగల్లి తిరిగట్టి - నాసిల్లి యూచు
జడగంటివే? వింటి - సమమగు బొమలు
చూడవో? చేఁపల - చూపులుచూడఁ
గలవాళ్ల వంటివై - కానంగ నయ్యెఁ
గలువల వంటి క - న్నులు నీరు వట్టు ౫౦

గుంట పోలిక దాల్చు - కుదురు వీక్షింతె?
బుడగను పోలిన - ముక్కును గనుము
చీమిడి వదలి యీ - క్షింప రోఁతయ్యె
నాణి ముత్తెపుఁ గాంతి - యగు చిఱునగవు
నిప్పుడు కంటివే - యెటవోయి డాఁగె ౫౫

సొరవిత్తులం బోలెఁ - జూపట్టు పండ్లు
ఎటువోయె? బోసి నో - రిట నిల్చెఁ గనుము
చివురుచు దొండను - చెనయు కెమ్మోవి

యే మయ్యెనోసుంత - యెఱిఁగితి వేమి?
రసిగల పుంటి క - రణి నీచు కాఱి 80

వాడిన దంటు నా - వ్రాలిన చెవులఁ
గ టివె? కండలు - కరఁగి పెల్లెండు
కర్జూరముం బలెఁ - గనఁబడు మేను
పరికించితే? యుబ్బి - ప్రబ్బిన గబ్బి
గుబ్బలు నేమయ్యె - గొలగొల యగుచు 85

వట్టి తిత్తుల వలె - వ్యర్థమైన యవి
వ్రాలు టెుంకాయాకు - వలె వ్రేలుకేలు
కానవో? నరములు - కానరాఁ దోలు
సడలి శంఖమ్ముల - సంగతి వదలి
సన్ననయిన వ్రేళ్ల - సవురు కాంచితినె? 90

ఆనఁటి కంబము లట్టి - యుంగైన తొడలు
మొగిలి యూఁచలు వాడు - వగయయ్యెఁగంటె?
అమ్మల పొదిఁ బోలి - నట్టి మీఁగాళ్ల
రంగు గాంచితివె? స - రమ్ము లెమ్ములును
బయలు వడ్డ తలిరు - పదముల స్థితిని 95
తెలియవో? యెండి ము - దిరిన టెంకాయ
రాలుట చూడుము - పూలచేఁ దావి
గందమ్ముచే నీచు - కంపు నడంచి

సూదిచే మణులచే - సొంపుగఁ బూర్వ
లేర్చి కూర్చిన మోస - మెఱుఁగవ యేమి? ౨౦
యనుచు విద్యాధర - వనిత రూపమున
మణిమేఖల వచించు - మాటలు విన్న
విద్యాధరుఁ డిది - వీనినే గోర
వించెడి నామాట - వెడచెవి నిడియెఁ
బరు వెంబడించెను - వాఁ డేగుచుండఁ ౨౫
జూచుచున్నది రాజ - సుతునకు నీతు
లుగ్గడించి తుదకు నొక సైఁగతోడఁ
బగడంపుఁ దునకపై - నగవును కలువ
కనులతో సంగిత - మును చూపి పోయె
నితఁడు ప్రియుండౌట - నిచట నిల్చినది ౩౦
యని కనలుచు నంత - నామె యున్నట్టి
మండపమునకు లో - మండుచు నరిగి
బుట్టకుఁ బాముఁ జి - వ్వునఁ జొచ్చినట్లు
చొచ్చి యడఁగి డాఁగి - చూచుచు నుండె
లేమ తెల్పిన నీతి - లెక్కింప కుదయుఁ ౩౫
డీడని వేడ్కతో - నింటికి నేగి
మణిమేఖలయె నన్ను - నుభ్య పెట్టుటకు
కాయ చండిక రూపు - కడఁక ధరించి

పాత్రమ్ము చేసంది - వంచనచేత
మన్మథంబును విభ్ర - మ పఱచి చనియెఁ ౧౧౦

బరుఁ డామెతో నేమొ - భాషించు చుండె
మున్నె యమ్మండప - మునయందు వాని
తోడ నద్దమ రేయి - కూడక యున్నె?
యనుచుఁ గాకని - చటుచుండిలేచి
మలయమారుత రథం - బల మానుపడఁగ ౧౧౫

మొక్క - చెఱకు విల్లు - మొగ్గ పూములికి
కలవాఁడె పలుకు ప - క్కముగాఁగ వేడ్క
తో నూరె నిద్రించు - నాఁడు రేయి
నొంటరిగాను యేన్గు - వెఁటాడ లేచు
వేఁగి పోల్కి నగరు - వీడి వాకిండ్లు ౧౨౦

కడచి తావలచిన - కలికి యున్నట్టి
మండపమున యందు - చండ విషోగ్ర
భుజగంబు వసియించు - పుట్టలోఁ జొచ్చు
జోడుఁ జొచ్చుడు - వానిరాకను మున్న
తావి పూవులును చం - దనమును తెలుప ౧౨౫

వాఁడె యిటకు దీని - వలచియే వచ్చె
నని యెంచి కట్టి దె - బ్బను దిన్నపాము
కనకోపమునఁ దన - పడగను విప్పె

నన లేచి రాకుమా-రుని వెంబడించి
వాని కొండను బోలు-బాహువుఁ ద్రెంచి ౧౨౦

కాయచండికఁ గొని-గగన మార్గమునఁ
బోవుదమని డాయఁ-బొడవు కంబమున
దేవ కారువు దిద్ది-తీర్చిన ప్రతిమ
డాయకు కాంచనా!-డాయకు మనుచుఁ
గ్రచ్చఱఁ బల్కె-త-ర్వాత నిట్లనియె ౧౨౫

మణిమేఖల యనెడి-మడఁతుక మాఱు
వేసమ్ము నూని యి-వ్వీథిఁ దిరుగాడెఁ
గాయ చండిక కడు-గని గొద యేన్గు
తీపు తీఱఁగఁ బ్రసా-దించె నీయమయె
తన నొప్పి దీఱ నీ-దార వ్యోమమునఁ ౧౩౦

జను చో ఘటిల్లిన-సంగతి వినుము
అంబరచరులు దు-ర్గాలయ మున్న
వింధ్యకు మీఁదుగ-వెడలరు వెడల
వారల చాయతో-వారక లాగి

గ్రుంగుచు వింధ్యను-మెలఁకువఁ గాచు ౧౩౫
వింధ్యాఘటిక యను-వేల్పు కడ్పునకుఁ
గాయ చండిక యట్లు-పోయి చేరినది
చిన్న పోవకు మదిఁ-జింత నొందకుము

విధి యిట్లు నినుదెచ్చి - వీనిఁ జంపించెఁ
జెడు కార్య మరయక - చేయుట కతన ౧౪౦
విడువదు నిన్ను న - వ్విధి యని పలుకఁ
దన యవిమృశ్యత - తన్ను కుందింప
విద్యాధరుఁడు వేఱు - విధిలేక తుదకుఁ
బత్నివలె నెగిరి - పఱచె నెయ్యెడకో.

---

## ౨౧. స్తంభ ప్రతిమ ఆగామి తెలుపుట

మయుఁడు చిత్రించు ని - ర్ణయ బుద్ధి గలుగు
ప్రతిమకుఁ బడమటి - వాకిలి కడను
బ్రాహ్మ్మ మాలయము లో - పల నుండిపట్టి
మణిమేఖలయు విభ్ర - మంబున లేచి
విద్యాధరుని చేఁత - వృథ్వికి తనయు ౫
దురవస్థయుఁ బ్రతిమ - యరయించు వింత
వృత్తంబు విని లేచి - యీ రూపు తనకుఁ
దీఱుఁ గాకని వీడి - దృష్టి విషంబు
నీ యసువులఁ దీసి - మాయించు తఱిని
చితి మీఁద వీడితి - జీవముల్ నేను ౧౦
ఉపవని నీయెడఁ - గృపమాలి మనసు
మార్చ నయితిఁ గాన - మాయిలు వేల్పు

మణిపల్లవమునకుఁ - గొనిపోయి వీడ
భవపాశముల నూడ్చు - భగవంతు పీఠ
మును చూచి నాతొలి - పుట్టువుఁ దెలియు ౧౫

తర్వాత వచ్చి నీ - పూర్వ వృత్తంబు
చెప్పఁగాఁ దెలిసి నీ - సేమమ్ముఁగోరి
పుట్టిన వారలు - గిట్టు చుండుటయు
గిట్టిన వారలు - పుట్టు చుండుటయు
సుఖ దుఃఖముల తీరు - చొప్పడఁ దెలిపి ౨౦

చెడువిధిఁ దలఁగింప - నెడఁ దలపోసి
కాయ చండిక రూపు - గైకొంటిఁ బ్రియుఁడ!
కనలు విద్యాధరు - కరవాలు చేఁ
గడకు నిర్జితని - యడలి తపించి
పరిదేవనము చేసి - పడఁతి లేచుటయు ౨౫

మదిరాక్షి! పోవకు - మా దయుని కడకుఁ
జింతతో సివమెత్తి - చేరఁబోవకుము
ఇతఁడు నీ భర్తయై - యెసఁగఁ బుట్టుటయు
నితనికి నిల్లాల - వీవాట పూర్వ
పూర్వమ్ములం బలు - పుట్టువులందు ౩౦

కలదొక్క పుట్టునఁ - గలయది కాదు
తడఁబడు పొడుపులఁ - దొడరు దుఃఖములు

భవపాశ బంధముల్ - వదలించు కొనఁగ
యత్నింపుము కలంత - నందకు మనుచుఁ
బలుక బంగరు కాంతి - గలుగు పూఁదీఁగ ౩౫
యన నొప్పి సత్యవా - క్యములతో నలరి
యిమ్మండపమ్మున - నెలరు దైవమ్మ!
నీ చరణములకు - నా చిన్ని నతులు
పూర్వజన్మంబున - భుజగంబు గఱవ
నితని జీవము లేగ - నిపుడు విద్యాధ ౪౦
రుని కత్తిచే నెద - ద్రుంగ నగ్గలపు
టుమ్మలికమ్ము నే - నొంద నిట్లాట
కేమి కారణమొ నీ - కెఱుఁగంగ రాదొ?
యెఱిఁగి తెల్పంగ నీ - కరుణ భాగ్యంబు
పూర్తిగ నేనిటఁ - బొందుదుఁగాదె? ౪౫
యనఁగ నద్దేవత - వినుమని పలికె
కాయ గట్టను నేటి - గట్టున మాయ
తెలియని తబిసి రాఁ - గల యది తెలిపి
నిభ్రాంతులగు వారి - వీత కల్మషుల
నొనరించు బ్రహ్మ ధ - ర్మని చేరి సేవ ౫౦
చేసి భిక్షుకు వంట - చేసెడు మనిన
వేకువ వేళఁ గా - వింపు మనుటయు

సంజయు రేయియుఁ - జన ముదమంది
వేకువ రా వంట - వేగ చేయుమని
బానసీనికిఁ దెల్పి - వాఁడాలసించి ౫౫

వచ్చి తొందరగ పడి - వంట పాత్రమ్ము
పడవేసి * శీలంబు - పాటించు మునికి
దోసఁ గాచరింపఁగాఁ - దోఁచిన కినుకఁ
దలయు భుజమ్ములు - ధరణిఁ బడంగ
నఱికిన క్రూర దు - ర్నయ ఫలమిద్ది ౬౦

* ఇది పంచశీలములు దశశీలములని యిరు తెఱఁగు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము అసంగ్రహము, అనునవి పంచశీలము లనఁబడు. వీనితో ఉన్నతాసన మిచ్చింపమి, చందనాదికము తాల్పమి, వెండి బంగారు తాఁకమి, ఆట పాట లిచ్చింపమి, రేయి భుజింపమి అనునవిచేరి దశశీలము లనఁబడు. పంచశీలములలో కల్లుద్రావమి చేర్చి చెప్పువారును కలరు (నీలకేశి గ్రంథము, సమయ దివాకరటీక) అహింస, అస్తేయము, అవ్యభిచారము, సత్యము, కల్లుద్రావమి అనునవి పంచశీలము లనియు నివి గృహస్థులకును దగినవనియు వీనితో రేయి అశుద్ధాన్నము భుజింపమి, చందనాదిక ముపయోగింపమి, నేల చాపపై పరుండుట, అను మూడుచేర అష్టాంగ శీలమనియు నివి గృహస్థులలో నిష్ఠాపరులకే తగుననియు, నీ యెనిమిదితో నాట్యగానము లిచ్చింపమి, వెండి బంగారు తాఁకమి, అను రెండునుచేరి దశశీలములనియు, నీ పదియు సన్న్యాసుల కర్హములనియు వ్యభిచరింపమి యనుచో బ్రహ్మచర్యమనియు ధార్మిక సూత్రమను గ్రంథమునఁ జెప్పఁబడినది. (చూ. పీఠిక.)

యెప్పుడు నిప్పుడు - నతని వీడనిది
తాము చేసిన కర్మ - తత్ఫలంబులను
దైవమ్ము తప్పించి - తలఁ గాచు ననెడి
వా రవివేకులు - వనజాక్షి! నిజము
తగ వాచరించు నీ - దయితుఁడు ప్రేమ ౬౫

కలఁడయ్యె ధర్మంబు - కలదయ్యె దుష్ట
కర్మ ఫలమ్ము త - క్కక కుడిపెడిని
అవి తరువాతి పు - ట్టువుల రావచ్చు
నచటి కర్మ ఫలమ్ము - నిచట నీ పగిది
కుడిపిన యది రాచ - కొమరుని స్థితికి ౭౦

చింతించి మునులు వ - చించిన నిజము
విని రాజు నిను చెఱ - వేయును మరల
రాజమదేవి నీ - రాణి వాసమున
నుంచు కొనఁగ నుద్దె - సించి వదల్చు
నీ తల్లి యఱవణ - నీయు కాత్మ పాద ౭౫

నీరేజముల మ్రొక్కి - నిలిచి నీకైన
యాపద తెలుపంగ - నాతండు వచ్చి
తెలుపు వాక్కులు విని - దేవి నీ చెఱను
వీడుచు నవ్వల - విను మిది నీవు
రాజ శార్దూలుఁడై - రాజిల్లు నట్టి ౮౦

గోపుత్రకుని కడ-కుం బోదు పోయి
ధర్మవాక్కులు విని-తన్నురుపు తోడ
మణి పల్లవము చేరి-మణిపీఠి వలన
ద్వీపతిలకచేత-స్వీయ వృత్తంబు
విని శ్రావకేంద్రుండు-తన నాడు చేరఁ ౮౫

బిమ్మట నాదీవి-విడి మానిరూపు
పూని వంజిపురికిఁ-బోయి యచ్చోట
గొప్ప విజ్ఞులఁ బలు-గుంద్రను గాంచి
పలువిధ ధర్మగాథ ల్-పాటించి విందు
వట నహం బ్రహ్మాస్మి-యను వారు భువన ౯౦

ముల సృష్టిచేసిన-మొదటి వాఁడనెడి
వారును తనకు రూ-పములేదు ప్రాణి
కోట్లకు రూపమ్ము-గూర్చెదు వాఁడు
గద దేవుఁ డగునని-చదివెడి వారు
గాసిలి వ్రతములఁ-గడపఁ బుట్టువుల ౯౫

పారిది బంధము ద్రెంచి-సుఖలోకమందు
మేటి పదవి నుంచు-సూటి నన్వారు
భూత వికారమే-పుట్టు వన్వారు
పలు మతముల యసం-బద్ధ వాక్యముల
వినఁదగు నాళ్లలో-వేలుపు లేఁడు ౧౦౦

గిట్టిన వారలు - పుట్టంగఁ బోరు
ధర్మమ్ముతోఁ నేల - తగులాట మనెడి
భూతవాదిని జన్మ - మును ధర్మతత్త్వ
ములతోడ వినిన నీ - వెలనవ్వ నగుదు
విది విని నవ్వితి - వేల నీవనుచు ౧౦౫

నిజము తెల్పుమనంగ - నీ జన్మ వృత్త
మెఱిఁగింతు వది విని - యెలనవ్వ నవ్వి
యతఁడు స్వప్న భ్రమ - మందితి వనుచుఁ
బలుకు నయ్యది మఱ - వం దగు దీవు
దుష్కర్మములు కీడు - తొడరించుటయును ౧౧౦

మరణించు వారలు - మరలఁ బుట్టుటయు
సత్యమేయని నమ్మి - జనియించు భ్రాంతి
పీనుఁగు ధర్మంబు - వీడని తరులు
ధరణియు వ్రాయు చి - త్రములు మాటాడ
వని యరయుట యరు - దగునేమి ? యరయు ౧౧౫

దో కాదో ? యరయవేని - యొప్పంగ వినుము
సంపూర్ణ మహిమతోఁ - జను నీ పురమున
దేవళములు నీడ - తావులు నీటి
రేవులు రచ్చల - తావులు పెద్ద
మండపములు మంచి - మహిమమ్ము గలిగి ౧౨౦

రక్షణమున నొప్పఁ - బ్రాజ్ఞులు కాంచి
మంటితో రాలతో - బ్రాఁకుల తోడ
గోడలతో వేల్పు - గుళ్లు స్థాపింప
వేలుపు లాచోట్ల - వీడక జనుల
కగునవి తెలుపు చుం - టరయవో నీవు ౧౨౫

నావృత్త మడిగితి - నాతిరో! వినుము
దైత్యదితుఁ డనువాఁడ - దైవగణముల
నొకరుఁడుఁ దొల్లి మ - యుండను శిల్పి
యనువుగ నాకుఁ జే - సిన బొమ్మయందు
నిలుతు నదేలన్నఁ - దెలిపెద వినుము ౧౩౦

మర్త్యు లెఱిఁగిన ద - మర్త్యు లెఱుఁగరు
చిత్రసేనుండు నా - చెలిమి కాఁడగుట
యీ నగరము వారి - కెవరు నొడివిరో?
యాతనితోడ నే - నరిగి వయ్యాళి
చేసిన స్థలములఁ - జెలిమి పెంపారఁ ౧౩౫

దరువు నీడయుఁ బూవు - తావికై వడిని
యుండిన వారి నా - యొప్పున వ్రాసి
నాలుక యెండంగ - నను పొగడంగ
మూఁడు కాలంబుల - ముచ్చటలెల్లఁ
దెలుపుచుండుదు నీకుఁ - దెలిపితి నింత ౧౪౦

తెలియు మఱఁగ నాపె - దేవతావళిని
తెలియుదు నాతఁడి - తెలుపు మనుటయు
దైవ్యదికుం డిట్లను - తరుణిరో! వినుము
వానలు కురియక - ప్రాణులు చావఁ
గాంచీపురము స్థితి - కడుఁ జెడుట విని ౧౪౫

జీవామృతముగఁ జం - పావతి యొసఁగు
దివ్యపాత్రము కేలఁ - దేజఁగుగఁ దాల్చి
సుతమతి మాధవి - యుతుఁడై యఱవణ
ముని యట నుండుట - విని కాంచి చేరి
యతని కృపామతి - మతభేద బుద్ధి ౧౫౦

వీడి నీవారలై - వెన్నంట జనులు
పాడి వర్ధిల భువి - వర్షంబు కురిసి
పంటలు పండఁగఁ - బ్రజలు మోదింప
యమృత సురభిఁ గొని - యన్నంబు నిడెవ
వాయూర ధర్మ మ - త్యభివృద్ధి నొందు ౧౫౫

నచ్చుట నీవల్ల - నగునని పెక్కు
కలవు తక్కిన ధర్మ - ములను బోధించు
వారి తత్త్వము లఱ - వణ మహామునికిఁ
జెలుపంగ నాతఁడా - దినములఁ దపము
ధర్మము తగవు ద్వా - దశ నిదానములు ౧౬౦

తెలిపిడి భవ మహా - జలధి తారణము
పద్ధతితోఁ దెల్పి - పాపంపు టిరులు
విరియ జీవతతి ని - ర్వృతి సుఖమంద
ధర్మ ప్రకాశమ్ము - తనరంగఁజేసి
బుద్ధితో ధారణి - బుద్ధ సూర్యుండు ౧౬౫

పొడము వఱకుఁ జావు - పుట్టుక లొంది
ధర్మ పథము ప్రేమ - దవులక యిాస్థ
లము వీడ మణిమేఖ - లా నీవు నేను
తల్లియు నెల్లరుఁ - దడఁబాటు లేక
న్యాయమార్గమ్మున - నడతుము గాక ౧౭౦

యని యతండు పలుక - నాతని పలుకు
పాటించుచును జవ - దాఁటక పెక్కు-
ధర్మమ్ము లొనరించి - తరువాతఁ గాంచి
పురమున దేహమ్ముఁ - దొఱఁగి యుత్తరపు
మగధలోఁ గలుగు జ - న్మములెల్ల గార ౧౭౫

వంపుఁ బుట్టువులయి - పొడియుఁ గరుణ
తప్పక మహిమమ్ము - చొప్పడఁదోఁచి
కలఁకయు విభ్రాంతిఁ - దొలఁచి పరులకు
ధర్మ తత్త్వంబు బో - ధము సేయు వృద్ధు
ప్రియ శిష్యుఁడవయి పం - డెందు నిదాన ౧౮౦

ము లెఱింగి క్రేంతు నీ-కులమునఁ దొల్లి
తగవుచే నున్నతిఁ-దనరు విజ్ఞాని
నొకని సంద్రమునుండి-యొగిఁ గాచినట్టి
మణిమేఖలాదేవి-మహి సాధు చక్రు
నకుఁ బ్రేమతోడ న-న్నం బిడు ఫలము ౧౮౫

వలన నీ జన్మంబు-గలిగిన దనుట
యెరసితే? యుపవన-మంను గాన్పించి
మణి పల్లవమునఁ జే-ర్చినదా ఫలమ్మొ
అని దైవ్యాదికుఁడు తెల్పఁ-దన చింతవీడి
మేర మెఱుఁగు మణి-మేఖల యంత ౧౮౦

నమ్మండపమున డెం-దమ్మునఁ గలఁక
నీఁగుటయును గాఢ-నిద్రలో నుండి
లోకమ్మ లేపెను-లోక బాంధవుఁడు.

## ౨౨. కారా బంధనము

తరణి మండలము పే-రిరుఁ జెండాడ
నిష్ఫత్షపాత్రియై-నిలిచిన కంబ
పతిమ తోడను సర-స్వతిని పూజింపఁ
బోయిన వారలు-భూపతి సుతున
కొనరిన స్థితిఁ దెల్ప-విని చక్రవాళ

మందలి తాపసు - లందఱు వచ్చి
మణిమేఖలను గాంచి - మహిప కుమారు
మరణవృత్తమ్ము నీ - కెఱుకయె యనుచు
దలఁకక యామె త - ద్ఘటనమ్ముఁ దెలుప
మునివరుల్ మణిమేఖ - లను నృపతనయు ౧౦

తనువును వేఱుగా - దాఁచి రాజేంద్రు
వాకిటి కావలి - వారికి రాకఁ
దెలిపి లోనికిఁ జన - సెలవంది యేగి
నిండు చంద్రు కరణి - నీవెల్ల యెల్లి
యున్నత స్థలి నిల్చి - వెన్నెల లీనఁ ౧౫

గత్తియు దండమ్ముఁ - గరుణార్ద్రదృష్టిఁ
దనరి జగము గావ - ధర్మ చక్రమ్ము
దొసఁగు పొసఁగ నీక - దొరలుచు గాక
నేఁడె కాదీ పురి - నిన్నటి దాఁక
కాము మధువు ద్రావి - నేమంబు దప్పి ౨౦

కుల సతులను డాసి - గురు తపస్వినుల
వెంట మనసు వీడి - వెతలను గుడిచి
యిలిగిన వారలు - పలువురు కలరు
క్షత్ర కులమ్ము నా - శ మ్మొనరించు
పరశురాము నెదుర్చ - వలదని దుర్గ ౨౫

మండలింపఁగఁ గాంత - మహిపాలకుండు
తన నగరముఁ గావఁ - దగు వారలెవ్వ
రనుచు యోచించి భూ - మిని పగవారు
తలరంగ భోగినీ - తనయుఁ డుత్తముఁడు
వీరాధి వీరుఁడై - వెలయు కకందుఁ 30

డను వాఁడు తగిన వాఁ - డని నిశ్చయించి
క్షత్రియుఁడును కాఁడు - క్ష్మాపాలనార్హుఁ
డును కాఁడయని రాముఁ - డును జాయఁడనుచుఁ
దొల్లి కష్టము లగ - స్త్యుఁడు తొలఁగింపఁ
గావేరిఁ బ్రవహింపఁ - గాఁజేయు దేశ 35

మును తా మరలి వచ్చు - దనుకఁ గావుమని
యనుచుటఁ గాకంద - మను పేరు దీని
కేర్పడె ; నాన్నృపుఁ - డితర వేషమునఁ
జన నెంచి యుండిన - స్థలమునఁ కరిగె
నవ్వాల నొకట నాఁ - డప్పూరి నొకట 40

పాఱుత 'మరుది' కా - వేరి నీరాడి
యొంటరియై వచ్చు - చుండంగఁ గాంచి
చపలాత్మ యిది యని - చలిత చిత్తమునఁ
దలఁచి కకందుని - తనయుఁడు పొంద
రమ్మన నామె భ - యమ్మంది గంద్ర 45

గోళమ్ముతోడ భూ-గోళమ్మునందు
వర్షమ్ము కురియించు-పత్నులై రేని
పరుల చిత్తమ్మునఁ-జొరకుందు రేచు
పరునెదఁ జొచ్చితి-వహ్ని నర్చించు
నర్హాత్వ మింత లే-దని కంది కుంది ౫౦
పోవక యింటికి-భూత చతుష్క-
మున కేగి కుములుచుఁ-బెనిమిటి వలనఁ
దగని దూఱొందిన-దానను గాను
కనిన యాతని డెంద-ము న కెక్కినట్టి
నీచనైతి గృహస్థ-నియమమ్మునుండి ౫౫
దిగ జాఱితిని నేను-తెలియక చేయు
దోసఁ గొండు గలదె? చ-తుష్కభూతమ్మ
నీ వసాక్షికముగ-నిలువంగఁ దగవె?
యని యామె పలవింప-నా భూత మప్పు
డగపడి యో వని-తావతంసమ్మ! ౬౦
‘ * ఇతర దైవముఁ గన-కిలుజేని గొలుచు
సతి యాజ్ఞయిడిన వ-ర్షంబును కురియు ’
ననిన యాసత్య వా-క్యాని యర్థవాక్కు-
విన వసత్యమ్ములు-విడి కతలైన
వీఱేఁడి మాటలు-విన నిచ్చగించి ౬౫

---

* ఈ రెండు పాదములు తిరువళ్లువ కవివి. ఇట్లే అటనట కొన్ని

సంగీతవాద్య మృ-దంగ రవాది
కముతోఁ వేడుకల్ - గను నాసనుంచి
దైవమ్ముఁ బూజించు-దానవ వైరి
కాన నీయానతి - వానయు రాదు
నిలుకడగల చెలు-వల వలెఁ బరుల ౨౦

దెందముఁ గాల్చు శ - క్తియు లేదు వాని
వీడితివేని నీ-వాడిన యట్లు
కురియు నం చగడు వా-క్కుల మందలించి
యేఁడునాళ్లు ప్రభుండు-వీడెన యేని
తర్వాతఁ గాక యి-త్తఱి నాకుఁ గాదు ౨౫

ఇంతలోనఁ గకందుఁ - డెఱిఁగి తత్పుత్రు
ఖండింపఁ గలఁడు దుః-ఖము మాను మనుచు
సుఖమయ భూతమ్ము-సూటిగఁ బలికె
నా యేడు నాళ్లలో-నారాజు పుత్రు
దుష్కర్మమును విని-తుండ్లుగ నఱకె ౩౦
మఱియు వినుము రాజ-మార్తండ! ధర్మ

దత్తుఁడన్ వైశ్యుండ-తని మామ కూఁతు
రగు విశాఖయు సేవ-తాలి ప్రతిమల
చిత్రంపు నేర్పును-శిరసునఁ దన్ను
చెలువంబుతో వావి-గలవారు గాన ౩౫

గాంధర్వమున నాడఁ - గాఁ దగువారె
యని యూర నెల్లవా - రాడు కొనంగ
రంగులు లేని చి - త్రమ్ము కైవడిని
మేన నలంకృతుల్ - మాని గృహమ్ము
వదలి యాయమ మండ - పముచేరి కంబ ౯౦

ప్రతిమను గాంచి వి - నుతి చేసి ప్రజలు
చేసిన నింద పోఁ - ద్రోసి [illegible]ప్రశంసవి
ప్రార్థింప బ్రతిమయుఁ - బౌరులార! వినుఁ
డీ యమ వర్షమ్ము - నీయఁగఁగలదు
శంక వద్దంచు వి - శాఖను గౌర ౯౫

వించి పల్కెడు, వేల్పు - వినిపింప దేని
యూరి వారి మదిని - దూఱు తొలంగ
దని యామె మఱఁది - నాల నీకోసఁ
గాను రెండవ జాము - గనుమీఁద నగుదు
నని తన మది నిశ్చ - యము వెల్లడించి ౧౦౦

తన నెడకేగిన - తరువాత ధర్మ
దత్తుండు తాఁ దలి - దండ్రులంగూడ
తత్పురి వీడి నిం - దాకరమైన
యగడు తొలంచితి - వని స్తంభ చిత్ర
మును చాఁ బొగడి క - ల్మల చేతఁ గలల ౧౦౫

చే మహాకవి నుతిఁ - జెందు దక్షిణపు
మధుర చేరిన మీఁద - మామ కుమారిఁ
దక్కఁ దక్కిన వని - తల నొల్ల నిక్క
మీపుట్టు కడచుఁగా - కిట్టులె యనుచు
సద్వ్రతంబుల నూని - [1]సద్వణి గ్వృత్తి ౧౧౨
గడియించి నట్టి యు - త్కట ధనరాశి
కధిపతియై [2]యెట్టి - యను బిరుదంది
యిఱువది వత్సరా - లరిగిన పిదప
ధర్మదత్తుని గాంచి - తపసి యొక్కరుఁడు
[3]సన్నిధి ద్వయి కధీ - శ్వర ! యొక్క ౧౧౬
పలుకు వినుము భార్యఁ - బడయని వారు
పలు విధ ధర్మముల్ - పరఁగఁ జేసినను
వేలుపు లోకమ్ము - వే చొరఁ జాల
రనుట వినవొ ? నీవు - విని మఱచితివొ ?
విని మఱవవ యేని - వేగ నీ పురికిఁ ౧౨౦
బొమ్మన మధురాపు - రమ్ము వ్యర్థమ్ము
గాఁ జన నీపురి - కోజఁ జేరుటను

1. కొనుట ఎక్కువయు ఇచ్చుట తక్కువయుఁ గాని వృత్తి.

2 రాజులవలనఁ గొ [illegible] బడు పట్టమునకుఁ దగిన ముసిఁడి పూవుగొనుట (ఎట్టి = ముసిఁడి)

3. ఈ పదములు రెంటికిఁ గూడఁ జెప్పఁబడినవి.

పని విశాఖయు నింటి - వెనుక మార్గమున
లోనికిఁ జని ప్రీకి - లోఁకువ గాక
పలువురు బిడియంబు - వడ నుత్తముఁడగు ౧౨౫

ధర్మదత్తుని గాంచి - దాపున నిలిచి
మన మిప్డు పూర్వపు - మాడ్కి నరయుము
మనకు నప్పుడు విభ్ర - మము గూర్చి నట్టి
సౌందర్య మిప్పు డె - చ్చట డాఁగినదియొ ?
నీ కఱువది యేండ్లు - నిండిన విపుడు ౧౩౦

నాకును వెండ్రుకల్ - నరసె యౌవనము
కామమ్ము హాయయ్యె - నెక్కడ ముడిఁగినదో ?
నీకు నీ భవమున - నే సతిఁ గాను
మఱు పుట్టువునఁ దప్పు - మార్గంబు లేదు
పరువ మస్థిరము మే - నరయ నిల్వనిది ౧౩౫

ధన మనిత్యము దివిఁ - దనయు లీలేరు
తాఁ జేయు ధర్మమే - తనకుఁ దోడగును
దాఁకవు గమ్మన - ధర్మదత్తుఁడు
మామ కూఁతునకు సం - పల్లక్ష్మిఁ జూపి
వడి నామెతోఁ గూడి - నడపిన తగవు ౧౪౦

పెంపారి రిక్కల - గుంపుల కంటె
గడుకొనఁ గన్నెయై - ముదిసిన యాపె

ప్రతిమ వాక్యమునఁ బు - రమ్మున వారు
చేసిన చెడు నింద - చెవిఁ బెద్ద వీధి
నరుదెంచుచుండంగ - నంతలో నొకఁడు ౧౪౫

మరుదిని కామించి - మడిసిన వాని
యన్న యామెం గాంచి - యధిక కామమున
మత్తుఁడై తన తాల్చు - మాలికఁ దీసి
చేకొని పూర్వులు - చెప్పిన పెండ్లి
వహి యిది యని మెడ - వైవంగఁ బూని ౧౫౦

యెత్తిన చే యది - యె యట్లె
తలముడి నుండి - యివ్వలికి రాదయ్యె
విని యది యాతని - జనకుండు కినిసి
కొడుకని చూడక - తడయక నఱకెఁ
గల్ప కల్పము భూమిఁ - గాచి వర్ధిల్లు ౧౫౫

భూపతిలక ! యని - మునుల నొక్కరుఁడు
వచియింప విని రాజ - వర్యుండు నేఁడె
కాదు పల్మాఱులు - ఘన విషయముల
నెంచి దృష్టాంతీక - రించి పల్కితిరి
అట్టి దుష్కృతి నేఁడు - నరయంగఁ గలదె ? ౧౬౦

యున్నఁ దెల్పుఁడి యని - యుర్వీశుఁ డనుడుఁ
జెమగులు చెమఁగాక - యొడయల మిన్న !

యని యొక ముని యిట్టు - లనియె సిద్ధాంత
వాక్యమ్ము లెఱిఁగిన - వార లీ భువన
మున పీడినవి యైదు - మొనయు నిక్కముగ ౧౬౫

కల్లును బొంకు దొం - గతికము హింస
కామ మనెడి వీనిఁ - గడముట్ట నడఁచు
చార లన్నిటి గెల్పు - చారలు గెలువ
లేని వారలు తక్కు - వాని నన్నిటిని
గెలిచియు నిజముగ - గెలువని వారె ౧౭౦

కాము గెల్చిన వారె - ఘన తపోధనులు
తక్కినవారు స - ద్గతి లేని వారు
ఘోర నరకమునఁ - గూలెడి వారు
రాజేంద్ర ! వినుము చి - త్రావతి తనయ
తన ప్రియుఁ బొందిన - దాయ మాలించి ౧౭౫

బన్న మోర్వక *ముని - పల్లెఁ జొచ్చినది
మెలఁతకూఁతురు మణి - మేఖల యనెడి
పడుచు తపము సేయఁ - బొల్పడి యూర
నిల్లిల్లు చని బిచ్చ - మెత్తుచు నుండి
మండపమునఁ జేరి - మలయు చుండినది ౧౮౦

అది యట్టిదియ యైన - నామెను నీడ
పగిది వెంబడి దాని - పై వలపుఁ గొని

---

*మునిపల్లె = బౌద్ధవిహారము.

చిమ్మ చీఁకటి యని - నెమ్మదిఁ గొనక
మండపమునఁ జేర - మహఁతుక కాయ
చండిక రూపున - నుండిన దచటఁ ౧౮౫

గాయు చండికయు న - క్కడ నుండెఁ గాన
దత్పతి భర్త వి - ద్యాధరుఁ డటకు
వచ్చి దాని వెదకి - వాఁ డామె రూపు
గొను మణి మేఖల - వెను వెంటఁ దవిలి
దుర్విధి రేఁపఁ ద్వ - త్సుతుఁ డుదయుండు ౧౯౦

చేరిన యా చిమ్మ - చీఁకటి వేళఁ
దన సతిపై వల - పున వచ్చె ననుచుఁ
దలఁచి తటాలునఁ - దన చేతి వాలు
తోఁ దొర కొమరుని - దోర్దండ భుజము
నఱికె దుర్విధి యని - వర మునుల్ దెలుప ౧౯౫

భూపతి వారల - మోము వీక్షించి
తాఁ జేయఁ దగియుండు - తగవు నాఁడు
చేసెను గాన దో - షియె కాఁడు నిజము
తపసుల వ్రతము క్రొ - త్తడుల శీలమ్ము
మానవపతి కావఁ - డేని ధర్మంబు ౨౦౦

కొఱకు రథముక్రిందఁ - గొడుకుఁ ద్రోయించు
దొరకులంబున నొక్క - దుష్టుండు పొడమె

నను వార్త రాజులు - విను మున్నె వానిఁ
గాటఁ జేరిచి కాల్చి - గణిక పుత్రికను
తెప్పించి చెఱను బం - ధింపుఁడి యనియె. ౧౦౫

## ౨౩ కారా విముక్తి

ప్రభువరు దయ నొంది - వాసంతి యనెడి
ముదుసలి సరసిన - వెద గల వనిత
జనపతి కేని త - త్తనయున కేని
దవేరి కేనియు - దృష్టాంత సహిత
ముగ వివరించి నె - వ్వగలను దుడుచు ౫

సార్థ మనోజ్ఞ వా - క్చతురత గలది
రాజమ దేవికి - రాఁజిన చింత
తొలఁగఁ ద్రోవఁగఁ ద్వర - తోఁ జని జూసి
పట్టఁ జాలని దుఃఖ - భరముతో నేడ్చి
పదములఁ బడి మ్రొక్కి - యెదుట నిల్చున్న ౧౦

రాణిని దీవించి - రాజాధికార
ముం గొని ప్రజలను - బ్రోవి దీర్ఘంపుఁ
గ్రోధంబు గలుగు మా - త్సర వశ వఱచి

కొనినను *దర్భపై - న నిచి ఖడ్గమునఁ
జీల్చి పోర నరులఁ - జెండాడి చచ్చు ౧౫

రాజులు చేరు స్వ - ర్గము చేరుఁ డనుచు
భూసురుల్ వచియింప - ముదిమిని పొంది
చచ్చుట యీ వంశ - సంభవు లైన
ప్రభులకు నా నాల్క - పలుక మై కొనదు
అయ్యది సిగ్గిల - నగు పద్ధతి యగుఁ ౧౮

దన దేశమ్ముం గాచు - కొనుటకుఁ గాదు
పరుల దేశము వశ - పఱచుకోఁ గాదు
మఱి యేమనఁగ వచ్చు - తమ్మోఘపుత్రు చావు
మన్నిని యెదుర ను - మ్మలికంబు గొనకు
మని యామె నూరార్చి - యరిగిన పిదపఁ ౨౫

జేష్టలచే మన - శ్చింతను దాఁచి
నృపవరు దేవి కృ - త్రిమ నీతి పూని
పుత్రశోకము నెద - పొదలోన డాఁచి
మణిమేఖలను కృత్రి - మమున వంచించి
కసి దీర్చుకొందుఁ గా - క యని లోనెంచి ౩౦

* పోరిలోఁ జాగక ముదిమిచే రోగముచేఁ జచ్చిన రాజుల శవమును క్షత్రులు దర్భయందు వైచి, తమ మగఁటిమియే యాఁతగా యుద్ధమునఁ జచ్చిన రాజులు చేరు లోకము వీరును చేరుదురుగాక యని కత్తితోఁ జీల్చి పదపడి యంత్యక్రియలు గావించుట పూర్వ క్షత్రియాచారము.

యొకనాఁడు తన విభుఁ - నొద్దఁ గూర్చుండి
సల్లాపములు సేయు - సమయంబునందు
పరులు వెన్నాడ భా - వంబున రోయు
బిచ్చుక త్తియ యైన - వేసంబు గాంచి
మతి నళియించిన - మన యుదయుండు ౭౫

ధరణీశ సుతుఁ డనఁ - దగఁడు నిజమ్ము
చెఱకు విల్తుఁడె తన - చేష్టలు దక్కఁ
దలఁచి పొందఁగరాని - తన యౌవనమును
సఫలంబు గానీక - సమయింపఁ జేయు
మేధ గల్గిన మణి - మేఖల యిచటఁ ౮౦

చెఱ నుండఁ దగిన దు - శ్శీలాత్మ కాదు
అనుడు రాజేంద్రుఁ డ - య్యమ కిట్లు లనియె
జననుత జ్ఞాన మొం - దిన వారె సుతులు
మందులౌచో మఱ - వం దగు వార
లని యెఱింగితి మేల - యయ్యె నా పడఁతి ౮౫

చెఱ విడిపింపుము - చెలువ ! నీ వనుడు
విడిపింతు నాతోడ - వెలఁదుక యుండఁ
గాంతు నొందిన నుండుఁ - గాక కాదనుచుఁ
దన పాత్ర చేఁ గొనఁ - గోనుఁగాక యనుచు
రాణి యామెను తోడ - రమ్మని కొనుచు ౯౦

నంతి పురికి నేగి - యట దీని తెలిపి
మందులచే నాశ - మందించి జనము
తఱిమి కొట్టం దగు - దానిఁ గావింతు
నని యెంచి పిచ్చి మం - దును దినిపింపఁ
బొట్టుల యెఱుఁకువ - పొందిన వారి ౫౫

నది యేమి యేని చే - యఁగ లేదు కాన
నెప్పటి యట్లుండ - నెడ్డయె రాణి
చదువు సాములు లేని - చండి నొక్కరుని
వెదకి తెప్పించి యొ - ప్పించి యమ్మగువ
మణి మేఖల తనకు - మక్కువ వలపు ౬౦

క్షత్రియ యని దాని - కాయంబు నందు
కలయిక చిన్నెలఁ - గాన్పించి తనకు
వశ మైన దని పుర - వాసుల కొప్పఁ
గల్పించి చెప్పుమ - కాసు లిత్తు నని
చేతి నిండుగఁ బోయఁ - జేకొని వాఁడు ౬౫

సుదతి కూర్చుండిన - చోటికి నేగి
మోఱకఁదనము చూ - పుచు నిల్చునంత
దేవి వంచన మని - తెలిసి యా చెలువ
మంత్రము జపియించి - మానమ్ముతోడ
మగ వేసమున నిల్చి - మడియుండు కాంచి ౭౦

జంతుచు రాణి వా - స`బునఁ బురుషు
లుండ రీవింత యే - మో నిరయమునఁ
బడు నీమె దుష్ట భా - వము నేరకుంటి
నని వాఁడు పరువిడు - నంత సూనునకు
చెడుగు గల్గించిన - చెడిపను బ్రతుక ౭౫

నిచ్చు టేలని నిచ్చ - యించి భరింప
రాని నోవున నోగి - రము వీడె నంచు
వ్యాజంబు గల్పించి - వాయువు లేని
గదిలో నడంప నాఁ - కలి లేని మంత్ర
మున్నది కావున - నోగి జపియించి ౮౦

కార్శ్యంబు నొందమిఁ - గాంచి యా రాణి
చేష్ట లుడిగి నేను - చెమ్మగిల్లంగ
నమ్మ ! తపస్విని - వగు నీకుఁ జెడుగు
పుత్ర దుఃఖమ్ముచేఁ - బొందఁ జేసితిని
మన్నింపు మని మ్రొక్క - మణిమేఖలయును ౮౫

రాహులు నునుఱు స - ర్పము హరియింప
బ్రదుకఁ జాలు శరీ - రముఁ గాల్చు నాఁడు
వానికై యటనుండి - వగచితి విప్రు
డోర్వక యేమేమొ - యొనరించి తిచట
నునుఱుల కేడ్చితో ? - యొడలి కేడ్చితివో ? ౯౦

ఒడలి కేడ్చితివేని - కొడుకును గొనుచుఁ
గాటఁ బెట్టిన కసఁ - గఠిను లెవ్వారు?
ఉసుఱుల కేడ్చెదే - నోగిఁ గర్మఫలముఁ
దొడరి తా వేఱొ - యొడలిలోఁ జొచ్చు
నిది యెఱుఁగు తెలివి - యిలలోన నరిది ౯౫

తనయు జీవముల కే - నెనరు చూపితివి
అన్ని జీవుల యెడ - ననుకంప గొనుము
దేవి! నీ తనయుఁ డా - తీరున నగుట
కున్నది గత మది - యొప్పుగ వినుము
వంట పాత్రము నేలఁ - బడి పగులంగఁ ౧౦౦

గినిసి పాచకు నఱ - కిన పాప ఫలము
పాఁప నెపమ్మునఁ - బ్రాణముల్ దీసి
విద్యాధరుని కత్తి - వ్రేటునఁ ద్రుంచె
ని పుష్పవనము చొ - చ్చిన యది మొదలు
దైవము తెలుపు న - ర్థము తుది గాఁగ ౧౦౫

వివరించి యంతట - వెలఁది యిట్లనియె
పిచ్చిమందులు - నాకుఁ బెట్టితి గోల!
మఱు జన్మవృత్తమే - నెఱిఁగితిఁ గాన
మఱపు గూర్పఁగ లేదు - మానిని! మూర్ఖుఁ
డొకఁడు నీ పంపున - నొయ్యన రాఁగ ౧౧౦

మగ రూపు గొని యుంటి బెగడంగ వాఁడు
ఆఁకలి చెడు మంత్ర - మరసితిఁ గాన
నీవు చేసిన కుట్ర - నెఱవేఱ లేదు
కాము గమనమును - కాము రూపమ్ము
నెదఁ దలఁపఁగ నైతి - నేలందువేని ౧౦౫

పూర్వ జన్మంబునఁ - బోలుచు నా పతికిఁ
దల్లివై యుండు క - తన నీకుఁ జెఱుగు
గలిగించు దుష్కర్మ - ములఁ దొలఁగించు
తలఁపుతో నీ దోస - ముల లెక్క గొనక
నిలిచితిఁ దెలుపంగ - వలసిన వాని ౧౨౦

వినిపించుచుంటిని - వినుము శ్రద్ధమెయి
ధరణిపుల్ న్యాయంబు - తప్పి చరింపఁ
బ్రజలును తార్మాఱు - పడిన దేశమున
నిల్లాలి నొక్కతె - నిలుతేఁడు వీడఁ
దనయుని వీడి యా - తన్వి యొంటిమెయి ౧౨౫

నిచ్చ వచ్చిన కడ - కేగి యిచ్చించు
తీరునఁ గులటయై - తిరుగుచు నుండ
నా యమ కొడుకు బ్రా - హ్మణుఁ డొక్కరుండు
పెంచి పెద్దగఁ జేయఁ - బెరిఁగి యా కులట
నెఱుఁగక కామించి - యెఱిఁగిన పిదప ౧౩౦

మరణించుటయు, దప్పి-మానుచు వేళ్ళ
నెండ మావులఁ గని-యెలసిన హరిణిఁ
గరువు జాఱఁగ వడిఁ-బరువిడు దాని
వేటకాఁ డమ్మున-వ్రేయ నా జింక
పత టను గని మతి-చెడి తపియించి ౧౩౫

కో యని కోపెట్టు-గో డాలకించి
నిట్టూర్పుతోఁ గంట-నీరమ్ము కార్చి
కరఁగి యవ్వేఁటరి-మరణించుట యును
మదపుటేన్గు నెదుట-మత్తున నేగి
దంతమ్ము లాగి త-ద్దంతిచేఁ బొడువఁ ౧౪౦

బడి యిఱుగుట త్రావు-ఫలమాట చూచి
మఱచితివో? కల్ల-కఱుదు లాడుటలు
ముఖ్యవృత్తిగఁ గొన్న-మొఱకు లొనర్చు
క్రూరకర్మ ఫలమ్ము-కుడువమి గలదె?
దొంగలు పొందెడి-దుఃఖమ్ము లివ్వి ౧౪౫

యని వివరింపంగ-నవసర మున్నె?
ఇవి హైదు జగమున-నిడుములఁ గూర్చు
నవి యని వదలంగ-నర్హులు జనులు
చదువుటయే కాదు-సద్భాషణమ్ము
కనలు వీడిన వారె-కఱచిన వారు ౧౫౦

జగతిని జీవించు - జను లెవ్వరనిన
నున్నది పేదల - కొఱఁగెడి వారు
జగము నెఱింగిన - చతురు లేరనఁగ
నొచ్చు వారల గొద - నొగు లూచ్చువారు
బాములఁ దొలఁగించు - పరమార్థ తత్త్వ ౧౫౫

మెఱిఁగిన విజ్ఞాను - లెల్ల జీవులె
సమదృష్టి నెనరు ని - చ్చలు చూపువారు
అనుచు విజ్ఞానతో - యమ్ము ప్రోక్షించి
రాజమదేవి క - ర్ణంబులఁ బోసి
తనయ దుఃఖాగ్నికి - మన మింధనముగ ౧౬౦

మే నెరియించెడి - లోని యంగదను
రత్నమేఖల యార్చ - రంజిల్లి చిల్ల
పడిన నీరము వలె - భావంబు తేఱి
చలమును వీడి ని - శ్చలం భక్తిమీఱఁ
జాఁగిలి పడ నామె - సమ్మతి గొనక ౧౬౫

యిది యుక్తపద్ధతి - యెట్లగుఁ జెపుము ?
పతికిఁ దల్లివి రాజ - పత్నివి యనుచు
మణిమేఖల మ్రొక్కె - మహీపతి సతికి.

## ౨౪. గోపుత్రకు దేశము చేరుట

మానవేశ్వరసుతు - మనసును మార్చి
ముదివేశ్య తనసేయు - మోసంబు వలనఁ
గాంచను కత్తిచే - ఖండింపఁ బడియె
నుదయుఁ డనెడి వార్త - బెదరు తోడ విని
రాణి పాదములఁ జి - త్రావతి తెలచి ౫

సాధు తాపసులు ప్ర - సాదించి నట్టి
పదునొకండుగురును - వాసవుని సభ
నభినయ దోషంబు - నంది శాపమున
వసుధపైఁ బుట్టిన - వారైదుగురును
ముని కోపమున జయం - తుని తోడ భూమి ౧౦

నూటి జనించిన - నూట నల్వంద్రు
పాకారి యెదుట నూ - ర్వశి శాపమంది
నా కులంబునఁ బుట్టు - నాతి యొక్కతయు
వెరసి నూటిరువ దొ - క్కరు నొక్కచోట
నొక రూపమునఁ బుట్టు - వొందిన కరణి ౧౫

నొప్పారు మాధవి - యిప్పుర నందు
పుట్టు నాఁటంగోలెఁ - బొందు నాదుఃఖ
మెవ్వరు నొంద రి - లేశ్వరు దేవి!
గణిక లందెల్లర - కంటె నెక్కుడుగ
రోయి యొసంగిన - ప్రోడ కోవలుఁడు ౨౦

మరణించె నని విని - మాధవి మునుల
పల్లెఁ జొచ్చుట దాని - పట్టి పాత్రంబు
చేపట్టి యిల్లిల్లు - చేరి బిచ్చంబు
గొనుట నవ్వంగఁ ద - గుఁగాక యాట
వనితల కిది యుక్త - మన రెట్టివారు ౨౫

కాన నిమ్మడఁతుక - చే నుదయునకుఁ
గలిగె నంతియ యని - తలఁపంగఁ జనదు
రమణులచే నగ - రము పొందు నిడుమ
లెన్నఁ దరమ్మగా - దిది యొండు వినుము
ఉప్పళంబున గొప్ప - తిప్ప యిసుకను ౩౦

పొంగుచు నున్న త - రంగముల్ తాఁకు
పొన్నతోఁటను రాజ - పుంగవు నెదుట
మాధవమునఁ దావి - మఱసిన చోట
నొకప్రక్క నొకటిమై - నొక్కర్త కానఁ
బడ నీమె యెచ్చటి - కాంత యొందుండి ౩౫

యిట వచ్చెనని సుంత - యెఱుఁగక మరులు
గొని కను కంటిలో - విను చెవి యందు
తిను నోట వాసన - గొను ముక్కునందు
తాఁకు నెఱుక గల - తనువున యందు
విజయ ధన్వియగు పూ - విలుతుని మల్లె ౪౦

కంకేళి మామిడి-కలువ పద్మమ్ము
పరువ మందు విరియు-విరియంప తావి
వీవంగఁ బెక్కుద్ర-వీఁపులఁ గనిన
రాజా పడఁతి పద-రాజీవములకు
నెఱఁగి త్వత్పద సేవ-కరుణింపు మనఁగ ౪౫

సరి యని యొకనెల-ధరణీశుంతోడఁ
జెలువ యుండియు మీఁదఁ-దెలుపక పోవ
పిదప నెచ్చట డాఁగె-వెలఁదుక యనుచు
విభుఁ డెల్లయెడలను-వెదకుచుండంగ
నీటఁజొచ్చిన యట్లు-నేలను మునిఁగి ౫౦

చంద్ర సూర్యులఁబట్టు-జరగిన కరణి
నింగికి నెగయుచు-నీటను నడచు
చారణుం డగపడ-జనపతి మ్రొక్కి—
దేవ సమాన! నా-జీవ సమాన
యిట డాఁగె నెటకేగె-నెఱుఁగ సుంతయును ౫౫

ఎఱిఁగి యుండినఁ దెల్పుఁ-డీ యని కేలు
మొగుపంగఁ జారణ-ముఖ్యుఁ డిట్లనియె
నీ లతాతన్విని-నేఁ గాంచలేద
యైన నాచెలిఁ బూర్వ-మరయుదు వినుము
నాగదేశము నేలు-నరపతి దేవి ౬౦

నవమాలిక యనెడి - జవరాలి గర్భ
మందు పీలివలయ - యను కన్య పుట్టె
నట్టి దినమున సూ - ర్య కుల మహీంద్రుఁ
జేరి చూలు ధరించి - చేరు నిచ్చుటకి
నని యొక దైవజ్ఞుఁ - డట వచియించె ౬౫

నాకన్య యది యింక - నటనుండి యిటకు
పుత్రుఁ దేతెంచును - పూఁబోఁడి రాదు
వెతనొందకుము ముఖ్య - విషయంబు వినుము
జిష్ణు నుత్సవ మీవు - చేయని నాఁడు
నీ మహానగరమ్ము - నీరధిఁ గలియు ౭౦

నని మణిమేఖల - యన్నది దీని
కింద్ర శాపము గల - దిది తప్ప దంద్రు
అట మహానగరమ్ము - నిట జనపతియుఁ
జెపుట సత్యమ్మని - చింతించి నగర
మంబుధిఁ గలయనీ - యని యింద్రు నుత్స ౭౫

వంబును మఱవంగ - వలదని యతఁడు
వెడలిన మొదలు తుం - దుడుకు పోవమిని
తనవేకి మఱఁతి యు - త్తల మందునేని
దేవి కినియు నంచు - దిగులు నొందితిని
సన్మానసంబుతో - జనియించి నట్టి ౮౦

యతివను నాయింటి - కనుపుము యనఁడు
రాజముదేవి యీ - రాణ వచించె
కల్లు వలపు హింస - కల్ల చౌర్యమ్ము
నను పెద్ద లేవ గొ - నిన వాని ముఖ్య
ముగఁగొన్న మీవశ - మున నుండి మనుట ౮౫

యపవిత్ర మని జంకి - యరుదెంచు చెలువ
నీతోడ నేతెంచి - నీ యిల్లు చొరదు
మాయొద్దనుండు న - మ్మాన్య లీల ననె
మణిమేఖలా స్థితి - మాధవి విన్న
యంత శుద్ధ జలమ్ము - నందు దుమ్మువడఁ ౯౦

గలఁగిన తీరునఁ - దలఁగని చింత
సుతమతికిఁ దెలిపి - స్రుక్కి యఱవణ
మునికి విన్పించి యా - తని తోడ రాజ
పత్ని కడకు రాఁగఁ - బ్రభుని దేవియును
మాయ చిత్రావతి - మణిమేఖలయును ౯౫

తపసిని కాంచి నం - తన లేచి యెదురు
చని కేలు మొగిచి త - చ్చరణ పద్మములఁ
బడ నతండును మతి - వర్ధిల్లుత మన
రాజమదేవి య - ఱవణ మునీంద్రుఁ
బసిఁడి గద్దియ నుంచి - వలగొని మ్రొక్కి ౧౦౦

స్వామి! యేఁడులు పెక్కు - చన్న యాపిదప
నాపుణ్య ఫల తతి - మీపాదములను
నొప్పించి యిచటికిఁ - దెప్పించె నాలుక-
సన్నగిలకయున్న - సడలిన మేను
పెక్కేండ్లు నిలిచి యీ - పృథివి జీవులను ౧౦౮
పావన మొనరించుఁ - గావుత మనుడు
నమ్మునీంద్రుం డిట్టు - లను రాణితోడ
నురు తపఃకాయమ్ము - నొందితి నైనఁ
గ్రుంకుచున్న సూ - ర్యుని పోలియుంటిఁ
బుట్టిన వారలు - ముదిసిన వారు ౧౧౦
తెగులొందు వారలు - తెగిన వారగుట
స్వాభావికమ్మె యై - శ్వర్యమ్ముకాదు
* ఎన్న నవిద్య సం - స్కృతియు విజ్ఞాన
మును నామరూపముల్ - గనఁగ షడాయ
తనము స్పర్శమును వే - దనమును తృష్ణ ౧౧౫
మమత భవమ్ము జ - న్మము కర్మఫలము
ననెడి పంద్రెండుఁ బా - వనలు విజ్ఞాన
మున నెఱుంగుదు రట్లు - కనుఁగొనలేని
లోఁతు రౌరవము వి - లోకించు వారు
ఇఁకనవిద్య యనఁగ - నేర్పడ వినుము ౧౨౦

* వివరణము ముప్పదవ ప్రకరణమునఁ గలదు

చదివి చదువువాని - మదిఁగానలేక
యెఱిఁగిన యదియును - మఱచి కుందేటి
కొమ్మున్నదనఁగ ని - క్కమ్మనుకొనుట
జగములు మూఁట నీ - జగమె గొప్పదగు
జీవులాఖు తెగలఁ - జెలఁగు నీ జగతి ౧౨౫

ప్రజలు వేలుపులును - బ్రహ్మలు నార
కులు మృగములు భూత - ములు నననొప్పు
వీని గర్భముల ద్వి - విధ కర్మవలనఁ
బుట్టుచు సుఖ దుఃఖ - ములఁ బొందుచుండుఁ
జెడుగులఁ గలిగించు - చోడలునఁ దోఁచు ౧౩౦

కొల దొంగతనమును - వలపను మూఁడు
కాయ దోషములన - గణనకు నెక్కుఁ
గల్ల కొండెమ్మును - కటువాక్కు వ్యర్థ
వాక్కును నాల్గును - వాగ్దోషములకు
కోరుట కినియుట - కూడని చూపు ౧౩౫

నను చిత్త దోషంబు - లగు మూఁడుచేరి
పది విధములఁ గల్గు - ఫలము లెఱుంగు
సన్మతులీ త్రోవఁ - జనకుండువారు
పోయిన మృగములు - భూతముల్ నార
కులుగ మనశ్చింత - గలిగి పుట్టుదురు ౧౪౦

పైని సందిటిని - వదలి శీలమ్ము
దాలిచి దానమ్ము - తల ధరియించి
ప్రజగ వేలుపులుగ - బ్రహ్మలు గాఁగఁ
బ్రభవించి సత్కర్మ - ఫలముల మోద
మునఁ గుడుతురు పుణ్య - మొనరించు వారు ౧౪౫

మీర లీధర్మముల్ - మేకొని వినుఁడు
మణిమేఖలా! నీవు - మఱుజన్మ మెఱిఁగి
యున్నఁ దక్కినవియు - విన్న యామీఁద
వచ్చిన నీకు నీ - పద్ధతుల్ వీని
యంతర్విభాగము - లాదట వినుతు ౧౫౦

నని మునీంద్రుఁడు లేవ - మణిమేఖలయును
లేచి యాతని పజ్జ - లేజ యుగమున
కెరఁగి మెల్లరు మీర - లిమ్మహామహుని
పలుకుల మఱవక - పాటించి నడవుఁ
డేనిట వసియింప - నీఁక నిచ్చగింపఁ ౧౫౫

గాంచినవారు భూ - కాంతుని పుత్రు
పాలి మృత్యువనుచుఁ - బలుకుచుందురు
గోపుత్రకుని పురిఁ - గోరికఁజేరి
యన్వాలఁ బరిపూత - మగు మణిపల్ల
వమ్మును సేవించి - వంజికిఁ బోయి ౧౬౦

పత్ని దేవతకు సే-వలుచేసి మెల్ల
కడలఁ జరించి స-త్కర్మ లొనర్తు
నాపద నాకగు-నను చింత యుడుగుఁ
డని వారలకు మ్రొక్కి-యత్తతి క్రాఁగి
కరఁగిన బంగారు-కరణి సూర్యుండు ౧౬౫

కనఁబడి యస్త మిం-చిన సంజవేళ
మండపమ్మునకుఁ జం-పావతి గుడికిఁ
జని సేవ లొనరించి-స్తంభ ప్రతిమకు
దండంబువెట్టి యం-తర్వీథి నెగిరి
చని పుణ్యరాజు ప-ట్టన సమీపమున ౧౭౦

సుమ వనమ్మున దిగి-శ్రమము దీర్చుకొని
యటఁగల యొక ముని-యడుగుల కెరఁగి
యీ యూరి పేరేది ?-యేలు రాజెవఁడు ?
అని యడుగఁగ నతఁ-డనియె నీరీతి
నిది నాగపురమగు-నేలెడి ఱేఁడు ౧౭౫

భూ. చంద్రుండను-భూపాల సుతుఁడు
సార్థక నాముఁడై-చను పుణ్యరాజు
అతఁడు పుట్టిన యది-సుత మింట మొగులు
కురియకుండుట జన-మెఱుఁగదు గిరులు
తరులు క్షేత్రమ్ములా-తత ధాన్యవితతి ౧౮౦

నొసఁగు నాధి వ్యాధు-లొనరవు ప్రజకు
నని రాజు శీలమ్ము-ముని రాజు పలికె.

## ౨౫. గోపుత్రకుతో మణిపల్లవము చేరుట

రాజు దేవేరితోఁ - బ్రసవ వనంబుఁ
జొచ్చి యచ్చట ధర్మ - సూనృత వ్రతుఁడు
గురుఁడు ధర్మశ్రావ - కుని పదమ్ములకు
మ్రొక్కి యంజలి పట్టి - ముని మాన్య వలన
సుకృత దుష్కృతములు - సుఖ దుఃఖములును ౫

జన్మగతులు ద్వాద - శ నిదానములును
మొనయు నిత్యానిత్య - ములు స్వభావమ్ము
బంధముల్ తెగఁద్రెంచు - పద్ధతుల్ సరవి
నెఱిఁగి బుద్ధుని యవ - తరణ మోపికను
విని యాఁడు తోడింత - కనని లతాంగి ౧౦

కామ వికారమ్ము - కనుల చాపలము
కాంచక చేత భి - క్షాపాత్ర మూని
పాటి యెవ్వరు లేక - సద్ధర్మ సమితి
విను నీమె యెవరని - వేఁడు రాజునకుఁ
గంచుకి వినమిత - గాత్రుఁడై పలికె ౧౫

నేరేటి దీవి నీ - నెలఁతను బోలు
వారలు వెదకిన - లేరీమె వృత్త
మెలమిఁ జోళాధిపు - చెలిమి నాసించి

కలమును కావేరి - గట్టున నిలిపి
పురము చేరితి నట - గురుతపశ్శాలి ౨౦

యఱవణమాని యీ - యతివ వృత్తంబు
తెలిపినాఁడని మున్న - తెలిపితిఁ దమకు
నటనుండి యీయమ - యిట కేగుదెంచె
నన మణిమేఖల - యవనీశ తిలక !
నీ చేతి పాత్రమే - నాచేతి కిపుడు ౨౫

వచ్చిన యది వర - భాగ్యంబు కలిమి
నంతరంగ కలంక - మందిన కతన
మఱచితి తొలుజన్మ - మెఱుఁగవ యైన
నిపుడు నాఁబట్టి యం - చెఱుఁగమి వింత
మణిపల్లవముఁ బ్రద - క్షిణ మాచరింప 30

కున్న బంధమ్ముల - నొనరించి క్రుంచు
జన్మస్థితు లెఱుంగఁ - జాలవు నుమ్ము
ఇట కీవు రమ్మని - యతనితోఁ బలికి
యటనుండి యెగిరి య - హర్పతి పశ్చి
మమున వ్రాలక మున్నె - మహిమీఁద వ్రాలి 3౫

యలలు పరవి తావి - కలిమిని దెలుపు
తీరమందెల్లెడఁ - దిరుగుచు వచ్చి
మణిపల్లవము ప్రద - క్షిణము ముగించి

బుద్ధ పీఠికఁగాంచి - మ్రొక్కి నిల్చుటయుఁ
దన్మణి పీఠి స్వ - జన్మ వృత్తంబు ౮౦

వినిపింపఁ గాయ గ - ట్టను నేటి దరిని
బ్రహ్మ ధర్ముని ఐద - పంకజములను
దరిసించి సేవించి - ధర్మ సంగతులు
విని వినుతించి [1] పృ - థ్వీపుతో నవంతి
కరుగు వారలకుఁ బ్రి - యమ్మున మృగము ౮౫

లుగ మఱి నారకు - లుగ భూతములుగఁ
బొనరించు దుష్కర్మ - ములు [2] పది విడుఁడు
వీడిన మీరలు - వేల్పులు గాఁగ
మనుజులుగాఁగ బ్ర - హ్మలుగ నయ్యెదరు
కాన సత్కృతి [3] దశ - కమ్మును విడక ౯౦

యెడ వీడక శ్రమలఁ - బడియుఁ జేయుండు
పండిత వరుఁడు స - ర్వజ్ఞుండు జగము
నుద్ధరించుకొఱకు - నొక్కఁడై తోఁచు
విభుని ధర్మమ్ములు - వినువారు గాక
వలవని జన్మముల్ - తొలఁగించు కొనెడి ౯౫

---

1. పృథ్వీపుఁడు హస్తిపతి.
2. కొల మొదలగునవి.
3. అహింస మొదలగునవి.

వారలు గారని - వార్యమా మిత్తి
యరుదెంచు మును ధర్మ - మాచరింపుండు
అని వివరించి జి - హ్వాయ నెడి కొడుపు
గొని వాయి యను పల - కను గొట్టి తెలుపు
నుపదేశముల విని - సుపవిత్ర చరణ ౬౦

ములఁ జాఁగి వినుతింప - బలు కటు వార్త
వినిపించితిరి దీని - కేని కతమున్న ?
యని వేఁడ బుద్ధుండు - జనియించు మున్నె
బలభేది యాపీఠి - నిలిపి యున్నాఁడు
బుద్ధదేవునిగాక - మోవదు పీఠి ౬౫

పీఠిక మోపిన - పిమ్మటఁగాక
వాసవుండు నుతించు - వాఁడు కాఁడుచును
అచటి కేగినఁ బూర్వ - మందలి జన్మ
వృత్తమ్ము లాధర్మ - పీఠిక తెలుపు
నని ప్రసాదించెఁ గా - వున నిష్ఠ నాకుఁ ౭౦

దమము తొలఁగఁ బురా - తన వృత్త మెల్లఁ
దెలిపితి సత్తప - స్వుల నాకు-లెపుడు
సఫలమ్ములే యని - సన్నుతిసేసెఁ
బుణ్యా రాజచ్చటఁ - బుష్పవనమ్ము
విడిచి యంతి పురిఁ బ్ర - వేశించి యచటఁ ౭౫

దల్లి పశువుగాఁగ - దండ్రి తపసిగ
వచ్చు జన్మము ముని - వలనఁ బేగు గమి
చుట్టక యట నొక - సొన్నంపు గ్రుడ్డు
నందడంగినదియు - నాతని కరుణఁ
బుత్రులు లేకుండు - భూమిచంద్రుండు ౧౦

గొని పోయినదియును - తన తల్లియైన
యమరసుందరి యను - నయ్యామ వలన
విని చాల చింతించి - వెనుక జన్మమునఁ
దల్లి చేసినదియుఁ - దత్పూర్వగతులు
గమనించి మది-గుంది - ఘనుల సేవించి ౧౫

నాటకంబులఁ గాంచి - పాట లాలించి
దేవేరి యలుకను - దెలిసి క్రచ్చఱఁగఁ
బదముల సన్నిధి - వ్రాలి యామీఁద
కుచముల పైని కుం - కుమ రేఖ వ్రాసి
తుఱుమున విరిసరుల్ - తుఱిమి మొగ్గలను ౨౦

పోలిన చిఱునవ్వు - పోల వీక్షించి
మోముచందురునందు - మొలచిన నల్ల
కలువల నెఱ్ఱని - కొలుకులు కలఁక
చెందంగఁ బుప్పటుమ్ము - చెఱఁగు సింగాణి
మఱఁడు తడవఁ గామ - మద్యంబు నాని ౨౫

యామట తనలోనఁ - గ్రేడించి దోసఁగు
తొలఁగ వీడుట మంచి - తోయమంచెంచి
మహిమాన్వితుండౌ ధ - ర్మ శ్రావకుండౌ
నా వీనుల మొదట - నాటిన విత్తు
మణిమేఖలయును కా - రణ మాటవలన ౧౦౦

భంగమేమియు లేక - ఫలియించె నేఁడు
నిక్కమనుచుఁ బుణ్య - నృపతి పల్కంగ
మనసు మారెను మన - జనపతి కనుచు
జనమిత్రుఁడను మంత్రి - వినుతించి మఱియు
విజయీభవ నృపేంద్ర! - విభవ దేవేంద్ర! ౧౦౫

ఈవు పుట్టక పూర్వ - మీదేశమందు
వానలు లేమిని - పంటలు లేక
తల్లి బిడ్డల గోడఁ - దడవక తాను
మఱుఁగుగ భుజియించు - తెలుఁగు దేశమున
జనియింప మందు వే - సఁగిని మేఘమ్ము ౧౧౦

తోఁచె ననఁగ నీవు - తోఁచి జలమ్ము
నించి తంతటఁ బ్రాణి - నికురుంబమునకు
వాన తప్పకపడెఁ - బంటలు బలిసె
నాఁకలి పెను దగ - లంతరించినవి
నీవేగు తరువాత - నీదేశ జనము ౧౧౫

తల్లిని నీఁగిన - పిల్లల కరణి
గోడు గోడను ధ్వని - గుడికొనఁ గుంద
రక్షణ స్థితిలేక - రాయిడి పడఁగ
వీడి నీవు ముగితి - వేఁడితివేని
స్వార్థపరుఁడ వను - జన నింద యబ్బుఁ ౧౨౦

దన మేలు కొఱకుఁ జిం - తనము సేయుకయ
పరులఁ గావఁగఁ బాటు - పడిన యా బుద్ధు
పద్ధతి యిదికాదు - పరికింపు దేవ!
యని పల్క విని తేఁడు - మణిపల్లవమును
వలగొన నెంచిన - బలితంపుఁ గోర్కి ౧౨౫

నడఁపంగ లేక రా - జ్య విచారణమ్ము
పౌర రక్షణమును - బంధు రక్షణము
నీ యది క్రమ్మటి - నే వడి వత్తు
నని నావికుల నౌక - లాయత్త పఱుప
రప్పించి కడలి తీ - రము చేరి కలము ౧౩౦

నెక్కి హుటాహుటి - నేగ నాయోడ
మణిపల్లవ ద్వీప - మున నిల్వ కవల
నా సమీపమ్మున - నరుగుట గాంచి
మణిమేఖలయు లోన - ఘన మోద మంది
దాని ప్రభునితోడఁ - ద త్తీర భూమిఁ ౧౩౫

జూచుచు దీవిని - చుట్టి రాజేంద్ర!
యరయుము జన్మ వృ - త్తాంతముల్ దెలుపు
ధర్మపీఠమిది వం - దనము చేయుమన
నాతండు వలగొని - యాంజలి పట్టి
మ్రొక్కి - నిలువ రాజు - పూర్వ వృత్తంబు ౧౪౦

కరతల మందుండి - కాంచెడి వారి
మోము చూపెడి యద్ద - ముం బోలె రత్న
పీఠము చూప న - వ్విభుండు నాజన్మ
మెఱింగితి నిడుములు - పరుగులు వాఱె
మధుర యందున్న చం - పావతీ దేవి! ౧౪౫

నడురేయి బోరునఁ - బడు వానయందు
కడుపులఁ గాల్చు నాఁ - కటి బాధవలనఁ
జీఁకటి కంజక - చేరి మండపము
తిరిసి తినెడి నన్ను - దటిసి వేడంగ
వారి కన్నంబిడ - వాంఛించి యేడ్చు ౧౫౦

నన్గని నాడు వా - నలు లేక వరటి
నను తెఱుఁగని పాత్ర - నాచేతి కొసఁగి
బిచ్చ మెత్తెడి పని - వీడి బీదలకు
నన్నదానము సేయు - మని యానతిచ్చి
భవ దుఃఖములఁ బాపు - భారతీదేవి! ౧౫౫

తెలివి తేటలఁ బ్రసా-దించెడి తల్లి !
అమరులకైన బ్ర-హ్మలకైన నాల్క-
కలుచ గడుగు నీ వి-మల చరణములు
మఱి మఱి పుట్టిన-మఱవను తల్లి
యని వినుతించి య-య్యావనీశ్వరుండు ౧౬౦

మీఱు వేడ్కను మణి-మేఖలతోడ
నిరృతి దిశం జని-నీరజాకరము
గోముఖి కడఁ బొన్న-గున్న పెన్నీడ
నుండ నద్దీవి యం-దుండెడి ద్వీప
తిలక యటకు వచ్చి-దీవించి మున్న ౧౬౫

చేత నన్నము గొని-జీవులఁ గాచు
పావన చారిత్ర !-వచ్చితి విటకు
నాఁడు మఱచి నిన్ను-వీక్షిన వారు
క్రమ్మఱు రేఱి వచ్చి-కాంచి నీ స్థితిని
నీవలె జీవముల్-నీఁగి రిచ్చటనె ౧౭౦

యవ్వణిజుల మేని-యస్థి రాసులివి
వారితో వచ్చిన-వారలు చావ
మిగిలిన యెమ్ముల-మిట్ట లియ్యవియు
విరిసిన యా పొన్న-తరువు పెన్నీడఁ
గెరటాలు చేర్చంగఁ-దెరలిన యిసుక ౧౭౫

కుప్పలో నీయెంప - గూఁడు పూఁడినది
నీప్రాణములఁ బట్టి - నీవ తీసితివి
నీప్రాణమ్ములకుఁ గ - నికరించు వారి
ప్రాణములం గూడఁ - బాపితి వీవు
ఘన హింసకుండవు - గద! యట్టి నీవు ౧౮౦

పార్థివేంద్రుఁడ వైన - నై చిత్రి కంబె!
పలువురు మ్రొక్కెడి - పాత్రంబు గొన్న
యో మణిమేఖలా! - నీ మహానగర
మంబుధిలోఁ జొచ్చి - యడఁగి పోయినది
నాగదేశము నేలు - నాథుండు రత్న ౧౮౫

కంకణు సుత పీలి - కంకణ యనెడి
సుందరి సూర్య వం - శ్యుఁడగు రాజు
వలనఁ గాంచిన తన - పట్టితో వచ్చి
యీదీవి వలగొని - యిందుండు నిలువు
మణి పీఠమును ప్రద - క్షిణము గావించి ౧౯౦

ప్రణుతించు తఱిని కం - బళసెట్టి కలము
రాఁగ నతని పాలి - కేగి యా రమణి
రాకుమారుఁ డితండు - కైకొని పోయి
యతని కొసంగుమ - యని యీయ నతఁడు
మోదాతిశయమున - మ్రొక్కి యాయమకు ౧౯౫

బాలకుఁ గొని రేవు - వదలి కలంబు
నడపుచుఁ బోవు నా - నాఁడె చీఁకటిని
కరడుల తాఁకునఁ - గలము ప్రీలినది
అందలి వారలు - కొందఱు రాచ
బిడ్డఁ డబ్ధిఁ బడుట - విభునకుఁ దెలుప ౨౦౦

నాతండు కొడుకున - కైన యాపదకు
మది నోర్వఁ జాలక - మణి నీఁగుకొన్న
నాగంబు కరణిఁ గా - నలు నబ్ధి దరులు
వెదకుచు నుండంగ - వేల్పుల తేని
పబ్బంబు నప్పుర - వరము మా నినది ౨౦౫

మణిమేఖలాదేవి - మది నోర్వలేక
పురముఁ దరంగలు - ముంచుఁ గాక నియె
నా శాప వశమున - నంభోధి రేఁగ
నలలు పెల్లుగ వచ్చి - యుప్పొంటి ముంగ
నొంటరియై యొంద[illegible] - యొడయుండు వోయె[illegible] ౨౧౦

మాధవియును సుత - మఱియు నఱవణ
మునియుఁ దొ[illegible] వంజి - పురిఁ జేరినారు
పలువురు సేవింప - వనధిని గాచు
నా దేవి వచియించి - నది విన్న నీవు
పరితపింతువు సుమ్ము - త్వాదృక్షంశ పుణ్యా ౨౧౫

మణిమేఖలా దేవి - గొని కాచి విడుచు
తఱి నతఁ డొనరించు - దాన వృత్తంబు
నఱవణముని తెల్ప - నట వింద వనుచు
ద్వీప తిలక యేగు - పిమ్మట రాజు
పలలమ్ము లేని యె - మ్ములగూఁడు కట్టు ౨౨౦

వీడి సున్నంబుగ - నొరిసిన కరణి
నుండు దానిం గాంచి - యుమ్మలికింప
నేమి కాంచితి ? నింత - యేమున్న దిందు
నీ దేశముం జేరి - నిన్నిట - కేను
పిలుచుట నీ పూర్వ - వృత్తంబుఁ దెలిపి ౨౨౫

నీ కీర్తి యీ దీవి - నేకేటి దీవి
నిలుపంగఁ గాని యి - ట్లెలయింపఁ గాదు
రాజులు తామె ధ - ర్మము లాచరించు
చున్నచో దోసంబు - లూడ్చంగ వలయు
నవసరమే యుండ - దవనీశ చంద్ర ! ౨౩౦

అట్టి ధర్మంబు లే - వంచు వేని విను
విని విశ్వసింపుము - నిని మఱి కుడుము
జనుల కెల్లరకును - తినఁ దిండి కట్టు
బట్టయు వసియింపఁ - బట్టును గాక
వేఱేమి వలయును ? - పృథివీశ ! యనుచు ౨౩౫

నరపతి యిట్లను - నా దేశమందు
పరుల దేశము లందు - పాటించి నాకు
నీ వుపదేశించు - నెఱి యొనరింపఁ
జనువాఁడ నా పూర్వ - జన్మంబుఁ దెలిపి
నన్నుద్ధరించితి - విన్ను నే వీడఁ ౨౪౦
జాల ననఁగ నామె - జాలి నొందకుము
నీ విచ్చటికి రాఁగ - నీ కొఱకు కడలి
వా యెత్తి పిలిచె నీ - పాలిత భూమి
కలమెక్కి చను మేను - *కరువూరి కేగు
దాన నంచేగె నం - తర్మార్గ మందు. ౨౪౫

## ౨౬. వంజి చేరుట

మినువీథిఁ జని మణి - మేఖల యంతఁ
దనియని ప్రేమతోఁ - దల్లి కన్నగిని
తండ్రియై దాతయై - తనరు కోవలుని
విగ్రహముఁ గాంచు - వేడ్కఁ దొల్కాడ
గుడి వల గొని చొచ్చి - కడు భక్తితోడ ౫

* వంజి, కరవూరు, కరూరు చేర రాజధాని పేర్లు

మ్రొక్కి - నిలిచి కేలు - మోడ్చి ఘటించి
పలు విధముల నా మెం - బ్రస్తుతి చేసి
సహ మరణమ్మును - సత్తపోవృత్తి
గానక పాతివ్రత్య - మునన నీ పాడి
నెఱవేర్చు హేతువు - నెఱి తెల్పు మనుచుఁ ౧౦

బలవించుచు నిలువఁ - బత్ని దైవంబు
పలికె నిట్లనుచు నా - పతి కబ్బినట్టి
యిడుమ కోర్వఁగలేక - యీరన మూని
పురమును దహియించు - తఱి మధురాధి
దేవత కనఁబడి - తేఱ నిట్లనియె ౧౫

నియ్యది మీ పురా - కృత కర్మఫలము
జగతిఁ గళింగ దే - శమ్మున దాయ
లగు నృపతులు వసు - వను వాఁడు కొమరుఁ
డను వాఁడు వేఱ సిం - హపురంబు కపిల
పురము నేలెడి వారు - ఘాని వైరమ్మ ౨౦

పోరున కేగక - తిఱుకుండు తఱి
ధనము సంపాదింపఁ - దలపోసి పెక్కు
వగల నాణెములైన - నగలఁ గైకొనుచుఁ
జెలువయా నీలతో - సింహపురమ్మ
చేరి గుట్టుగ నుండె - భేరి సంగముఁడు ౨౫

వానిని గని ధాన్య - వణిజు లీరసను
గుజ గుజ వోయి యా - కువలయేశ్వరుని
యుద్యోగి నీపతి - యుంగ నొప్పు భరతు
నకుఁ జెల్ప నాతఁ డా - నగల వర్తకుని
గొని పోయి యరుల వే - గని నరపతికిఁ 30

దెలిపి నిర్దోషిని - ఖాలియించె నతని
సతి దిక్కు లేనిదై - వెతఁగొని కుంది
పలవించి పలవించి - పర్వత మెక్కి
పడుచుఁ దా నిడిన శా - పము ఫలియించె
ననియెఁ బురాకృత - మది నీడునేమి ? 35

అవలను కినకచ్చ - ల్లాజమి వలనఁ
బురము దహించితిఁ - బుణ్యకర్మముల
వలన వేల్పుల మైత్రి - మిలఁ జేయు సుకృత
దుష్కృత ఫలము లే - తోయాన నైన
గుడుపక వీడి యె - క్కడకును పోవు 40

పై లోకమునఁ గొన్ని - ఫలియింపకున్న
భువిని జన్మంబులఁ - బూనిచి కుడుపుఁ
గావునఁ బుట్టుచుఁ - గిడచుచుఁ బూర్వ
సంగతుల్ మఱచుచు - జన్మపయోధి
మునుఁగుచుందుము ముక్తి - గనలేము తుదకు 45

వర్షమ్ము సతతమ్ము - పడుచుండు మగధ
దేశలక్ష్మికి నేఁటి - తిలకమై యొప్పు
కపిలవాస్తువు నందు - కడు సార్థకముగఁ
* పారమిత లలవి - మీఱ నిండించి
పావనుండగు బుద్ధ - భానుండు పొడమి ౫౦

బోధి మూలము చేరి - బోధించినట్టి
నాల్గు సత్యంబులు - నలువుగఁ బదియు
రెండయిన నిదాన - రీతులు దాని
నాశ విధానముల్ - నయముగఁ దెలిసి
దుఃఖవిముక్తిని - తోడ్తోడ నొంది ౫౫

చక్రవాళము లోని - జగ మెల్ల యెడల
ధర్మ కిరణములఁ - దనరించు వేళ
నింద్ర విహారమ్ము - లేడింటిఁ గట్టు
వేళ దుఃఖ గతులు - వీడి కారుణ్య
హృదయమ్ముతోఁ దెల్పు - సదమల ధర్మ ౬౦

వచనముల్ విని మేము - ప్రశమమ్ము నొంది
ప్రభవమ్ము వదలి ని - ర్వాణ మందుదుము

*పారమిత = ఒడలు అవయవములు అర్థము గలిగి రూపొంద దానాదులను పూరించుట. ఇవి పది. ౧ దానపారమిత. ౨ శీలపారమిత. 3. క్షమాపారమిత ౪. వీర్యపారమిత ౫. ధ్యానపారమిత ప్రజ్ఞాపారమిత. ౭ ఉపాయపారమిత. ౮. దయాపారమిత. ౯. బలపారమిత. ౧౦. జ్ఞానపారమిత.

అట్టివారల మయ్యు - నధిక కాలమ్ము
ఎట్టివారల కేని - బుద్ధి చేయుదుము
కన్యకా! యీయూరఁ - గ్రమమున నేగి     ౬౫

పలువుర మత ధర్మ - ముల విని తేఱు
నర్థంబు లేదని - యరసిన పిదప
బుద్ధ దేవు పిటక - పద్ధతి ననుస
రింతు వనుచుఁ దల్లి - రీతిగఁ దెలిపి
యీమె యాఁడుది యని - యెపరును ధర్మ     ౭౦

ముల వివరింపంగఁ - దలఁపరు గాన
వేఱు రూపము దాల్చి - వెడలుమ యనఁగ
మంత్రంబు పఠియించి - మణిమేఖల యొక
తపసి రూపం బంది - దైవాలయములు
వేదికల్ శాలలు - విరుల తోఁటలును     ౭౫

కొలఁకులు నెలవుగాఁ - గొని యున్న మునులు
విజ్ఞానులును సత్య - విదులు పండితులు
నిండి చల్లన యైన - నీడల నుండ
బ్రసవింపని కరువు - ప్రసవించె ననఁగఁ
గుదురు కరూరఁ జెం - గుట్టువన్న ఘృపుఁడు     ౮౦

సేనా శిరోగ్రంబు - చేరంగ నేల
నా డెల్ల నమ్మల - నాడనఁ గేలు

గల కొండ లనఁ దగు - కరుల యూథములు
తమలోన మిగుల వి - భ్రమ మందఁ దేరు
లశ్వముల్ వీరులు - నంబుధ చయము ౧౫

దిగు నంబుధి మునుంగఁ - దెంపునఁ గదలి
గంగ దరి నిలిచి - కలముల లోన
నుత్తర తీరంబు - నొయ్యఁ జేరి కనక
విజయులు మున్నగు - విరుల గెలిచి
వారి బొమ్మికముల - పై శిల నెత్తి ౨౦

తెచ్చి స్థాపించిన - ధీరుండు పైఁడి
బాగ ఘూసరములు - బాగుగఁ దాల్చి
చేర భూపుఁడు తన - కీరితి దెసల
వెలుఁగ బంగరు పడ - గలు పొలుపారు
పురమున హేతువుల్ - ముదిరిన వగుట ౨౫

సత్య చతుష్కంబు - స్పష్టంబు గాఁగ
నలరారు కోటకు నొ - ప్పారె నోరుగను.

---

## ౨౭. మత సిద్ధాంతములు వినుట.

సంశయ రహిత త - త్త్వాంశముల్ దెలుపుఁ
డనుచుఁ దత్తత్సమ - యాచార్య వరుల
మానిత వైదిక - మార్గప్రమాణ

వాదిని డాసి మీ - ప్రణుత సిద్ధాంత
మెయ్యది యనఁ - నతడిట్లని పలికె ౫
*పది ప్రమాణములని - వ్యాసుఁడు పలికె
నెనిమిది యని తెల్పెఁ - గృతకోటి యాఱు
కలవని జైమిని - పలికెను పూర్వ
మవ్వి ప్రత్యక్షంబు - ననుమాన ముపమ
శబ్ద మర్థాపత్తి - సహజ మైతిహ్య ౧౦
మరయ నభావంబు - పరిశేష సంభ
వముల నెఱుఁగనగు - స్వచ్ఛత గలుగు
ప్రత్యక్ష మది యైదు - వగుదు లై యొప్పు
కంటిచే రంగును - కర్ణమ్ము చేత
ధ్వనిని నాసికచేత - వాసన నాల్క ౧౫
చే రుచి దేహమ్ము - చే స్పర్శనమును
కని విని శ్వాసించి - తిని తాఁకి సుఖము
దుఃఖమ్ము నను వాని - దొసఁగు లేకెఱిఁగి
యాత్మేంద్రియ మనంబు - లను వానివలన
సత్తను భ్రమయు సం - శయమును లేక ౨౦
దేశ నామములు జా - తి గుణక్రియలను
తెలియంగ నగునంద్రు - లలి ననుమేయ

* ఈ ప్రకరణమందే వెనుక వీని వివరణము కలదు.

ము నెఱుఁగఁజేయున - దనుమాన మండ్రు
సామాన్యమనఁగ శే - ష మనఁగఁ గార
ణమ్మన మూఁడు వి - ధమ్ములౌ నదియు ౨౫

సామాన్యమనునది - సాధన సాధ్య
ముల యన్వయం బండ్రు - కలభంబు గేఁక
విని యటఁ గరియున్న - దని యరయుటగు
శేష మనఁగఁ బాఱు - సెలయేటి వెల్లిఁ
బట్టి యచ్చోట వాన - పడె ననుట యగుఁ ౩౦
గారణమన మబ్బు - క్రమ్ముట గాంచి
వాన వచ్చుననుచుఁ - బలుకుటయండ్రు
హేతువనఁగ నెల్ల - యెడ నితరంబు
నాశ్రయించియ యుండు - నదియగు నాత్మ
ఇంద్రియంబు మనంబు - నేకంబ యగుచుఁ ౩౫

గాంచిన దానిచేఁ - గానని దాని
నూహించు సాధన - ముపమాన మండ్రు
గవయమ్ము గోవు వై - ఖరి నుండు నన్న
నావుచే దాని తీ - రరయుట యగును
*ఆగమ మనునది - యాప్త వాక్యముగు ౪౦

విజ్ఞానదగ్రంథ - విషయాలి వలన

---

* శబ్దమున కాగమ మనియు పేరు.

భోగభూమి యొకండు-భువిఁ గల దనుచు
నరయుట యందు ర-ర్థాపత్తి యనఁగ
గంగలో ఘోషంబు-గలదన గంగ
గట్టున నని మది-గమనించు టగును ౪౫
ఏనుఁగు నెక్కిన-మానిసి దోఁటి
నిమ్మన వేఱొక్క-టీక యంకుశము
నందిచ్చుట [1] వివక్ష-యంద్రు సద్విదులు
ఐతిహ్యమన లోక-మందు వాడుకగఁ
గర్ణపరంపర-గా వచ్చు వార్త ౫౦
పరికింపఁ బుట్టలోఁ-బాముండు ననుట
ఒకచోట నొకవస్తు-వొకట లేదనుట
ఇటను ఘటము లేద-నుట యభావమగు
[2] సంబంధమన రామ-చంద్రుండు గెలిచె
నన రావణుని యోట-మరయుట యంద్రు ౫౫
పది పదులందు తొం-బది యున్న దనుట
సంభవ మందురు వి-జ్ఞాన శేఖరులు
సంజ్ఞయు భ్రాంతియు-సందేహ మవల
నస్పష్టతయు మఱి-యజ్ఞత జ్ఞాత
జ్ఞానము నపరిశి-ష్టము స్మృతి యనఁగ ౬౦

1. స్వభావమునకు సహజము పక్ష అనియు పేరులు.
2. పరిశేషమునకు సంబంధమనియు పేరు.

నిలఁ బ్రమాణాభాస - ములగు నెన్మిదియు
నొక వస్తువుంగాంచి - యొగి వస్తు విద్ది
యని యెఱుఁగుట సాజ్ఞ - యగునందురు బుధులు
శుక్తిని రజతమం - చుఁదలఁపు భ్రాంతి
నిశ్చయ జ్ఞానంబు - నెఱిలేక యిదియొ ౬౫

యదియొ యనుట సంశ - యంబండ్రు దాని
ముంగిటి కంబముం - బుత్రుండ యనుచుఁ
దలఁచుట యస్పష్ట - త యటండ్రు ఘనులు
అరసి యలక్ష్యంబు - నజ్ఞతఁ బులియొ
వచ్చెనన నుపేక్ష - వహియించు టండ్రు ౭౦

పలుకు మాత్రన నందు - వెలయు నర్థంబు
సరగఁ దెల్పుట జ్ఞాత - జ్ఞానభూతమగు
అగ్గి యనఁగ నిది - యని యెఱుఁగుటయు
అభ్రసుమంబు వం - ధ్యా పుత్రుఁడనుట
యపరిశస్త వ్యవ - హారంబ యందురు ౭౫

చలి కగ్గి మందని - తలపోయుటయును
నీకు వీరలు జన - నీ జనకులని
పరులనఁ దెలియుట - స్మరణం బటందు
రిలఁ బ్రమాణాభాస - ముల స్పష్టపఱుచు

* నమరుల గురుని లో - కాయత మతము ౩౦

బుద్ధుఁడు నియమించు - బౌద్ధమతమ్ము
కపిలుండు తెలుపు సాం - ఖ్యమతము మఱియు
నక్ష చరణుని నై - యాయిక మతము
శీలు కణాదు వై - శేషికమతము
జైమిని వివరించు - మీమాంసకంబు ౩౫

విని వారలను వీడి - విభుఁ డీశ్వరుండు
పశుపతియను శైవ - వాదులఁ జేరి
తమ దైవమెట్టి శీ - లము గలది యన
శైవతత్త్వాంచ త్స్వ - భావు లిట్లనిరి
భానుచంద్రులు భూత - పంచకము యజ ౪౦

మానుఁడనఁగ నెన్మి - దూని జీవుఁడు
దేహంబునై యొప్పి - తెలియనౌ వాఁడు
సత్కలా రూపుండు - సర్వజగముల
భావించి పుట్టించి - పరికించువాఁడు
సంహారణమునఁ గ - ష్టము తీర్చువాఁడు ౪౫

---

* ప్రత్యక్షాదు లాఱే (అభావము వఱకు) కపిలాదులచేఁ గైకొనఁబడినవి లోకాయతమునకు ప్రత్యక్ష మొకటి, టి రు బౌద్ధమునకు ప్రత్యక్షానుమానములు రెండును సాంఖ్యమునకు పై రెంటితో నాగమమును నైయాయికమునకు పైమూటితో నుపమానమును వైశేషికమునకు పై నాల్గింటితో నర్థాపత్తియు మీమాంసకు పై యైదింటితో నభావమును ప్రమాణములు.

తనకంటె వేఱేది - యును లేనివాఁడు
శంభుండు వేల్పని - శైవుండు పలికె
ఈ లోకములు దేవు - డిడిన గ్రుడ్డనుచు
బ్రహ్మవాది యనియె - వర కరుణాళు
వబ్ద వర్ణుఁడు శా - స్త్రావలి తెలుపు ౧౦౦

నారాయణుఁడె లోక - నాయకుఁ డనుచు
వైష్ణవుం డొకరుండు - స్వమతమ్ము వినిచె
*ముఖము వ్యాకరణంబు - ముక్కు శిక్షయుగ
కనులు జోస్యము నిరు - క్తంబు కర్ణములు
కల్పంబు చేతులు - కాళ్లు ఛందముగఁ ౧౦౧

బాలుపారు మా స్వయం - భువు వేదమునకు
నాద్యంతములు లేవ - యను వైదికుఁడును
విని సత్యము స్థిరత్వ - మును వీనియందు
కనరాని వగుట యీ - కఱుదులు నశ్వ
వని జైనవృద్ధుఁడిగని కేలు - మోడ్చి ౧౦౨

మీ దేవుఁడెవ్వఁడు - మీ తత్త్వమేది
వివరింపుఁ డనుడు న - వ్వౌద్ధుఁ డిట్లనియె

---

* ముఖం వ్యాకరణం తస్య జ్యోతిషం నేత్రముచ్యతే ।
నిరుక్తం శ్రోత్రముద్దిష్టం ఛందసాం విచితిః పదే ।
శిక్షా ఘ్రాణంతు వేదస్య హస్తౌ కల్పాన్ ప్రచక్షతే ॥

అగణితమై యున్న - యర్థంబులందు
ఎల్లవేళల నెల్ల - యెడ నెల్లవిధుల
నంటి తెలియవచ్చు - నధిక విజ్ఞాని ౧౧౫

మర్కలి దేవుఁడే - మా ప్రభుఁడగును
నవసూర్యుఁ డనెడి గ్రం - థమ్మునఁ జెప్పఁ
బడు విషయము లైదు - పరికించి వినుము
భువి నాల్గుతెగ లణు - వులు గలవందు
జీవుఁ డా యణువులఁ - జేరుట విడుట ౧౨౦

గలదు మన్నీరగ్గి - గాలి యనియెడి
నాల్గింటిచేతనే - నగములు తరులు
దేహముల్ గల్గును - తీఱెడి తఱిని
తమ తమ మూల త - త్త్వమ్ములఁ గలియు
వాని కూడిక విడి - వడుట యెఱుంగు ౧౨౫

వాఁడె జీవుండనఁ - బడువాఁడు చుమ్ము
శీతోష్ణములు గల్గి - చెలు వొందు జలము
ధరణి యాదరువుగాఁ - దనరారుచుండు
వేఁడియుఁ గాంతియు - వెలసిన దగ్ని
చలువ వేఁడియుఁ గల్గి - చలియించు గాలి ౧౩౦

పై గుణమ్ముల నెల్లఁ - బ్రకటించు భూమి
వీని కూడికచేత - వెవ్వేఱు ప్రకృతు

లొంది యవ్వలఁ గార్శ్య-మందుచుఁ జిదియు
క్రొత్తవి పుట్టి యొ-క్కొంట మఱొందు
చొరక జలాణువు-లు రసాణువులుగ ౧౩౫

మాఱక యొక్కటి-మఱిరెండు గాఁగఁ
బగులక దావాగ్ని-వలెఁ బరపకయుఁ
దిరుగు నడఁగు నూర్ధ్వ-స్థితి మార్పులేక
ధర జనింపఁగఁ గూడఁ-దరువాత వీడి
తమ తమ గుణములఁ-దనరారుచుండు ౧౪౦

చేరి యున్నతమయి-చెదరి యల్పమగు
వెదురయి తొలవడు-వృక్షమై మొలచు
పూర్ణచంద్రుంబోలి-పొలిచి మేదినికిఁ
గట్టిగా నిండిన-గణనకు రాని
గణములు కూడి యొ-క్కటి భూతములయి ౧౪౫

తగ్గియుఁ గలిసియు-బ్రొగ్గని కరణి
నొందు ముప్పాతిక-రెండు పాతికలు
పాతికయె తగ్గుఁ-బదపడి హెచ్చు
దానికి నొక పేరు-తనరున యేమి ?
ఈ గుణముల జను-లెనసినఁ గాక ౧౫౦

నేల నింపుటయును-నీట నానుటయు
నగ్గిఁ గాలుట గాలి-నల్లలాడుటయు

నను కార్యముల నొందఁ-నగున యెందేని ?
జ్ఞాననేత్రమున న-ల్వాణుగుణంబు
లెఱిఁగిన వారలే-యిలఁ బెద్దవారు ౧౫౫

తక్కువారలు భూత-తతినుండి ముక్తి
నందఁజాలరు సంశ-యం బొక్క వెండు
నను కానలేరట్టి-ఘనులు వెండ్రికల
నుఁడి చూపులేల యీ-భూతలమందు
కర్మజన్మల నర-కంపు జన్మంబు ౧౬౦

పశు జన్మమును తామ్ర-భావ జన్మంబు
స్వర్ణ జన్మంబు ర-జత జన్మములను
క్రమమున నెత్తి వ-ర్ధనమంది పుట్టు
వారు స్వచ్ఛంపు ధ-వళ జన్మమెత్తి
ముక్తి నొందుదురు ము-వ్వుల నొందబోరు ౧౬౫

కాని జనంబు లీ-క్రమము నశింపఁ
జేయుదు రెన్నటికిని-కడతేఱలేరు
మహి జన్మచక్రంబు-మండల మనఁగఁ
జెలఁగుఁ బొందుటయును-క్షీణించుటయును
తొలిచోటి కేగుట-దుఃఖముల్ సుఖము ౧౭౦

లందుట సాధి చి-నని నీఁగుకొనుట
పుట్టుట గిట్టుట-పురుషుండు గర్భ

మునఁజొచ్చినప్పుడే - మునుకొని కలియు
సుఖదుఃఖములు కూడఁ - జూడ నణువులై
నీ గుణంబులు నణు - నిచయంబు లగుచు ౧౭౫

సుఖదుఃఖములఁదేలు - చున్న సున్మ్మి నిన్ను
మర్కలిశాస్త్ర మ - ర్మంబిద్దియనఁగఁ
బూర్వోత్తర విరుద్ధ - ములగు తత్త్వముల
వదలి [1]దిగంబర - వాదిని గాంచి
మీదేవుఁ డెవ్వఁడు ? - మీ మత తత్త్వ ౧౭౦

మెయ్యది ? యది వెల - యించు నాబంధ
మోక్ష నిరూపణ - ముంజేయుఁ డనఁగ
నతఁడిట్టులను [2]నింద్ర - శతకంబుచేత
నగ్గింపఁబడుచుండు - నర్హుండు దేవుఁ
డతని గ్రంథములు - మూఁడనుదు నంగాగ ౧౭౫

మంబును పూర్వాగ - మంబు బహు శ్రు
తాగమ మనఁగఁ - గాయంబులు మూఁడు
తన్మాత్రకాయ - మతన్మాత్రకాయ
మనఁగఁ గాలాకాయ - మను స్థిరుఁడైన
జీవుఁడణువులు దు - ష్కృతియును సుకృతి ౧౮౦

1. దిగంబరవాదులకు నిర్గ్రంథవాదులని యుఁ పేరు.

2. భవనేంద్రులు నలువదియిద్దఱు, వ్యంతరేంద్రులు ముప్పదియిద్దఱు, కల్పేంద్రు లిరువదియిద్దఱు చంద్రుఁడు, సూర్యుఁడు, నరేంద్రుడు, మృగేంద్రుఁడు అనువారు.

వానిచే నొదవెడి - బంధమోక్షములు
వాని పద్ధతులును - వరుస స్వర్గంబు
తత్తత్స్వభావ ప - ద్ధతులు వేఱయ్యుఁ
దోఁచు తీరుల నొక్క - ధోరణి నున్న
నిత్యమై మఱియు న - నిత్యమై నిలిచి ౧౯౫

సూక్ష్మబుద్ధుల లెక్క - చొప్పునఁ బుట్టు
స్థితి లయమను మూడు - స్థితు లొప్పుచుండు
నింబంబు మొలతేఁచి - నింబమే యగుట
నిత్యంబు కామియు - నిత్యంబటండ్రు
పెసలు గుణము చెడ - వీడక లద్దు ౨౦౦

చేసినఁజొఁ బెసల్ - చెడుటయు గుణము
చెడకుండుటయుఁ గల్గు - వడిని తన్మాత్ర
కాయ మంతటనుండి - గరిమను వస్తు
వుల నడపును నిత్య - పూతమైనట్టి
దయి యతన్మాత్రకా - యమ్మన్ని వస్తు ౨౦౫

వుల నిల్పుచుండును - పొలుపుగా నిట్లు
కాలము గణితమై - ఘటనమల్పంబు
కల్పమై దీర్ఘసం - ఘటనముం జేయు
నన్నిటికిని స్థల - మాకాశ మొసఁగు
విస్తారముగ నభి - వృద్ధి గావించు ౨౧౦

జీవుం డా దేహముం - జేరి యింద్రియ సు
ఖమ్ము లనుభవించుఁ - గడకొక్క యణువు
దేహమగును వేఱు - దేహముల్ దాల్చి
సత్కర్మ దుష్కర్మ - చయ మాచరించి
ఫలము లనుభవించు - పట్టున రెంటి ౨౧౫

మార్చి పూర్వ ఫలము - మాయింపనగును
అట్లు సేయుట ముక్తి - యంద్రు తత్త్వజ్ఞు
లని యాతఁడు వచించు - నవ్వల సాంఖ్య
వాది స్వసిద్ధాంత - పద్ధతిఁ దెలుపఁ
దొడఁగె విజ్ఞానంబు - తోరంబుగాఁగ ౨౨౦

నది త్రిగుణాత్మక - మై మనోవికస
నము లేక మహిమమ్ము - సమశక్తినుండి
యెల్ల యర్థము జని - యింప నిల్లగుచు
మూల ప్రకృతియగు - మొదఁ జిత్తమందు
తనరు మహతత్త్వ - మను బుద్ధి వెడలె ౨౨౫

నందుండి యాకాశ - మందుండి గాలి
యందుండి యనలమ - య్యనలంబునుండి
జలము జలమునుండి - స్థలము వెల్వడియె
నవ్వాని కూటంబు - నందుండి మనసు
నందుండి వెడలె - నహంకృతి వ్యోమ ౨౩౦

వీథి శ్రవశ్శబ్ద - వికృతులు గాలి
వలనఁ ద్వక్స్పర్శనుల్ - వహ్నియందుండి
చక్షుఃప్రకాశముల్ - జలంబుననుండి
నాలుక చవియును - నేలయందుండి
నాసిక వాసన - నలువుగఁ గలిగె ౨౩౫

వాని ననుసరించి - త్వక్కుననుండి
వాక్పాణి పాదముల్ - పాయు వుపస్థ
లను నైదు కర్మేంద్రి - యంబుల నైన
భూత వికృతులయి - పొలుచు కొండలును
చెట్టు మున్నగునవి - చేరి జనించి ౨౪౦

జగముగా వర్ధిల్లి - చనుదెంచినట్టి
పూర్వపుఁ దోవనే - పోయి యడంగుఁ
బ్రకృతి యంతంబునఁ - బ్రళయంబు దాఁక
నొక్కటై యెల్లెడ - మిక్కిలి పరవి
నిత్యమై యెఱుకకు - నిలయమై మూఁడు ౨౪౫

గుణములఁ దవులక - గొఱలెడి యింద్రి
యమ్ముల నెఱుకకు - నందక యెల్ల
యర్థముల్ తోఁప ని - ల్లగుటయె కాక
యయ్యర్థతతి యర - యఁగ నెఱుకగుచు
నేకమై యది యెల్ల - యెడల వ్యాపించి ౨౫౦

నిత్యమై యెఱుకకు - జ్ఞేయమై యలరు
పురుషుఁ డై౦ద్రియములై - పొలుచు తన్మాత్ర
లగు నిరువదియైదు - పగుదులఁ దనరు
నేల నీరు నగిని - గాలి యాకసమె
మైనోరు కను ముక్కు - వీనులై రూపు ౨౫౫

చవి కాంతి చలనము - శబ్దమై పరఁగి
వా ్ణి పాదముల్ - పాయు పుస్థ
లై మనోబుద్ధి - చిత్తాహంకృతులును
జీవునితోఁ జేరి - చెలఁగుచునుండు
నని స్పష్టపఱచిన - యాతని పలుకు

విని యాల వై - శేషికుని గని నీదు
తత్త్వ మేదనఁగ నా - తం డిట్టులనియె
కన నిత్యవస్తువు - గుణము కర్మంబు
సామాన్యము విశే - షము కూటమనఁగ
నాఱు విధములగు - నందు సత్యంబు ౨౬౫

గుణము కర్మంబును - గూడి యే కని
కైనఁ గారణమగు - నావస్తు వరయఁ
దొమ్మిది విధములై - త్రోతెంచుచుండు
వసుమతి జల మగ్ని - వాయు వాకసము
దెసలు కాలము నాత్మ - దెందమ్ము ననఁగ ౨౭౫

వసుధకుఁ గలుగు - శబ్ద స్పర్శరూప
రస గంధములు పయి - రసము మొదలుగ
నొక్కొక్క గుణములే - యుండును తక్కు-
వానికి శబ్దాది - ప్రకృతులు గురుత
లఘుతయుఁ గృశత - స్థూలతయు సౌందర్య ౨౭౫

మును మృదుత్వము - రూపమునుగా ననేక
గణనీయమగు వస్తు - గుణచయ మగును
వస్తువు గుణమను - ద్వయము కర్మగుణులఁ
జలుపుట కధికార - ములు గల వగును
పర సమానతయె స్వ - త్వము నిచ్చకతన ౨౮౦

జరుగుట నిలుచుట - సామాన్య మగుటఁ
జచ్చుట పుట్టుట - చనుట వర్ధిలుట
వస్తు తత్త్వంబయి - వసుధ నొప్పారు
నది యణుకూటమై - యలరారు నవ్వి
గుణమన గుణియనఁ - గొమరారు ననుచుఁ ౨౮౫

బలికె వైశేషిక - వాది యూ పిదప
భూతవాది నడుగ - నాతఁ డిట్లనియె
కండ చక్కెర మధూ - క ప్రసవములు
మఱికొన్ని వస్తువుల్ - మర్దించి కాచ
నాసవంబు గలిగి - నట్టులు భూత ౨౯౦

ములుచేర నొక్క సం-చలనమ్ము గలుగు
నశియించు తఱిఁ-దద్గుణమ్ము లవ్వాని
యంద యడఁగు మృతి-నందు జీవమ్ము
తోడఁ గూడిన చల-ద్భూత సంచయము
జీవంబు తొలఁగ వి-శీర్ణంబు లగుచుఁ 295

దద్వికృతులు మూల-తత్త్వంబు లందు
కలియును తత్త్వని-క్కరణి నొప్పారుఁ
దక్క వికల్ప త-త్త్వమ్ముల సమితి
లోకాయతు లెఱుఁగు-వీఁకయె చుమ్ము
మాకుఁ బ్రత్యక్ష-ప్రమాణంబు తక్కఁ 300

దక్కను మానాది-తతులు నశించు
నీ జన్మమున ఫలం-బీ జన్మమంద
యనుభవం బగు మఱు-జననంబు కల్ల
ఇప్పటి ఫలముల-నే జన్మమందో
యనుభవించు ననుట-యవిచార వాక్కు 305

అని యాతఁడు వచింప-నన్ని మార్గములు
మణిమేఖల వినియు మంచివి కాక
గున్నను వాదాడ-నొల్లక పూర్వ
జన్మమే నెఱిఁగిన-సరణి మఱెవ్వ
రరసినారని నవ్వ-నాతండు భ్రాంతి 310

చేత స్వప్నావస్థ - చేతను సంశ
యింపఁ దగినరీతి - నిదియుదాఁగాని
మహిని ప్రత్యక్ష ప్ర - మాణ మేదేని
కలదే? యనఁగ నీకుఁ - గలరుగా మాతృ
పితరులు వారల - నితరులు తెలుప 3౨౫

ననుమానమున నమ్మి - యలరితిగాని
ప్రత్యక్షముగఁ గాంచ - వలతి వాదేమి?
నిశ్చయ జ్ఞానంబు - నెగడక యున్నఁ
బరమార్థ తత్త్వంబు - నరయుట కిద్ది
యనుమానమా? యిట్టు - లనకుమ యనుచు 3౨౬

నైక్యార్థముం దెల్పి - యయ్యమ యిట్లు
మాఱువేసమ్మున - మత తత్త్వములను
తెలిసె నె దింటిని - తేట తెలముగ.

## ౨౮. కాంచీపుర ప్రవేశము.

మాధవితో సుత - మతితో నఱవణ
ఋషిచంద్రుఁ గరుపూర - నీక్షింపఁ గోరి
శత్రురాజుల గొప్ప - సైన్యంబు వోలెఁ
జుట్టిన పల్లెలు - సొరిదిని దాఁటి
కలుజులలో నుండి - వెలివడు నీట

గృహిణులు నిమురలా - కేశముల్ గడుగఁ
గలసి చిక్కనయైన - కలపంపు నీరు
యువతులు యువకులు - నొడలుఁ గడుగు
యంత్రంపు బావుల - నందలి చంద
నపు నీరు నృపతి జ - నన దినమందు ౧౦

చిమ్మన గ్రోవులఁ - గొమ్మలు చల్లు
వాసత జలము త - పస్వుల పాద
యుగ్మంబు గడుగ శ్రీ - లోపాసకాలి
కరముల జాలు మం - గళ గంధజలము
దాత లరుగుపోగ - తనర నిండించు ౧౫

చలిపందిరులలోని - చల్లని నీరు
క్రమ భాగములు గాఁగ - గంధవస్తువులు
చేర్చి నూటిన వారి - చేతుల నీరు
ఎల్ల యెడలఁ బాటి - యొగఁదొట్టుకతన
జలచరములకు మైఁ - గల నీచుకంపు ౨౦

తొలఁగి గుమాయించు - తొలుకలు గలుగఁ
గలువలు నల్లి చెం - గలువలు నల్ల
కలువలు వన్నెల - కంజాతములును
పరవఁ దుమ్మెద లార్వ - వాసవధనువు
వెలసినట్టు లగడ్త - విలసిల్లుచుండె ౨౫

బహువిధ యంత్రముల్ - పరఁగిన కోట
గోడ లెత్తై సిల్పి - గోట కావలను
కావలి వనము చ - క్కని గాఁగ నడరి
జిగి వెదఁజల్లు రా - జిత రజతాద్రి
పగిలిన దననొప్పి - వసుధ యెల్లెడల ౩౦

వెన్నెల యను సుధ - విలసిల్ల విరుల
తీవలు కలిసి వ - ర్ధిలిన వాకిలిని
తలవంచి చొచ్చి కా - వలి కాయువారు
మూఁగి సదామ్రోఁత - మ్రోఁగు వాకిలియు
చేఁప లమ్మెడివారు చెఱకమ్మువారు ౩౫

అప్ప మమ్మెడివారు - నుప్పమ్మువారు
పిట్టమ్మువారలు - నట్టమ్మువారు
కలిసు మమ్మెడివారు - కల్లమ్మువారు
పొడి కలపము గంధ - పొడి యమ్మువారు
దారమ్ము లమ్మెడి - వారి వీదులును ౪౦

కుమ్మరుల్ కంచరుల్ - కమ్మరవాండ్రు
రాగరుల్ పైఁడి క - రంచెడివాండ్రు
రజతకారులు మహా - రజతకారకులు
జల గడ్డువారు త - క్షకులు శిల్పులును
చిత్రకారులు పట్టు - చే నేయువారు ౪౫

సాలెలు దర్జీలు - మాల కరులును
సంగీత విదులు జో - స్యము చెప్పువారు
చర్మకారులు పెక్కు - కర్మకారకులు
కాఁపు వారలును నౌ - కా వర్తకులును
శంఖమ్ములను కోయు - జనులు ముత్తెములఁ ౫౦

బగడమ్ములను బెజ్జ - పఱచెడివారు
సవరిల్లు వాడలు - జైత్ర జాతీయ
ములను జేసిన - యాట వెలఁదుల వీడ
వెవ్వేలు నూనెలు - వెల కిచ్చువారు
వెలచేయు ధాన్య రా - సులఁ బోయువారు ౫౫

సూతులు మాగధుల్ - వైతాళికులును
గలుగు వాడలు కంటి - యలవికి మీఱు
సున్నితమగు పని - సొంపు పెంపారు
వర్ణకారకులున్న - వాడలు పసిఁడి
వన్నె యొఱిఁగి కొను - వారల వీధి ౬౦

రత్నమ్ము లమ్మువా - రలు గలవీధి
ధరణీశువీథి ప్ర - ధానుల వీథి
సేనాపతుల వీథి - సేనల వీథి
సందులు రచ్చలు - చదుకముల్ మండ
పమ్ములు క్రొత్తగాఁ - బట్టిన కరుల ౬౫

బంగరు కింకిణుల్ - పరఁగు గుఱ్ఱముల
గతులను మఱపు మా - వతు లాశ్వికులును
తిరుగు వీదులును కృ - త్రిమ పర్వతములు
ఆస గొలుపు చంద - నాదులంతోడఁ
గ్రతు భుక్ప్రతతులు స్వ - ర్గంబునే మఱచి ౨౦

తమ తమ చెలులతోఁ - దానంబు సేయు
జలజాకరములు శా - లలు కూటములును
చిత్రమంటపములు - చిత్రశాలలును
కాంచి యానందించి - కలరూప్రతోడ
విను ద్రిమ్మరులు వేడ్క - విడియుచునుండు ౨౫

నింద్ర విహారాన - రుంద్ర మోదమున
పూత ధర్మంబులు - మొగి నభ్యసించు
వారున్న యమ్మౌని - పల్లియఁ జొచ్చి
కోవలు జనకుండు - గురుతపో వృత్తి
జరగు నాతని మహా - సార్థవాహుఁగని ౩౦

తత్పదములకు వం - దన మొనరించి
తన పాత్రదానము - దాన ఫలమునఁ
బశు పుత్రకుండు శ్రా - వక విభుఁడగుచు
నిండ్రి భోగమ్ముల - నెసలారుటయును
కొనివచ్చి యతనికి - మణిపల్లవమున ౩౫

## కాంచీపుర ప్రవేశము

బుద్ధ పీఠమును చూ - పుటయు నతండు
తన పూర్వజన్మ వృ - త్తము నెఱుఁగుటయు
నెఱిఁగిన యాయని - యెదుర దైవమ్ము
కనఁబడి హృత్క - ళం - కమ్ము దీర్చుటయు
సంగమ పురమును - సందర్శనమ్ము మిగుల ౯౦

యుజవణ మునివెంట - నరిగి తల్లులను
వంజి చేరుటయు నొ - ప్పఁగ విన్న పిదప
శ్రావక విభుఁడు స్వ - రాజ్యంబు చేర
తానా స్థలముపీడి - యీ నగరంబు
చేరి కన్నగిని - దర్శించిన యవల ౯౫

మత బోధకులు తమ - మత తత్త్వములను
వినిపింప వినుటయు - విన్న యర్థములు
మదికి నచ్చమి బౌద్ధ - మత ధర్మములను
విన నిచ్చగించి త - ద్వేత్తల వెదక
నటకు వచ్చుటయుఁ దె - ల్పుటతోడ నతఁడు ౧౦౦

పూత చరిత్ర! - నా పుణ్య ఫలంబె
నిన్ను గాన్పించెను - నీ తలిదండ్రు
లొనరఁ బూర్వము సేయు - నురు దుష్కృతంబు
వలన మధుర కాలి - ప్రక్షీణమగుట
విని సుఖమని దయా - వీర మతమున ౧౦౫

కర్మాఁడే యగుట - గృహస్థ జీవితము
మాయ యని యెఱింగి - మహిత సంపదలు
కాయఁబు బుద్బుద - గతిఁ బోలుననుచు
భావించి నిశ్చల - ప్రమితి నందితివి
తత్త్వ చింతనముఁ గోఁ - దపము పూనితివి ౧౧౦

పడమటిరాజు చే - రుఁడు మున్ను స్త్రీల
తోడ నీ సరసి నీ - రాడి యుండుండ
రమణ లంకంగల - శ్రమణకాంతి యను
గిరిఁజేరి వలగొని - మరలు చారణులు
గగన చారులు గుణ - గణ్యులు ధరణి ౧౧౫

పతి కిట ధర్మ సం - గతులు బోధింపఁ
దలపోసి దిగి శిలా - తలమున నిలువఁ
గని రాజు వారలఁ - గడు గారవించి
తన పూర్వ పుణ్యంబు - దైవాఱు కతన
వారల వినుతించి - పదసేవ చేసి ౧౨౦

పరిశుద్ధమగు నాల్గు - వగల యన్నంబు
పాత్ర లందుంచి సా - పడు తరువాత
నంజలి ఘటియించి - యతి భక్తి నిలువఁ
బుట్టుచే దుఃఖమ్ముఁ - బుట్టమి సుఖము
ననుచు బుద్ధుఁడు వచిం - చిన సత్యసుధను ౧౨౫

చెవులారఁ జవులూరఁ - జింతలు నీఁగఁ
జిలికించు నానాఁడు - చెలువ! నీ తండ్రి
కిని తొమ్మిదవతర - మునవాఁడు కోవ
లుఁడను నతని కీ - దండితారాతి
తేఁడు పీడనిచెలి - కాఁడగు కతన ౧౩౦

గురుధర్మ వితతి త - ప్పకమతిఁ దాను
విని తన పూర్వులు - వినుత మార్గమున
గడియించినది కాక - కడుఁ గూర్పు ధనము
పలు కోట్లు లేదు - నాఖిలలోన బీద
జనుల కొసఁగి తప - శ్చర్యను పూనె ౧౩

నతఁడు సుగతున కి - య్యద్రిపైఁ గట్టి
యుంచిన చైత్య మీ - యుర్వి జనముల
పాప చయమ్ములఁ - బాఱంగఁ ద్రోలు
నది కాంచు నాన నే - నరుదేర నిచటి
మనులు విజ్ఞానమ్ము - బోధించి మీ పు ౧౪౦

రము జేపు జలధి గ - ర్భఁబునఁ జొచ్చు
ననిన వాక్యము లిట - విని నిలిచితిని
దుర్విధి ప్రేరేప - దోరు నీ తండ్రి
పూర్వ పుణ్యాస వే - ల్పులఁ జేరియున్న
నచట దుష్కర్మ ఫ - లానుభవమ్ము ౧౪౫

పరిపూర్తి యగుడుఁ - దపం బాచరించి
భార్యతోడఁ గపిల - వాస్తు పురమునఁ
బుట్టిన బుద్ధుని - పూత ధర్మములు
విని ముక్తినొందు వాఁ - డని యద్భుతంపు
వృత్తాంతమును జ్ఞాన - వృద్ధులు తెలుపఁ ౧౫౦

దెలిసితి నేను నా - దినముల నచట
నతని ధర్మమ్ములు - హితముగ విందు
నియ్యది ద్వైదికుఁ - జెఱిగింప నీవు
నెఱిఁగితి మానిచే - నింక ధర్మముల
విని కడ కేఱుము - వినఁదగు స్థలము ౧౫౫

కంచి యంచతఁడు - తత్కాంచీపురమ్ము
చేరె నీ తల్లులు - చేరి రచ్చటికి
నానాట నిప్పుడు - వానలు లేక
మలమల మాఁడి - జీవులు చచ్చుచున్న
వారు కావున ముని - వరులకు నన్న ౧౬౦

ఇడువారు లేకుంట - నీ పురమ్మునకు
వచ్చిరి చూడు మా - పట్టనమ్మునకుఁ
గారు మొగులు వోలెఁ - గడు శీఘ్రగతిని
తరలి యందలి వారి - నరయుట నీకుఁ
దగవని వచియింపఁ - దన్వి యాతనికిఁ ౧౬౫

గేల్మోడ్చి పాత్రమ్ము - కేల ధరించి
వంజి మహాపురి - పడమటి దెసను
దివికి నెగసె వడ - దెస నేగి మగలి
యింద్రు నమరపురి - యిల కేతెంచె
ననఁగ సకల క - ల్యాణ సంపదలఁ ౧౭౩

బొదలిన బంగారు - పురము కాంచి
ఫల హీనముగుటఁ బ్ర - భా హీనమగుచు
నుండుటఁ గని నొచ్చి - యుప్పరంబు నవ
ప్రహారిని వలగొని - పట్టణమధ్య
మునఁ జేరె; నటఁ జోళ - జనపతి యనుజుఁ ౧౭౪

డరుదెంచి పసిఁడి శా - ఖావలి పచ్చ
లాకులు పసుపు పూ - తేకులు బోధి
భగవానున కమర్చు - భవ్యాలయమ్ము
వలగొని చొచ్చి ప్రమో - క్కులు సమర్పించి
యటకు నైరృతి దిశ - నమరు పూఁదోఁట ౧౭౫

కేగ నా యువరాజు - నెదుటికి వచ్చి
వినమిత గాత్రుఁడై - వినుతించి కేలు
మోడ్చి కంచుకి పల్కె - భూపాల జన్మ!
కొమిరెల మిన్న యా - కోవెల తనయ
తపము పూనిన దమ్ము - తసురభి చెంతఁ ౧౭౬

బూని ధర్మద వన - మునకు నానవలె
వచ్చియున్నది యనఁ - బ్రభు ననుజుండు
బంధులతో మంత్రి - వర్గంబుతోడఁ
గనఁగోరి పూర్వను - కంపంపుఁ బ్రతిమ
యున్నది యెల్ల స - త్యం బయ్యె ననుచు ౧౯౦

నయ్యము వినిసిన - యాచ్చోటి కేగి
పాలనమునఁ బోర - పాటొందె నేమొ?
చేసిన తపములు - చెడియెనో? సతుల
క్రొత్తడి తనమునఁ - గుంటయ్యె నేమొ?
సద్గుణ రత్నమా! - జనపద మెల్లఁ ౧౯౫

గఱవుచేఁ గష్టింపఁ - గారణ మేమొ?
తెలియను కలఁత నొం - దితిఁ దేఱుకుంటి
మున్నొక వేలుపు - మొగిఁ బ్రసన్నమయి
ముచ్చిరకుము జీవ - ముల వీడఁబోకు
సత్తపస్విని యొక - చామ యేతెంచి ౨౦౦

తనచేతి పాత్రచేఁ - దఱుఁగక యుండు
బోనమ్ము వలన - జీవులను పోషించు
నాయమ కరుణచే - నమరాధి నేత
పంపున నధికమౌ - వర్షంబు కురియు
నామె యీ నగరాన - కరుదెంచు పిదప ౨౦౫

నతిశయ ధర్మ ప - ద్ధతులు పెక్కుగను
కురియకున్నను నీరు - తఱుఁగక యుండు
గోముఖియను పెను - కొలఁకుతోడ మణి
పల్లవమై యిటు - వచ్చిన దఁగ
గొప్ప కొలంకును - కుసుమ వనంబు　　౨౧౦

వెన నిల్చుమని వేల్పు - వెడలిన పిదప
నీ విరి వన మీా స - రోవర మిచట
నిర్మించితి మనుచు - నెలఁతకుఁ జూప
మోదంబు నంది నా - పూర్వ వృత్తాంతంబు
వివరించు నమ్మణి - పీఠిక యిద్ది　　౨౧౫

యన బుద్ధ పీఠిక - నచటఁ గల్పించి
మణిమేఖలాదేవి - మణి ద్వీప తిలక
వినుతింపఁ దగిన కో - వెలలు గట్టించి
పూజ లుత్సవములు - భూపాలకుండు
చేయంగ నియమించి - స్త్రీ రత్నములను　　౨౨౦

వినుతించి పంకజ - పీఠికఁ గాంచి
వలగొని మ్రొక్కి యాఁ - కలికి ముందైన
యమృత సురభిఁ జూపి - యఖిల జనములు
వత్తురు గాకని - వచ్చి క్రిందుకొను
మూఁడు భాషల - జనములలోన గ్రుడ్డి　　౨౨౫

కుంటి చెవిటి గూని - ఘోర రోగులును
మూఁగలు వ్రతులు నా - పోవని తృష్ణ
గొన్నవారలు గొద - గొన్నవారలును
చింపు లుడుచువారు - జీర్ణదేహులును
వేలకు వేలుగాఁ - బృథివి యీనె నన -౦౩౦

నెగడి క్రమ్మఁట తోడ - మృగపక్షి వితతి
పుడమియే పల్లమై - యడఁగ నొక్కటను
చేర నొచ్చిన యెల్ల - వారల కన్న
మిడుచుండ ఘనుఁలచే - నిడు భిక్షఫలము
నీరును కాలంబు - నేల సాధనము -౦౩౫

ననువుగ నమర వి - త్తిన విత్తునుండి
నిగుడారు పంటకం - బెను గొప్పదనుచు
నెన్నంగఁదగి యూఁమె - యన్నంబు కురియ
వానయుఁ బంటయు - వర్ధిల్లి ఫలము
నొసఁగిన దననొప్పి - యొడుదుడుకులను -౨౪౦

మానుపుచుండ న - మ్మానినీ మణిని
జనములు పొగడుట - విని తల్లియు సుత
మతి యఱవణముని - పతియును మోద
మున మణిమేఖల - భువన జీవులకు
నన్నంబు వెట్టుచు - హర్షించుచున్న ౨౪౫

ధర్మశాలను డాయు - తఱి యామె కాంచి
యెదురేగి వారల - పదములకెఱఁగి
భవనాశకుం బల్కి - పాదముల్ గడిగి
యాసనమ్ము లొసంగి - యతి రుచ్యమైన
భోజనమ్ములు పెట్టి - ప్రొద్దునో మున్నె 2320
యారగించు పిదప - నాకు వక్కలును
పచ్చకప్పుర మిచ్చి - వారి దీవనలఁ
బొంది కృత్రిమవేష - మును వీడి తనయ
తల్లుల కడనిల్చెఁ - దత భక్తితోడ.

## ౨౯. తపస్వినియై ధర్మములు వినుట.

గద్యము.

అట్లు తెలచి నిలిచిన మణిమేఖలను దీవించి విమల వాగ్విశారదుఁడగు యఱవణ మునీంద్రుఁ డిట్లనియె. నాగదేశ రాజపుత్రి పీలివలయ చోళనృభునకుఁ గన్న కుమారుని మణి పల్లవము చేరిన కంబళసెట్టి వశముసేయ నతఁ డానందచిత్తుఁడై యందికొని కలమెక్కి వచ్చుచుండ నొకరేయి నడుజామునఁ దీరము చేరువ నా కలము చెడుటయు శిశువును కానక యా సెట్టి చింతించి చింతించి చేయునది లేక యా వృత్తాంతము రాజునకుఁ దెలిపె.

ప్రభుఁ డా వార్త విని మిక్కిలి పరితపించి తనయుని తీర భూముల వెదకుచు నింద్రోత్సవము మఱచె. పూర్వము నౌక చెడి సంద్రమున మునుఁగఁ బచ్చని కంబళమును బంగరు సూదితోఁ గుట్టిన తీరగపడఁ గోవలుని పూర్వుఁడగు కోవలుఁ డేడు దినములు కడగండ్లు పడుచు నీఁదుచుండ నతఁడు నిశ్చల శీలుఁడు మహాదాతయు నగుటచే నింద్రుని పాండు కంబళాసనము వడవడ వడంకె. అది యెఱిఁగి యాది భగవానుఁడు బోధి మూలమునఁ బ్రవచించిన ధర్మములను వ్యాపింపఁజేసిన వణిజుఁడు వనధిని వనట నొందుచున్న వాఁ డతని గట్టు చేర్పు మని పారమిత ముట్ట ధర్మము పాలింప ధర్మచక్రము దొరలింప జన్మ పరంపరయం దుత్పన్నుడునని చారణులు కారణములతోఁ దెలుప వచ్చి సాయపడినందుల కా దేవతపేరు తండ్రి నీ కిడియె. ఆ దైవము నీకును స్వప్నమందలి జ్ఞప్తివలె సన్న్యాసమును బోధించినది. ఆ దైవశాపము వలన సంగమ నగరమును జలధి మ్రింగె. నీ తల్లులు నేనును నీ కొఱకే కాంచీపురంబు చేరితిమి. అనుటయు నమ్మణిమేఖల అఱవణుని బుద్ధ పీఠికను పనుతించి మ్రొక్కి ద్వీపతిలకయు నాకీ నగర వృత్తాంతము చెప్పినది. కావుననే వంజిపురికిఁ బచ్చన్నరూపమున నేగి యట వెవ్వేఱు మత సిద్ధాంతములు విని పిదప వినినవానితోడన నా గుప్తవేషమును విసర్జించితి. స్వాములవారు సత్య సిద్ధాంతము

నెఱిఁగింప వేఁడుచుంటి నని యర్థింప వచింతు సావధానమతివై వినుమని యతం డిట్లనియె.

ఆదిభగవానుని ప్రమాణములు రెండే అవి ప్రత్యక్షానుమానములు. చూచి తెలియునది ప్రత్యక్షము. నామ జాతిగుణ క్రియలు తక్కఁ దక్కినవి యనుమాన మంద చేరును. కారణకార్య సామాన్యజ్ఞానము కలదియు నొకటిని వదలి వేఱొండు లేనిదియు ననుమాన మనంబడు. అది పొగవలన నగ్నివలెఁ గారణమువలనఁ గార్యము నెఱుఁగుట. ఇతర ప్రమాణములెల్ల నీ యనుమాన మంద చేరును.

అనుమానమందు పక్షము, హేతువు, దృష్టాంతము, ఉపనయము, నిగమనము అను నైదంశములు కలవు. ఈ పర్వత మగ్ని కలది యనుట పక్షము. పొగ కలది కావున అనుట హేతువు. వంటయింటివలె అనుట దృష్టాంతము. కొండయును పొగ కలది అనుట ఉపనయము. పొగ యున్న చోట నిప్పు కలదనుట నిగమనము (వ్యాప్తి). నిప్పులేక పొగలేదనుట వ్యతిరేక నిగమనము. నిప్పును పొగయు లేనిది మడువువలె ననుట (విపక్షమున హేతువాక్యము) నైధర్మ్య దృష్టాంతము. వినుట యను కార్యమగుటచే శబ్ద మనిత్య మనుట పక్షము. చేయఁబడుటచే ననుట పక్షధర్మవచనము. ఏవేవి చేయఁబడునో యవి యన్నియు ఘటమువలె ననిత్యము లనుట అన్వయ వ్యాప్తి (సపక్షానుసరణము). ఏదేది అనిత్యము

కానిదో (నిత్యమో) అది కార్యము కానిది ఆకాశమువలె ననుట వ్యతిరేకవ్యాప్తి (విపక్షానుసరణము).

హేతువాక్యమన అనన్వయమందు ప్రమాణమనునది. మృత్తిక లేక ఘటము లేదనుట. ఎచ్చట సాధ్యము సంశయాస్పదమో అది పక్షధర్మత. లేమిని కంచేటికొమ్ము చూడ లేదనుట సపక్షము. ఏది కలదో అది చూచుటకు అఱచేతి నెల్లిని పోలు ననుట విపక్షము. ఇట్టి పద్ధతిగల హేతువాక్యము సాధించునది యేది యన, పొగయున్నచోట నిప్పు కలదను అన్వయముచేతను, నిప్పు లేనిచోట పొగలేదను వ్యతిరేకాన్వయము చేతను పొగ నిప్పును సాధించినది. ఘటించిన పొగచే నేర్పడిన యూర్ధ్వగమనము కుటిలగమనము ప్రజ్వలించిన నిప్పు నుండి యగు కార్యమగుటచే పైఁజూచి నల్లనై క్రమ్మియుండు దానిచే నిప్పును సాధింపవలయును.

అన్వయము సాధించుటకు మున్నే గాడిదను గణికను ఒక చోట నొక కాలమున అన్వయించి చూచినవాఁడు తరువతి కాలమున గాడిదను కాంచినచోట గణిక నూహింపవలయుఁ గదా! అది పొసఁగదు. ఏల? ఇట కారణమునుండి కార్యము లేదు. నిప్పులేనిచోట పొగలేదను వ్యతిరేకాన్వయము సాధించుచో గాడిద మూఁపుపై కుక్కతోఁక లేదనినచో నక్కతోఁకయు లేదను వ్యతిరేకవ్యాప్తి వలన మఱొకచోట నక్కతోఁకచే కుక్కతోఁక నూహించుట యరిదియగుఁ గాన నదియుఁ గాదు.

ఉపనయము నిగమనము రెండును దృష్టాంతమందే చేరి యుండవలయు. పక్ష హేతు దృష్టాంతములు చేరఁగా మంచివియు చెడ్డవియుఁ గలవు. అందు బయలుపడిన ధర్మిని వెలువడిన సాధ్యధర్మమును విభజించిన వేఱగును. అట్లు వేఱయ్యును అవి సాధ్యమును సాధించు స్వభావము కలవే. అట్టి ధర్మినే పక్షమందురు. శబ్దమునందు నిత్యత్వ అనిత్యత్వములు సాధింపఁ బడుట వలన ఆ శబ్దము ధర్మి యనఁబడును. శబ్దము సాధ్యధర్మ మగుట యెట్లన, నిత్య[illegible]ములు ఘటిల్లు హేతువు మూడుగాఁ జెప్పఁబడు పక్ష సపక్ష విపక్షములలో పక్షమున నుండుటయు సపక్షమునఁ గలుగుటయు విపక్షమున లేకయే యుండుటయు నగును. సపక్షమనఁగా సాధించు పదార్థము పక్షమునఁ జెప్పఁబడిన సామాన్యనియమము గలిగియుండుట. శబ్దమున అనిత్యత్వము సాధ్యమైనచో అనిత్యమైన ఘటాదుల వలె ననుట. విపక్ష మనఁగా ఏదేది యనిత్యము కానిదో (నిత్యమో) అది ఆకాశమువలె చేయఁబడనిది. కార్యత్వమను హేతువు పక్ష సపక్షముల (శబ్దఘటముల) లో నున్నదై విపక్షమునలేక అనిత్యత్వమునకును సాధించు హేతువైనది.

దృష్టాంతము సాధర్మ్యము వైధర్మ్య మని యిరు తెఱఁగు. సాధర్మ్యమున అనిత్యము ఘటాదియను నన్వయము. వైధర్మ్యమున సాధ్యము నొందనిచోట హేతువు లేకుండుట. ఈ హేతువు సత్పక్షము సద్ధేతువు సద్దృష్టాంత మన నొప్పు.

వీనిలో పక్షాభాసము తొమ్మిది విధములు. అవి ప్రత్యక్ష విరుద్ధము, అనుమాన విరుద్ధము, స్వవచన విరుద్ధము, లోక విరుద్ధము, ఆగమ విరుద్ధము, అప్రసిద్ధ విశేషణము, అప్రసిద్ధ విశేష్యము, అప్రసిద్ధోభయము, అప్రసిద్ధ సంబంధము అనునవి.

ప్రత్యక్ష విరుద్ధమన, శబ్ద మనిత్యము కంటికి కనఁబడుట వలన అని చెప్పఁగా, అది (శబ్దము) చెవికిఁ దెలియును గాన ప్రత్యక్ష విరుద్ధము. అనుమాన విరుద్ధమన, అనుమానముకు వ్యతిరేకముగ వచించుట. అనిత్యఘటమును నిత్య మనుట. స్వవచన విరుద్ధమనఁగా, తన పలుకునే మార్చి వచించుట. మాతల్లి గొడ్రాలే యనుట. లోకవిరుద్ధ మనఁగా, నెల చంద్రుఁడు కాఁ డనుట (నెల = చంద్రుఁడు). ఆగమ విరుద్ధ మన, శాస్త్రముల కర్థము విరుద్ధముగాఁ జెప్పుట. అనిత్య వాదియైయున్న వైశేషికుఁడు అనిత్యమును నిత్యమని వచించుట. అప్రసిద్ధ విశేషణమన, ప్రతివాదికి సాధ్యము తెలియకుండుట. బౌద్ధుఁడు ప్రతివాదియైన సాంఖ్యునిగూర్చి శబ్ద మనిత్యమన్నచో, వాఁ డవినాశవాది యగుటచే సాధ్యవినాశ మప్రసిద్ధమగును. అప్రసిద్ధ విశేష్యమన, ప్రతివాదికి ధర్మి సిద్ధము లేకయుండుట. సాంఖ్యుఁడు ప్రతివాదియైన బౌద్ధుని గూర్చి ఆత్మచైతన్యము కలది యన, నతఁ డనాత్మవాది యగుటచే ధర్మి అప్రసిద్ధమగును. అప్రసిద్ధోభయమన, ప్రతి

వాదికి ధర్మియు ధర్మమును తెలియక అప్రసిద్ధమై యుండునది. వైశేషికుఁడు బౌద్ధునిగూర్చి సుఖము మున్నగు విషయములకు కారణ మాత్మ యన్నచో సుఖమును ఆత్మయు తా నంగీకరింపని వగుటచే అప్రసిద్ధోభయ మగును. అప్రసిద్ధ సంబంధమన, ప్రతివాది కనుకూల పదార్థము సాధించుట. ప్రతివాది యగు బౌద్ధునకు శబ్ద మనిత్యమన్నచో, నతఁడు తన సిద్ధాంత మది యగుటచే వానికి వేఱు సాధింపవలసినది లేకపోవును.

హేత్వాభాసము ముత్తెఱఁగు. అసిద్ధము, అనైకాంతికము, విరుద్ధము అని. అందు అసిద్ధము ఉభయాసిద్ధము, అన్యథాసిద్ధము, సిద్ధాసిద్ధము, ఆశ్రయాసిద్ధము అని నాలుగు తెగలగును.

ఉభయాసిద్ధమన, సాధనమైన హేతువు వాది ప్రతివాదులకు పనికిరాకపోవుట. శబ్ద మనిత్యము కంటితోఁ జూచుట వలన అనుట. అన్యథాసిద్ధమన, చెప్పినహేతువు వ్యర్థమై ప్రతివాది కనుకూల మగునది శబ్ద మనిత్య మన్నచో ప్రతివాదియగు సాంఖ్యున కది సాధింపవలసిన శ్రమలేక అసిద్ధ మగును సిద్ధాసిద్ధమన, సంశయ హేతువుచే సాధించుట. ఆవిరి మంచు అను సందియముతోనుండ పొగతోడి నిప్పు కలదని నిశ్చయించుట. ఆశ్రయాసిద్ధమన, ప్రతివాదికిఁ దగిన ధర్మి లేమిని చూపుట. ఆకాశము శబ్దగుణముచే వస్తువని యెంచినచో ఆకాశము వస్తువు కాదనువారికి ధర్మి యసిద్ధము.

అనె కాంతికము కూడ సాధారణము, అసాధారణము, సపక్షైకదేశవృత్తి విపక్షవ్యాపి, విపక్షైకదేశవృత్తి సపక్షైక వ్యాపి, ఉభయైకదేశవృత్తి, విరుద్ధ వ్యభిచారి అని యాఱు విధములు.

సాధారణమన, సపక్ష విపక్షములలో హేతు వొక్కటై యుండునది. శబ్ద మనిత్య మరయఁబడుటచే నన్నచో అరయఁ బడుట నిత్యానిత్యములు రెంటికిని చెందును. ఘటమువలె అనిత్య మరయుదుము. ఆకాశమువలె నిత్య మరయుదు మనుట.

అసాధారణ మన, తాను తలంచిన పక్షము నందలి హేతువు సపక్ష విపక్షములలో లేకుండుట. శబ్దము నిత్యము వినఁబడుటచే నన్నచో, వినఁబడుట యను హేతువు పక్షమున నున్నదైనను సపక్ష విపక్షముల లేనందున సంశయము కలుగును.

సపక్షైకదేశవృత్తి విపక్షవ్యాపి యన, హేతువు సపక్షమున నేకదేశమందుండి విపక్షమున నెల్ల యెడల నున్న దగును. శబ్దము, కలిగించోటు తెలియరానిది (ఏలయన) అనిత్యమగుటచే నన్నచో, అనిత్యమను హేతువు కలిగినచోటు తెలియమికి సపక్షము (ఆకాశము) నందంతట లేకపోయినను ఒకచో నేర్పడి మెఱుపువలె నశించి కార్యమునఁ దోఁచును; ఘటాదులవలె నశించియుఁ గార్యముచందము తోఁచుననుట.

విపక్షైక దేశవృత్తి సపక్షవ్యాపి యన, హేతువు విపక్ష మందొకచ్చోఁ దోఁచి సపక్షమున నంతటఁ గలిసియుండుట.

శబ్దము, చేయుచోటఁ దోఁచునది (పలుకుట) అనిత్యమగుటచే అన్నచో, అనిత్యహేతువు చేయుచోటఁ దోఁచుటకు విపక్షా కాశము లేకున్నను మెఱుపు పుట్టిన యాకాశమందు కానఁబడక సపక్ష ఘటాదులు తమలో నెల్ల [illegible] నాక మెఱుపు వలె ననిత్యమై చేసినచోటఁ దోఁచవు; ఘటమువలె ననిత్యమై చేసినచోటఁ దోఁచుననుట.

ఉభయైకదేశవృత్తి యన, హేతువు సపక్షమునను విపక్షమునను ఒకచో వర్తించుట. శబ్దము నిత్యము అమూర్తమగుటచే నన్నచో, అమూర్తహేతువు నిత్యత్వమునకు సపక్షాకాశపరమాణువులలోఁ దోఁచి మూర్తమగును. పరమాణువులచేఁ దోఁచకయైనను విపక్షమైన ఘటసుఖాదులలో సుఖమునఁ దోఁచి ఘటమున లేకుండుటచేతను ఏకదేశమునఁ గలుగునది. ఏకాంతము కాదు. అమూర్త మాకాశము వలె నిత్యము. అమూర్తసుఖము వలె ననిత్యము అనుట.

విరుద్ధవ్యభిచారి యన, అనివార్యమైన హేతువై విరుద్ధ హేతువునకును ఎడమిచ్చునది. శబ్ద మనిత్యము కార్యత్వమగుటవలన నన్నచో కార్యత్వగోచరమగు సపక్షమై యున్న ఘటాదు లుండఁగా శబ్దము నిత్యము వినఁబడుటచే శబ్దత్వముపోలెనని వివరించుట. రెంటియందును శంక్యమే కాని ఏకాంతము కాదు. ఈ విరుద్ధము నారసిచూచినచో ౧. ధర్మస్వరూప విపరీతసాధనము ౨. ధర్మవిశేష విపరీత

సాధనము ౩. ధర్మిస్వరూప విపరీతసాధనము ౪. ధర్మి విశేష విపరీతసాధనము అని నాలుగు విధములు గలది యగును.

ధర్మస్వరూప విపరీతసాధన మనఁగా చెప్పిన హేతువు నందు సాధ్య ధర్మస్వరూపము చెడుట. శబ్దము నిత్యము చేయఁబడుటచే నన్నచో చేయబడునది అనిత్యమగుటచే చేయఁ బడిన హేతువు సాధ్యధర్మనిత్యత్వమును వీడి యనిత్యమును సాధించుటచే విపరీతము.

ధర్మవిశేషవిపరీతసాధనమన, చెప్పిన హేతువు సాధ్య ధర్మమునందు విశేషము చెడ సాధించునది. కన్ను మున్నగు వానిని — ఇంద్రియములు పరార్థముల నుద్దేశించి నిలుచుటచే — శయనాసనములఁ బోలె నన్నచో ఉద్దేశించి నిలుచుటచే నన్న హేతువు శయనాసనములందు పరార్థము వోలె కన్ను మొద లైన యింద్రియములను పరార్థమునందు సాధించి శయనా సనముల వలెనై కన్ను మున్నగు నింద్రియములకును పరమై జాతిక్రియానిరవయవమై యున్న యాత్మ సావయవమని సాధించి సాధ్యధర్మమునందు విశేషము చెఱిచినందుచే విపరీతము.

ధర్మిస్వరూపవిపరీతసాధనమన, ధర్మిస్వరూపమును హేతువే విపరీతపఱుచునది. భావము ద్రవ్యము కాదు; గుణ కర్మముల యస్తిత్వముకంటె వేఱగుటచే సామాన్య విశేషముపోలె నన్నచో ద్రవ్యము గుణము కర్మము నొక్కటై నిలిచిన వాని యస్తిత్వము వేఱగుటచే హేతువులు మూఁటితోఁడి యునికి, హేతు వానరించు

సామాన్యాస్తిత్వము సాధ్యమందు లేమిచేతను, దృష్టాంతమందు సామాన్య విశేషముగాక వేఱొండు లేమిచేతను భావమనఁబరఁగు ధర్మిని అభావపఱచుటచే విపరీతము.

ధర్మివిశేషవిపరీతసాధనమున, ధర్మివిశేషాభావము సాధించుట. మున్ను చూపఁబడిన హేతువే భావ మగుచున్నది. ఉద్దేశముగల క్రియయు గుణము నగుచున్నది. దానిని విపరీతము చేసెనందువలన ధర్మి విశేషమును చెఱిచినది.

దృష్టాంతాభాసము సాధర్మ్యము వైధర్మ్య మన నిరు తెగలగునని మున్నె చెప్పఁబడియె. అందు సాధర్మ్యము ౧. సాధన ధర్మవికలము, ౨. సాధ్యధర్మవికలము, ౩. ఉభయ ధర్మవికలము, ౪. అనన్వయము, ౫. విపరీతాన్వయము అని యైదువిధము లగుచున్నది. వైధర్మ్యమును ౧. సాధ్యావ్యావృత్తి, ౨. సాధనావ్యావృత్తి, ౩. ఉభయావ్యావృత్తి, ౪. అవ్యతిరేకము, ౫. విపరీతవ్యతిరేకము అని యైదు విధములు.

సాధనధర్మవికలమున, దృష్టాంతమున సాధనము కొఱవడునది. శబ్దము నిత్య మమూర్తమగుటచే నన్నచో ఏదేది అమూర్తమయ్యెయ్యది నిత్యమగుటచేఁ గానఁబడినది పరమాణువునం దన్నచో, దృష్టాంతపరమాణువు నిత్యత్వముతో మూర్తమగుటచే సాధ్యధర్మనిత్యత్వము నిండి సాధనధర్మామూర్తత్వము కొఱవడును.

సాధ్యధర్మవికలమన, చూపఁబడిన దృష్టాంతమున సాధ్యధర్మము కొఱవడుట. శబ్దము నిత్యమమూర్తమగుటచే, ఏదేది అమూర్త మయ్యయ్యది నిత్యము బుద్ధివలె నన్నచో, దృష్టాంతముగా చూపఁబడిన బుద్ధి యమూర్తమై నిలిచియే యనిత్యమగుటచే సాధనామూర్తత్వము నిండి సాధ్యనిత్యత్వము కొఱవడును.

ఉభయ ధర్మవికలమన, చూపఁబడిన దృష్టాంతమందు సాధ్యసాధనములు రెండును కొఱవడుటయేకాక సత్తు అసత్తు అని యిరు తెఱఁగగుచున్నది.

అందు సదుభయధర్మవికలమన, ఉన్నద్రవ్యమున సాధ్య సాధనములు రెండును కొఱవడఁజూపుట. శబ్దము నిత్యమమూర్తమగుటచే—ఏదేది అమూర్త మయ్యయ్యది నిత్యము ఘటము వలె నన్నచో దృష్టాంతమైన ఘటము కలిగి సాధ్యమైయున్న నిత్యత్వమును సాధనమైయున్న అమూర్తత్వమును కొఱవడును.

అసదుభయధర్మవికలమన, లేని వస్తువులందు సాధ్యసాధనములు రెండును కొఱవడఁజూపుట. శబ్దమనిత్యము మూర్తమగుటచే—ఏదేది మూర్త మయ్యయ్యది యనిత్య మాకాశము పోలె నను దృష్టాంతమున సాధ్యధర్మమైయున్న యనిత్యత్వమును సాధనధర్మమైయున్న మూర్తత్వము రెండును ఆకాశము అసత్తనువాని కందేదియు లేమిచే కొఱయగును. సత్తనువానికి ఆకాశము నిత్య మమూర్తమగుటచే నతనికిని కొఱయగును.

అనన్వయమన, సాధనసాధ్యములందు కూడికమాత్రము చెప్పక రెంటి యునికిని చూపుట. శబ్ద మనిత్యము కృతక మగుటచే—ఏదేది కృతకమో అయ్యయ్యది అనిత్యమను అన్వయము చెప్పక ఘటమందు కృతక మనిత్యము చూడఁబడ్డ యన్నచో అన్వయము తెలియని దగును.

విపరీతాన్వయమన, వ్యాపకాన్వయముచే వ్యాప్యము విధించుట శబ్ద మనిత్యము కృతకత్వముచే నన్న—ఏదేది కృతకమో యయ్యయ్యది యనిత్యమను వ్యాపకముచే వ్యాప కము ననుమానింపక ఏదేది యనిత్యమో అయ్యయ్యది కృతక మను వ్యాపకముచే వ్యాప్యము ననుమానించుట. అటను మానించుటచే వ్యాపకము వ్యాప్యములేకయు నేర్పడుటచే విపరీతము.

వైధర్మ్యదృష్టాంతమందు,

సాధ్యావ్యావృత్తియన, సాధనధర్మము సాధ్యమును తప్పక వీడుట. శబము నిత్యమమూర్తమందన్న చో.—ఏదేది నిత్యము కా దయ్యయ్యది యమూర్తమును కాదు పరమాణు వునుపోలె నన్నచో—అట్లు దృష్టాంతముగా చూపఁబడిన పర మాణువు నిత్యమై మూర్తమగుటచే సాధనామూర్త మిట సాధ్యనిత్యత్వమును తప్పక వీడుట యగును

సాధనావ్యావృత్తియన, సాధ్యధర్మ మిట సాధనధర్మ మును తప్పక వీడుట. శబ్దము నిత్య మమూర్తమఁదన్నచో

—ఏదేది నిత్యముకాదో అయ్యయ్యది అమూర్తమును కాదు కర్మమునుపోలె నన్నచో—వైధర్మ్యదృష్టాంతముగా చూపఁబడిన కర్మము అమూర్తమై యనిత్యమగుటచే సాధ్యమైన నిత్యమిట సాధనమైన యమూర్తమునుండి తొలఁగదు.

ఉభయావ్యావృత్తియన, చూపఁబడిన వైధర్మ్యదృష్టాంతమునుండి సాధనసాధ్యములు తొలఁగనివై సదుభయావ్యావృత్తి అసదుభయావ్యావృత్తి యని యిరు తెఱఁగగు.

సదుభయావ్యావృత్తియన, ఉన్నవస్తువునందు సాధ్యసాధనములు తొలఁగకుండునట్లు వైధర్మ్యదృష్టాంతము చూపుట. శబ్దము నిత్య మమూర్తమగుటచే నన్నవారికి ఏదేది నిత్యము కాదో అయ్యయ్యది అమూర్తమును కాదు ఆకాశమువలె నన్నచో వైధర్మ్యదృష్టాంతముగా చూపఁబడిన ఆకాశము వస్తువనువారికి, ఆకాశము నిత్యము నమూర్తము నగుటచే సాధ్యనిత్యము సాధనామూర్తము రెండును ఇట లేదు.

అసదుభయావ్యావృత్తియన, శబ్ద మనిత్యము మూర్తమగుటచే నన్నయెడ, ఏదేది యనిత్య మయ్యయ్యది మూర్తమును కా దాకాశముపోలె నని వైధర్మ్యదృష్టాంతము చూపినచో ఆకాశము వస్తువుకాదన్నవానికి అది సత్తు కాకుండుటచే సాధ్యానిత్యమును సాధనమూర్తమును తొలఁగుటయు తొలఁగమియు లేనిదగును.

అవ్యతిరేకమున, సాధ్యములేనిచోట సాధనము లేమిని చెప్పక వీడుట. శబ్దము నిత్యము చేయఁబడమిచే నన్నచో ఏదేది నిత్యము కాదో అయ్యయ్యది చేయఁబడకుండునది యుఁ గాదు అను నీ వ్యతిరేకము తెలియఁజెప్పక ఘటమునందు చేయఁబడుటయు ననిత్యమును చూచితిమి కావున నన్నచో వ్యతిరేకము తెలియదు.

విపరీతవ్యతిరేకమున, విభేదము తాఱుమాఱుపడక చెప్పుట. శబ్దము నిత్యము మూర్తమగుటచే నన్నచో నని, నిలుచునెడ నేయేచోట నిత్యములేదో ఆ యాచోట మూర్తము లేదనక, ఏచోట మూర్తములేదో ఆచోట నిత్యము లేదన్నచో వ్యతిరేకము విపరీతమగునని గ్రహించునది.

ఇట్టి అసత్సాధనముచే చూపు ననుమానాభాసము నందలి సత్యాసత్యముల నిట్టి విధులచే శంకలేక తెలియఁగుము.

## ౩౦. భవహరణము.

దానంబు సేయుచు - దశశీలములను
భరియించి తన పూర్వ - భవము నెఱిఁగిన
మణిమేఖల పవిత్ర - మణులు మూడైన
బుద్ధునకును ధర్మము - నకు సంఘమున
కొనర ముమ్మాఱు వం - దన మొనరించి ౫

శరణాగతయగుచు - శరణంబు నొందు
తరువాత నిర్మల - ధర్మతత్త్వమును

చెప్పఁదలచి ముని - సింహుఁ డిట్లనియె
విజ్ఞతచెడి జీవు - లజ్ఞానతమము
నందుమునింగి కార్శ్యము - నొందు తఱిని ౧౦

వేల్పులు పలుమరు - వేడంగఁ దుషిత
లోకంబు వదలి భూ - లోకంబు నుద్ధ
రింపనెంచి యవత - రించి తాబోధి
తరుమూలమున నిల్చి - మరుని జయించి
దుర్దాంతవీరుఁడై - దోషత్రయమ్ము ౧౫

మూల ముట్టుగఁ ద్రెంచి - భువి నాల్గుసత్య
ముల నియమము చెడి - పోను పడువేళఁ
బుట్టిన *యగణిత - బుద్ధులు తెలిపి

* గౌతమ బుద్ధునకు పూర్వము ధర్మము తగ్గినకాలమునఁ బునరుద్ధరింపఁ బుట్టిన బుద్ధులు పలువురని బౌద్ధ సిద్ధాంతము. బుద్ధచరిత్రమందును బౌద్ధ జాతక కథలందును ఈ విషయ మెఱుఁగనగు. పూర్వబుద్ధు లిరువది యేడుగురి పేరులు మాత్రము తెలియవచ్చుచున్నవి. అవి ౧. శితంకరుఁడు, ౨. మేధంకరుఁడు, ౩. శరణంకరుఁడు, ౪ దీపంకరుఁడు, ౫. కౌండిన్యుఁడు, ౬. మంగళుఁడు, ౭. సుమంగళుఁడు, ౮. రేవతుఁడు, ౯. శోభితుఁడు, ౧౦ అనోమదర్శి, ౧౧. పద్ముఁడు, ౧౨. నారదుఁడు, ౧౩. పద్మోత్తరుఁడు, ౧౪. సుమేధుఁడు, ౧౫ సుజాతుఁడు, ౧౬. ప్రియదర్శి, ౧౭. అర్థదర్శి, ౧౮. ధర్మదర్శి, ౧౯. సిద్ధార్థుఁడు, ౨౦. తిష్యుఁడు, ౨౧ పుష్యుఁడు, ౨౨ విపశ్చిత్తు, ౨౩. శిఖి, ౨౪. వృషభుఁడు, ౨౫. కకుందుఁడు, ౨౬ గోవగాముఁడు, ౨౭. కశ్యపుఁడు. ఇయ్యది లంకలోని విద్యోదయ పాఠశాలా ప్రధానోపాధ్యాయులగు శ్రీ సుమంగళాఖ్యులచేఁ దెలియవచ్చినదని మహామహోపాధ్యాయ దాక్షిణాత్యకలానిధి. వే. స్వామినాథయ్యగారు వ్యాఖ్యయందు తెలిపిరి.

యున్న పం(డెంపు - లోకోత్తరవిధుల
ధర్మము విలసిల్ల - ధారణిఁ బుట్టి ౨౦
వానిని వివరించు - పద్ధతులందు
మండల పద్ధతి - మహిజను లరయ
జన్మ క్రమమ్ము నా - శమ్మందునట్లు
కారణమేలేక - కార్యంబు లేదు
కానఁగార్యమునకుఁ - గలుగు హేతువును ౨౫
పరికింపఁదోఁచునౌ - గురువాక్య సరణి
తెలిసియు లక్షణ - వలన నూహింపఁ
బడియు నెఱింగిన - పరమ తత్త్వమున
మొగి నాల్గు ఖండములౌ - మూఁడు సంధులును
జన్మమ్ములును మూఁడు - చందమ్ములగుచుఁ ౩౦
బుట్టువులకుఁ దగు - మూఁడు కాలములు
గలిగి దోషంబును - కర్మంబు ఫలము
కలిగి నిల్కడలేని - కడు దుఃఖనిలయ
మై చతుస్సత్యగే - హమ్మయి పంచ
స్కంధములకు నివా - సమ్మయి మఱియు ౩౫
నాఱు వాదుకలకు - న్యాసంబు చూపి
నయములు నాలుగు - నలి నాఱు ఫలము
లొందిి నాల్గు తెగల - యుక్తభాషణము

లంది నిర్మితిలేక - యంతంబులేక
*సంతానమును గాక - క్షయమును లేక ౪౦
చేయువారును లేక - చేయంగఁబడని
దియుఁగాక తుదకు నే - దియుఁగాక వచ్చి
నదియుఁ గాక వెడలు - నదియును గాక
ముగియించుటయులేక - ముగియింపు లేక
కర్మము ఫలము భో - గము జన్మముక్త ౪౫
లన్నియుఁ గాకుఁ దా - నగుచు నొప్పారు
నెన్న నవిద్య సం - స్కృతియు విజ్ఞాన
మును నామ రూప - ముల్ గనఁగ షడాయ
తనము స్పర్శమును వే - దనమును తృష్ణ
మమత భవమ్ము జ - న్మము కర్మఫలము ౫౦
ననెడి పంద్రెండు పా - వనులు విజ్ఞాన
మున నెఱుఁగుదు రట్టు - కనుఁగొనరేని
లోఁతు కారణము వి - లోకించువారు
ఇఁక నవిద్య యనఁగ - నేర్పడ వినుము
చదివి చదువు వాని - మదిఁ గొనలేక ౫౫
యెఱిఁగిన యదియును - మఱచి కుండేటి
కొమ్మున్న దనఁగ ని - క్కమ్మనుకొనుట

* సంతానమన ననుసరణము. ఇది వారూ సంతానము దీపసంతానము ధారాసంతానము పిపీలికాసంతానము అని నాలుగు విధములు.

[1]జగములు మూట నీ - జగమె గొప్పదగు
[2]జీవు లాఱు తెగలఁ - జెలఁగు నీ జగతి
ప్రజలు వేలుపులును - బ్రహ్మలు నార ౬౦

కులు మృగములు - భూతములు నన నొప్పు
వీని గర్భముల ద్వి - విధకర్మ వలనఁ
బుట్టుచు సుఖదుఃఖ - ములఁ బొందుచుండుఁ
జెడుగులఁ గలిగించు - చొడలను దోఁచు
కొల దొంగతనమును . వలపను మూఁడు ౬౫

కాయదోషము లన - గణనకు నెక్కు
కల్ల కొండెమ్మును - కటువాక్కు వ్యర్థ
వాక్కును నాలుగు - వాగ్దోషములగు
కోరుట కినియుట - కూడని చూపు
నను చిత్తదోషంబు - లగు మూఁడుచేరి ౭౦

పది విధములఁ గల్గు - ఫలము లెఱుంగు
సన్మాతు లీత్రోవఁ - జనకుండువారు

---

1. మహారాజికలోకము మొదలగు నిరువదియాఱును ఊర్ధ్వలోకము లనియు, నరకలోకమాదిగా నాలుగును అధోలోకములనియు నడుమ నున్న మనుజలోకముతోడ ముప్పదియొక్క లోకములని ప్రమాణము ఇట పైలోకములు, క్రిందిలోకములు, మధ్యమలోకము నను మూడు లోకముల విభజనము కైకొనఁదగు

2. ఈ యాఱు తెగలు షడ్గతి యనఁబడు.

పోయిన, మృగములు - భూతముల్ నార
కలుగ మనశ్చింత - గలిగి పుట్టుదురు
పైని పదింటిని - వదలి శీలంబు ౭౫

దాలిచి దానమ్ము - తల ధరియించి
ప్రజగ వేలుపులుగ - బ్రహ్మలు గాఁగఁ
బ్రభవించి సత్కర్మ - ఫలములు మోద
మునఁ గుడుతురు - పుణ్య మొనరించువారు
*ఎఱుక యనఁగఁ గూర్కు - తఱినున్న తెలివి ౮౦

కర్తృత్వ భోక్తృత్వ - కార్యముల్లేక
సాక్షిమాత్ర మగుచు - జరగుచుండునది
నామరూపములన - జ్ఞానమ్ము వలనఁ
దెలియనౌ జీవుండు - దేహమునగును
అమరు షడాయత - న మను నింద్రియము ౮౫

లాఱు మాయు తఱిని - పేరెఱుకందు
విషయంబు లడఁపఁ ద - విన స్థానమగును
స్పృశత యనఁగఁ జిత్త - మింద్రియ మార్గ
మున విషయంబుల - ముట్టుట యగును
వేదన యనఁగఁ ద - ద్విషయమ్ము లనుభ ౯౦

* ఈ యెఱుక (విజ్ఞానము) పంచస్కంధములలో నొకటిగఁ జెప్పం
బడు.

వించుట యగుఁ దని - వి సనమి తృష్ణ
యగు నాల మమకార - మన సుఖమిచ్చు
వానితోఁ దానొంటి - వదలక యుంట
భవమనఁ గర్మ ని - వహామిచ్చు ఫలము
పద్ధతి యిదియని - పరికించుటగును ౯౫

జన్మమనం గర్మ - సంశీలములను
చక్ర నెఱుంగు వి - జ్ఞానఁబుతోడ
గతులందు కారణ - కార్యరూపములఁ
బ్రభవించుటగుఁ; గర్మ - ఫలమన నొప్పుఁ
గూటంబునందు తాఁ - గూడక యుండి ౧౦౦

పొరిదిని మేనికి - సుఖదుఃఖములను
వదలక చేకూర్చు - నది యగు; ముదిమి
యన మరణము దాఁక - నన్ని తత్త్వములు
నిలుకడ నుండక - నెఱిఁగృశియించి
సడలుట యగు; మఱి - చచ్చుట యనఁగ ౧౦౫

నామరూపంబుల - నలువొందు దేహ
మ స్తమించిన సూర్యు - నట్లగపడక
యుంట యవిద్య యం - దుండి సంస్కృతియు
సంస్కృతినుండి - విజ్ఞానమ్ము దాని
యందుండి నామ రూ - పాదులు గల్గు ౧౧౦

నామరూపమ్ముల - నయమునఁ దొడరి
యగు షడాయతనమ్ము - నగు దానివలన
స్పర్శమ్ము దానిచే - వఱలు వేదనము
కడుపుచేఁ దృష్ణ య - గును తృష్ణవలన
బంధంబు బంధ సం - బంధంబు వలనఁ ౧౧౫

గర్మ సంచయమగుఁ - గర్మ సంచయము
కారణమ్ముగ మఱి - గలుగు జన్మంబు
జన్మమ్మును దొడరి - జరయును రుజయు
మరణము చింత భ్ర - మము మూర్ఛ యేమ్ము
నను నేఁ డధిక దుఃఖ - జనకంబు లగును ౧౨౦

తొలి తుది కనరాని - వలయంబు పోల్కి
నీ యనుభవము తా - నెసవీడకుండు
మండలమని దీని - నందురు బుధులు
వీడు నంత నవిద్య - వీడు సంస్కృతియు
వీడ సంస్కారంబు - వీడు విజ్ఞాన ౧౨౫

మది వీడ నామ రూ - పంబు వీడు
నవి వీడ సోఁకు త - నంతన వీడు
స్పర్శంబువో నను - భవమును పోవుఁ
గుడుపు వోవఁగఁ దృష్ణ - కుదురుతో వదలు
వదలిన తృష్ణతో - బంధమ్ము వీడు ౧౩౦

బంధమ్ముతోఁ గర్మ - వారమ్ము తోలఁగుఁ
గర్మంబుతో జాతి - కదలు జన్మంబు
జన్మంబువోఁ బున - ర్జన్మంబు లేదు
మఱుబాము లేకున్న - మరణచింతాది
దుఃఖమ్ములెల్లను - తొలఁగు నీరీతి ౧౩౫

బంధమోక్షంబులు - పరఁగుచు నుండు
స్థిర నవిద్యయు సంసృ - తియు రెండు కార
ణములయి ప్రథమ ఖం - డమునఁగఁ బరఁగు
భావన నామ రూ - పములు షడాయ
తనము స్పర్శము కుడు - పనఁగ ద్వితీయ ౧౪౦

ఖండ మియ్యవి తొలి - ఖండ స్వభావ
జములగుఁ దృష్ణ - బంధము కర్మచయము
ననునవి రెండవ - యంగంబు వలనఁ
గలుగు దోషంబులు - గానఁ దృతీయ
ఖండమగుచు జన్మ - గదవార్ధకాంత ౧౪౫

ములు జన్మమునఁ గల్గు - ఫలములు కాన
నాలవ ఖండ మ - నంబడుచుండు
కర్మంబు చింతన - గలవాది సంధి
తృష్ణయుఁ గుడుపును - రెండవ సంధి
కర్మసంచయముచేఁ - గలుగు జన్మంబు ౧౫౦

తోడఁజేగిన వగు - మూఁడవ సంధి
మూఁడు విధముల బొ - ము నశించు తెఱిఁ
గలుగు నితర మార్గ - ముల తలంపరయఁ
బుట్టఁ గారణమగు - ము క్తి యనంగ
సిద్ధాంతముగను తో - చియును తలంపు ౧౫౫

నందడంగుట కుఱు - వొందంగఁ దోఁచి
యును చింతనము రూప - మొనఁగఁ దోఁచియును
కలిసి కల్గించు వే - ళ్ళులు నఱులుగను
కాలముల్ మూఁడింటి - గణియించు తెఱఁగి
స్థిర నవిద్యయు సం - స్కృతియుఁ జూడ భూత ౧౬౦

మనఁ దగు విజ్ఞాన - మును నామరూప
ములు షడాయతనమ్ము - లలసోఁకుఁ గుడుపు
బంధంబు తృష్ణయు - భవము జన్మంబు
వర్తమాన మనఁగ - వలయు జన్మమున
వ్యాధులు ముదిమియు - నంతంబు చింత ౧౬౫

భ్రమము నిర్వేదంబు - వగపును భావి
యనఁదగుఁ దృష్ణయు - నజ్ఞత పట్టు
నను మూఁడు దోషంబు - లనఁబడుచుండు
కర్మము భవమును - కార్య మనఁబడు
నామ రూపములు - విజ్ఞతయు షడాయ ౧౭౦

తనము స్పర్శమును వే-దనము జన్మంబు
ముదిమి రోగములును - తుది కర్మఫలము
లనఁబడు దుఃఖంబు - లనఁబడుచుండు
నవి సంభవించుచో - నైన దోషంబు
కర్మంబు ఫలము దుః-ఖము గలిగించు ౧౨౫

శీలంబు గలవస్తు-జాలంబు నిలుక
నంద దన్నింటికి- నాత్మసాక్షియని
తెలియ వచ్చునిది ము - క్తి స్వభావంబు
నామ రూపములు చిం-తనము [1]ద్వారములు
స్పర్శంబు కుదుపును-జన్మంబు ముదిమి ౧౩౦

వ్యాధులు చావును-భ్రమయుఁ జింతయును
విసుగు రోదనమును - వెసఁ గుమావంగఁ
బహువిధమై దుఃఖ- భవనమ్ము లంద్రు
ఆ దుఃఖ విశతికి - నజ్ఞాన కర్మ
తృష్ణలు భవ కర్మ-బృందము ననెడి ౧౩౫

యివి కారణములగు-నిల దుఃఖమునకు
పుట్టుకకును చూడఁ- [2]బట్టు కారణము
సుఖ ముక్తులకు నది - సుంతయు లేమి
కారణమగు నన- గనఁదగు నాల్గు
సత్యంబులగు రూపు-సంజ్ఞ వేదనము ౧౪౦

1. ద్వారములు = షడాయతనము. 2. పట్టు = మమకారము

సంస్కృతి యొుకయై - జరగు నీ యైదు
స్కంధపంచకమన - జగతి వర్తిల్లు
సునిశితగతి నార - సిన నాఱు పద్ధ
తులుగ నొప్పును పయిఁ - దోఁచిన వర్గ
మనుసరణమును గు - ణాతిశయంబు 195

కూర్చి పల్కుట యనఁ - గొఱలు నాలుగును
సత్య పద్ధతియు న - సత్య పద్ధతియు
సత్యంబు గలిగిన - సత్యపద్ధతి య
సత్యంబు గలిగిన - సత్యపద్ధతి య
సత్యంబు గలుగు న - సత్యపద్ధతియు 200

సత్యంబు గలుగు న - సత్యపద్ధతియు
వర్గ స్వభావమై - వఱలి దేహంబు
నీరు దేశంబన - నెగడారుచుండు
ననుసరణంబన - నగుఁ జెట్టునుండి
విత్తు విత్తునుండి - పృథివీజ మనుట 205

పుట్టిన దిదియని - ముదిసినదంచుఁ
జచ్చెననుచుఁ జెప్పఁ - జను మూట నొకటి
నతిశయించి పలుకు - టగును గుణాతి
శయమనఁ, గూర్చి వి - స్పష్టపఱచుట
అక్షర ఘటన - వాక్యంబగు ననుట 210

కొన్ని దినంబుల-కూడిక మాస
మనుటయె సత్య-పద్ధతియండ్రు; శశవి
షాణం బనుట చూయ-సత్య మార్గంబు
చిత్తంబుతోఁడఁ-జేర్చిన యనుభవము
సత్యంబు గలుగు న-సత్య మార్గంబు; ౨౧౫

చిత్తంబు విద్యుత్తు-చెన్నునఁ బుట్టె
ననుట యసత్యంబు-నెనసిన సత్య
మార్గంబు; హేతువు-మఱిలేక కార్య
మగుట యసత్య మం-దగు నసత్యంబు
శశవిషాణమ్ము భూ-స్థలిలేదు కాన ౨౨౦

పుట్టుక లేదంట; -పుడమిని నయము
లాఱంగ నాల్గగుఁ-జేరికనయము
చేరని నయమును-చేఁత లేనట్టి
నయము మఱి స్వభావ-నయమన నొప్పు
కారణ కార్యవ-ర్గమ్ము నొక్కటిగ ౨౨౫

నారంగఁ దెలియుట-చేరిక నయము
వెవ్వేఱఁ దెలియుట-వేరిమి నయము
కాంక్షింపఁ దగి పూర్తి-గాఁ జెడకుండఁ
గార్యంబునకుఁ దగు-కారణరూప
విజ్ఞాన మమరమి-విబుధులు దాని ౨౩౦

చేయని నయమని - చెప్పెడివారు
వరిగించలో నందు - వరిమొల్క యనుట
యర్థస్వభావ న - యంబంద్రు దాని
నివిగాక ఫలముల - నిచ్చు వేఱొండు
వస్తు వీ పృథివిలో - పలుఁ గాన రాదు ౨౩౫

వానిపైఁ దవులెడ్డు - వలదు ప్రాజ్ఞులకు
నాత్మకార్య మొకింత - యందు లేదనియుఁ
గలుగు కారణముచేఁ - గార్యము మిగియు
దానిచే నగునది - ధరణి లేదనియు
నాల్గు మార్గంబుల - నయమంద్రు మఱియు ౨౪౦

పొదలిన వివరణ - ములు నాల్గు కలవు
నిశ్చయించి ఫలము - నిగదించు టొండు
విభజించి పలుకుట - వెలయంగ రెండు
ప్రశ్న కుత్తరమిచ్చు - పద్ధతి మూడు
మౌనంబు దాల్చుట - మహి నాలుగంద్రు ౨౪౫

కలిగిన యది తుది - నిలుగునా? యనఁగ
నిలుగున యని నిశ్చ - యించి పల్కుటయు
గిట్టిన యాతఁడు - పుట్టునా? యనఁగ
వీడెనా మమతను - వీడఁడా? యనుచు
విభజించి చెప్పుట - వెలయు రెండవది ౨౫౦

విత్తు ముందా? మఱి - వృక్షంబు ముందా?
యనఁగ నే విత్తున - కరయ నే వృక్ష
మనుటయే ప్రశ్నకు - నగు నుత్తర బు
ప్రాఁతదా? క్రొత్తదా? - బయలు పూవనఁగ
మాటాడకుండుట - మౌన ధారణము ౨౫౯

బంధమోక్షములకుఁ - బరఁగు కారణము
లగువాని వివరించి - యరయ గఁ జెప్పఁ
దగువారు లేరేని - తనరు ననర్థ
ములకుఁ గామక్రోధ - మోహముల్ మూఁడె
కారణమ్ములనుచుఁ - గనుఁగొని నిత్య ౨౬౧

ము ననిత్యమును దుఃఖ - మున నాత్మయశుచి
యనుచుఁ బ్రత్యేకించి - యరసి బంధములఁ
గోయంగఁదగు ముము - క్షుఁడగువాఁడు
[1] మైత్రియుఁ [2] గరుణయు - మఱి [3] ముదితంబు

---

1. మైత్రి నభ్యసించి తెగువ పోటుఁడగిన యాసనమునుండి 'సర్వత్రము ప్రాణులెల్ల సంతోషమున జెలఁగుఁగాక ; దుఃఖము వ్యాధి దురాశ లేనివగు: గాక. మనుజులు దేవతలు నరకవాసు లెల్లరు ముదితమానసులగుదురు గాక' యని ధ్యానించుట. ఇది క్రోధమునకు శత్రువు.

2. కరుణ. జీవులు కష్టములనుండి గట్టెక్కి సనవంతులగుదురుగాక యని భావించుట.

3. ముదితము. భాగ్యవంతుల భాగ్య మెల్లప్పుడును తగ్గకుండుఁ గాక. ఎల్లవారును తమతమ సత్కర్మఫలము లొందుదురుగాక. యని భావించుట. ఇది యభ్యసించువారు తొలుత దమునీధిఁగాని పిదప గ్రామ

[4] నశుభగతి [5] నుపేక్ష - నారసి తేటి ౧౭౯

సద్భావనలచే దో - సంగులఁ ద్రెంపుండు
వహిఁ శ్రుతి చింతన - భావన దర్శ
నములఁ జింతించి మ - నంబున నరసి
నలి భ్రమ తొలఁగ నీ - నాల్గింటిచేత
నెడఁద తమము వీడి - యెలరారు మనుచు ౧౮౦

పూర్వోత్తరములకు - పొందిక చెడని
శుభ వాక్యములతోడ - సుజ్ఞాన దీప
మెంగ నై త్రిచూాప న - య్యాగురుఁబోణి యును
చిత్తమ్మునం దప - స్థిరబుద్ధినూని
ధర్మముల్ విని యెడం - దం దేటి యంత ౧౮౫

భవపాశము సడలి - వ్రయ్యఁగాకనుచు
మణిమేఖల వ్రతమ్ము - మహి నాచరించె.

శ్రీ శ్రీ శ్రీ

---

మున వాల దేశమున వాపై లోకమున నెల్లవారలు సుఖింతురు గాక యని భావింపవలయు. పై మాటిచే కోపము వదలవగు.

4. అశుభభావన. మేను ముప్పదిరెండు శవ్టములకు లోనగుననియు, పేడకుప్పలోని పురువువు పోలుననియు, మలమును వదలు ద్వారమువలె నశుభముల వెలినఱుచునదియు, జలదారివలె దుర్గంధమునే వెలిపుచ్చునది యనియు భావించి మమతవదలుట. దీనికి శీలక్షణభావవ యనియు పేరు కలదు.

5. ఉపేక్షాభావన. సమస్తప్రాణులను సమబుద్ధితో భావించుటయు వెగటు వినుకు లేకయుండుట యగును. ఇది పూర్వపు నాలుగింటికంటె గొప్పది. దీనికి సమచిత్తత్వమనియు పేరు. దీనిచె విభ్రాంతి తొలఁగింప నగు. చూ. పీఠిక.